

Dr. S.A. KHALEEL BASHA

M.B.B.S.,

M.L.A., CUDDAPAH

Phone : 4[illegible]115

ప్రజల కోసం

ప్రగతి కోసం

ఉత్తమ సాహిత్యాన్ని

ప్రచురించే కృషి ప్రారంభించిన

"నేత్రం" సాహితీ త్రైమాసపత్రికకు

ఇవే మా హార్ధిక శుభాకాంక్షలు

సదా ప్రజాసేవలో

**Dr. ఎస్.ఎ. ఖలీల్ బాషా**

M.L.A. కడప.

# నేత్రం

సాహితీ త్రైమాస పత్రిక

ఏప్రిల్ - జూన్ 1995

రూమ్ నెం.5
ఆలం కాంప్లెక్స్,
7 రోడ్స్ జంక్షన్,
కడప-516 001
ఫోన్స్ : 43208 (O)
3788 (Resi)

సంపుటి : 1 సంచిక : 1

విడిప్రతి రూ. 12/-

◆ కథానేత్రం ◆



## సాహితీ నేత్రం



◆ కవితా నేత్రం ◆








ఉపసంపాదకులు : నూకారామ్ ప్రసాద్‌రెడ్డి

# సంపాదకీయం

తెలుగునాట పత్రికలకూ, పాఠకులకూ కొరత లేదు. రకరకాల పాఠకులు........ వివిధ రకాల అభిరుచులు..... తదనుగుణమైన పత్రికలు యెన్నో వస్తున్నాయి.

దాదాపు పదిహేనేళ్ళ క్రితం సెక్స్, క్రైమ్, హర్రర్, రచనలు ప్రచురించే పత్రికలూ, వాటిని చదివే పాఠకులూ వేరుగా వారి వునికి వేరుగా వుండేది.

కానీ, ఇప్పుడు జరుగుతున్నదేమిటి? పాఠకుల అభిరుచి అనే మేలిముసుగులో అశ్లీల, అసభ్య, క్షుద్ర సాహిత్యం విశృంఖలంగా వెలువడుతోంది. ఈ రచనలు వాటికి వుద్దేశించిన పత్రికలలో వస్తే ఏ సమస్యా వుండేది కాదు.

ఇంటిల్లిపాది చదివే సకుటుంబ పాఠకులు గల చాలా మంచి పత్రికలలోనే ఈ విషసంస్కృతి రచనలు వెలువడుతున్నాయి. లాభాల కోసం, సర్క్యులేషన్ పెంచుకోవడం కోసం పూర్తి స్థాయి వ్యాపార నాగరికతతో తీండ్రిస్తున్నాయి. పాఠకులలోని అంతర్గత బలహీనతలను రెచ్చగొట్టే ఈ సాహిత్యం - వుత్ప్రేరకాలుగా, మాదకద్రవ్యాలుగా పని చేస్తోంది. కాకపోతే శృంగారం, పరిశోధన, అధ్యయనమనే ముసుగులు వేస్తూ - చక్కెరపూత విషగుళికలు పంచిపెట్టడం జరుగుతోంది.

సాంస్కృతిక ప్రచార సాధనాలు - పత్రికలు; సాంస్కృతిక రాయబారులు - సాహిత్యకారులుగా పేరున్న ఆ రోజులు పోయాయి.

కాగా, సామాజిక బాధ్యతతో రచనలు చేసే పలువురు దళితవాదం, స్త్రీవాదం పేర్లతో ఆరోగ్యకరమైన సాహిత్య వాతావరణాన్ని ఆందోళనామయం చేస్తున్నారు. దళిత సమస్యల్ని - దళితులే, స్త్రీల సమస్యల్ని - స్త్రీలే రాయాలనే వరకు పరిస్థితిని తీసుకెళ్తున్నారు.

ఎవరి సమస్యలను వారే తమ రచనల్లో ప్రస్ఫుటంగా వ్యక్తీకరించేందుకు అవకాశం వున్నమాట నిజమే! కానీ, ఆ సమస్యల నేపథ్యంగా యితరులు రాయకూడదనే ఆంక్షలెందుకు?

కులాల కింద, లింగభేదాల కింద సాహిత్యాన్ని వర్గీకరించడం వల్ల వూహిస్తున్న సామాజిక ప్రయోజనాల కంటే తలయెత్తే ప్రమాదాలే హెచ్చుగా వుంటాయి.

పాఠకుల మారిన అభిరుచుల పేరిట ఆ మేలిముసుగులో వచ్చే సమస్త అసభ్య రచనల్ని ఖండించాల్సి వుంది. సాహిత్యంలో బయల్దేరిన వింత వాదాల వివాదాలను నిజరుజుమార్గం పట్టించేపని - ఒక సహేతుక సాహిత్య విమర్శ ద్వారానే సాధ్యమౌతుంది.

సాహిత్య విమర్శ అనేది జవాబుదారీతో కూడిన పని. సామాజిక బాధ్యతతో కూడిన వ్యవహారం.

కానీ, సాహిత్య విమర్శనాతీరు కూడా రోగగ్రస్తమై కూర్చుంది. ఉత్తమ సాహిత్యాభిరుచి, సహేతుక పరిశీలన అనేవి విమర్శకుల్లో దీపంపెట్టి వెదుక్కోవల్సి వస్తోంది. ముందు ఏర్పరచుకున్న అభిప్రాయాలతో సాహిత్యాన్ని చూసే, తూచే విధానమే విమర్శకుల సంవిధానమై పోయింది.

సాహిత్యవిమర్శ - సృజనాత్మకత పెంచేందుకు దోహపడాలే తప్ప సాహిత్యలోకంలో అంధకారం రాజ్యమేలేందుకు ఆస్కారం యివ్వరాదు. మలిన బంగారాన్ని పుటంతో మేలిబంగారంగా మార్చేట్లు చేయాలి కాని, బంగారాన్ని కాకి బంగారంగా మార్చడానికి విమర్శే కావాల్నా!?

ఉత్తమ సాహిత్యాభిరుచి, సహేతుక పరిశీలనలునేపథ్యంగా సాహిత్యవిమర్శలు వచ్చినప్పుడే వర్తమాన సాహిత్య పరిస్థితి ఆరోగ్యకరంగా మారుతుంది.

సాహిత్య విమర్శకు ఒకస్థాయి, ఒక గౌరవం కల్పించిన రాచమల్లు రామచంద్రారెడ్డి లాంటి విమర్శకుల అవసరం యిప్పుడు యెంతో వుంది.

ఆ అవసరాన్ని గుర్తిస్తూ.... అందరికీ యెరుకపరుస్తూ నేత్రం సాహితీ త్రైమాసపత్రిక ప్రారంభసంచికను 'రారా'గారికి అంకితమిస్తున్నాం.

ఉత్తమసాహిత్యానికి సహేతుక విమర్శలకు వేదికగా నేత్రం సాహితీదృష్టి సారిస్తోంది. ఆ మార్గంలో మా ప్రయాణం సాగేందుకు అందరి తోడ్పాటు అవసరం.

అందుకు అందరి సహకారాన్ని ఆశిస్తూ..... ఆహ్వానిస్తూ ....

# ఓడిపోయిన సంస్కారం

— రాచమల్లు రామచంద్రారెడ్డి

1.

సుందరమ్మ కంతా కలలో వున్నట్లుంది. పెండ్లంటే మేళతాళాలూ, పెద్దల హడావుడీ, పిల్లల కోలాహలం, మొదలైనవన్నీ వుంటాయనే ఆమె మొదట భయపడింది. మూడేండ్లనాడు తన మొదటి పెండ్లి ఆ విధంగానే జరిగింది. ఈ రెండవ పెండ్లి యే ఆర్భాటమూ లేకుండా కొద్దిమంది ఆత్మీయుల సమక్షంలో



నవనాగరిక పద్ధతిలో జరుగుతుందని వారం రోజులనాడు తెలిసినప్పుడు ఆమె కెంతో మనశ్శాంతి కలిగింది. పెండ్లి ఐన సంవత్సరానికే వైధవ్యభారం నెత్తిన వేసు[illegible]ని పుట్టినిల్లు జేరిన తాను తిరిగి పెండ్లికూతురు వేషం ధరించాలంటే ఆమె చాలా సిగ్గుప[illegible] పునర్వివాహానికి ఆమె మొ[illegible] తీవ్రంగా వ్యతిరేకించినా తన యిద్దరి అన్నగార్లూ యెడతెగకుండా చేసిన హితోపదేశాలవల్లా, విధవ ఐన ఈ రెండేండ్లలోనూ తాను గడించిన జీవితానుభవంవల్లా, ఆమె ఈ రెండవ పెండ్లికి ఒప్పుకుంది. ఐనా ఒక సంవత్సరం పాటు భర్తతో కాపురం చేసిన తాను సిగ్గు పెండ్లికూతురుగా పదిమందిలోనూ ఎట్లా ప్రవర్తించడమా అన్న భయసంకోచాలు ఆమె మనస్సును పీడిస్తూనే వుండినాయి. అందువల్ల ఈ పెండ్లి యే ఆర్భాటమూ లేకుండా ప్రశాంతంగా జరిగిపోతుందని తెలిసినప్పుడు ఆమె సంతృప్తితో నిట్టూర్చింది. తీరా యిప్పుడు చూస్తే ఆ పాత ఆచారాల ఆర్భాటమే మేలనిపించేటట్లుంది. ఈ క్రొత్త వ్యవహారమంతా. పెండ్లేమో పది నిముషాల్లోనే అయిపోయింది. వచ్చిన బంధువులంతా, పురోహితునితో గూడా కలిసి యిరవైమంది కంటే యెక్కువ లేరు. తనకు సిగ్గు పడాల్సిన ఘట్టాలేమీ లేకుండానే

పెండ్లి ముగిసిందని ఆమె సంతోషిస్తూ వుండగానే - అంతలోనే ఉపన్యాసాల కార్యక్రమం మొదలైంది. ఒక్కొక్కరే లేచి పెండ్లి కొడుకును అభినందించడం, అతని సంఘ సంస్కరణాభిలాషను పొగడడం, అతని ఔదార్యాన్ని మెచ్చుకోవడం, ఆఖరులో ఆశీర్వదించడం - ఆమె కంతా అయోమయంగా వుంది. సుమారు గంట నుండి ఉపన్యాసాలు సాగుతున్నాయి. ఇప్పటికి ఐదారు మంది మాట్లాడినారు. ఇంకా యెంతమంది మాట్లాడుతారో? వి[illegible]లు పెండ్లి చేసుకోవడానికి యెవరైనా సి[illegible]డతారని మాత్రమే ఆమెకు తెలుసు. కాకపోతే ఈ కాలంలో అదేమీ తప్పుకాదనీ, అందువలనే విధవా వివాహాలు జరుగుతున్నాయనీ ఆమె అనుకుంది. కాని ఇందులో ప్రశంసించవలసిందేముందో ఆమెకు అర్థం కాలేదు. ఇంతలో ఒక యువకుడు లేచి, అందరూ పెండ్లి కొడుకైన రామనాథాన్ని మాత్రమే మెచ్చుకోవడం అన్యాయమనీ, సుందరమ్మ ధైర్యసాహసాలే యెక్కువగా మెచ్చుకోతగినవనీ ఉపన్యాసం మొదలు పెట్టినాడు. ఇదేదో మరీ విపరీతంగా కనపడిందామెకు. ఇందులో ధైర్యసాహసాలేమున్నాయి? జీవితమంతా సుఖపడాలనే ఆశతోనే తానీ పెండ్లికి సిద్ధపడింది. అందులో తన్ను అంత పెద్దగా పొగడవలసిందేముంది? ఇతరులకోసం తాను చేసిందేమీ లేదే? ఆ ఉపన్యాసం అయిపోయినంత వరకూ ఆమెకు ముండ్లమీద కూర్చున్నట్లే వుంది. అదృష్టవశాత్తు అది ఐన వెంటనే కాఫీ ఫలహారాల కార్యక్రమం ప్రారంభమైంది. తరువాత 20 నిముషాల్లో ఆమె భర్త గృహం చేరుకుంది.

రాత్రి భోంచేసిన వెంటనే పడక గదిలో మంచంమీద కూర్చుంది సుందరమ్మ. భర్త యెటువంటివాడా అని ఆలోచించడానికి పూనుకుంది ఆమె. కాని వెంటనే మూడేండ్లనాడు తనకు కార్యం అయిన నాటి పరిస్థితులకూ ఈనాటి పరిస్థితులకూ వున్నతేడా ఆమె మనసులో మెదలింది. ఆనాడు తన పెద్ద వదినె తన్నెంతో ఆప్యాయంగా అలంకరించి, గదివరకూ త[illegible]న్ను పిలుచుకొని వచ్చి వాకిలి దగ్గ[illegible] వదలిపెట్టి పోయింది. ఆనాడు భర్త తన కొరకు ఎదురుచూస్తూ వుండినాడు. సిగ్గుత[illegible], [illegible]త్సాహంతో, ఉత్కంఠతో తా నానాడు పడక గదిలో ప్రవేశించింది. ఆనాడు వదినెల పరిహాసంతో తన సిగ్గు మూరంతలు పెరిగినా, యేదో అపూర్వమైన సౌఖ్యం, అనంతమైన ఆనందం తన కందబోతున్నదని అర్థంకాని ఉత్సాహం కూడా తన్నావేశించింది. ఈనాడు తన్ను అలంకరించేవాళ్లూ లేరు, పరిహసించేవాళ్లూ లేరు. ఆ సిగ్గూ లేదు, ఆ ఉత్సాహమూ లేదు. ఈనాడు తానే వచ్చి పడక గదిలో భర్తకొరకెదురుచూస్తూ కూర్చుంది. ఈనాడు తనకు కలగబోయే సుఖం యొక్క స్వరూపం తెలుసు. అందువలన ఆనాటి ఉత్కంఠ లేదు. ఆనాడు తన ఉద్దేశాలతో నిమిత్తం లేకుండా యితరులు తన్నొక సుఖ సముద్రంలో త్రోసినారు. ఈనాడు తాను బుద్ధిపూర్వకంగా స్వప్రయత్నంతో ఆ సుఖ సముద్రాన్ని సమీపించింది. ఈ సుఖం తాను విధి నెదిరించి సంపాదించుకొన్న సుఖం. ఇది తన జన్మహక్కు. తన జన్మహక్కు కొరకు యెదురు చూడడంలో సిగ్గుపడవలసిందేమీ

ఒక నవలలోని పాత్రలు ఫోటోగ్రాఫ్‌ల సంపుటి కాదు. ఒక వ్యక్తికి సంబంధించిన శాఖలో ప్రశ్న పరంపరల ఫైలూకాదు. రచయిత ఊహా చిత్రాలే ఆ వ్యక్తులయినా వారు వాస్తవిక వ్యక్తులే. ఎందుచేతనంటే, జీవితాన్ని లోతుగా చూచి అన్వయించే నైపుణ్యం గల రచయిత ఆ పాత్రలకు జీవం పోస్తాడు.

— ఇల్యా ఎహ్రెన్‌బర్గ్

లేదు. తన హక్కు లభ్యమైనప్పుడు తానెవ్వరికీ కృతజ్ఞురాలు కానక్కర లేదు.

ఈ రామనాథం యెటువంటివాడో అన్న ప్రశ్న ఆమెకు మళ్లీ జ్ఞాపకం వచ్చింది. ఔను - భర్త గుణగణాల మీదే తన జీవితమంతా ఆధారపడి వుంటుంది. అతని స్వభావం మీదనే తన సుఖశాంతులన్నీ ఆధారపడుతాయి. అతను మంచివాడైతే తన బ్రతుకంతా ఒక పూలపాన్పు. అతను మంచివాడు కాకపోతే - ఐనా, అతను మంచివాని మాదిరే వున్నాడు. తప్పక మంచివాడే ఐవుంటాడు. లేకపోతే తన అన్నలు తనవెందుకు అతనికిచ్చి పెండ్లి చేస్తారు! ఏమో? మొదట మంచివాళ్ళుగానే వుండి తరువాత యెంత మంది పెండ్లాలను వేధించుకు తినడం లేదు? ఇతని సంస్కారం ఎటువంటిదో? తన బ్రతుకంతా యితని స్వభావ సంస్కారాల మీదనే యేర్పడుతుంది.

సుందరమ్మకు యింకో విషయం జ్ఞాపకం వచ్చింది. మూడేండ్లనాడు యిదే పరిస్థితిలో భర్త యెటువంటివాడు అన్న ప్రశ్న తనకు తట్టనే లేదు. ఆనాడు తనకు కలగబోయే సుఖాన్ని గురించే తాను ఊహించుకుంది. తన భవిష్యజ్జీవితాన్ని గురించే గాలి మేడలు కట్టుకుంది. ఆనాడు తన భర్త అందచందాలను గురించైనా కొంతవరకు తనలోతాను వితర్కించుకుందేగాని, అతని స్వభావ సంస్కారాలను గురించిన ఆలోచనే తనకు రాలేదు. ఈ విషయం జ్ఞాపకం వచ్చి ఆమె ఆశ్చర్యపడింది. వెంటనే కారణం స్ఫురించి తనలో తాను నవ్వుకుంది. పురుషుల స్వభావ సంస్కారాలే స్త్రీల సుఖ సంతోషాలను నిర్దాక్షిణ్యంగా నిర్ణయిస్తాయని ఆనాడు తనకు తెలియదు, ఆనాడు తెలియనివి ఈనాడు తనకెన్నో తెలుసు. ముఖ్యంగా స్త్రీలు సుఖపడానికి పురుషుల ఆకారాల కంటె పురుషుల మనస్సులే ప్రధానం

## అర్థంలేని బహుమతి

బెర్నార్డ్‌షాకు సాహిత్యంలో నోబెల్ బహుమతి ఇచ్చారు. బహుమతి ప్రదానం జరిగాక షా ఇలా వ్యాఖ్యానించారు. ——— '' వీళ్ళు నిజంగా ఈ బహుమతి ఎందుకిస్తారో తెలీదు. రచయిత డబ్బు అవసరంతో మగ్గుతున్నప్పుడు పట్టించుకోరు. డబ్బు అవసరం తీరిపోయాక రచయితకు ముసలితనంలో లక్షలు కురిపిస్తారు. ''

అన్న విషయం తనకు బాగా తెలుసు. అందుకే ఈ పెండ్లి ఖాయమైనప్పటి నుండి ఈ ప్రశ్న యెడతెగకుండా తన కెదురౌతూనే వుంది. ఈ రామనాథం యెటువంటి వాడు? ఇతని మనస్సు యెటువంటిది?

వాకిలి దగ్గర చప్పుడౌతూనే ఆమె తలయెత్తి చూసింది. భర్త కనబడగానే లేచి నిలబడింది. '' సుందరీ, పెండ్లిలో నీకేమీ కష్టం కలుగలేదు గదా? '' అంటూ రామనాథం ఆమెను సమీపించి, మంచంమీద కూర్చొని, ఆమెను కూడా కూర్చోమన్నట్లు ఆమె భుజంమీద చేయివేసి బరువుగా నొక్కినాడు. అతని ప్రక్కనే కూర్చుంటూ '' లేదండీ '' అన్నది.

రామనాథం ఉత్సాహంగా అందుకున్నాడు. '' ఏర్పాట్లన్నీ స్వయంగా నేనే చేయించినాను తెలుసా? నీ మనస్సు కేమీ ఆయాసం కలగకూడదని నేనెంత శ్రద్ధ తీసుకున్నా ననుకున్నావ్? ''

'' ఊ '' అన్నది సుందరమ్మ నిరుత్సాహంగా.

రామనాథం మరింత ఉత్సాహంగా అన్నాడు: '' ఊ అనడం గాదు సుందరీ! నీ సుఖం కొరకు నా జీవితమంతా ధారపోయడానికి సిద్ధంగా వున్నానంటే నమ్ము. ఈ పెండ్లిని గురించి యెంతమంది బంధువులకు దూరమైనా ననుకున్నావ్? అంతెందుకూ - రేపు పత్రికలో చూస్తావుగా నేను నీకొరకెంత త్యాగం చేసిందీ. ''

ఇంతవరకూ నేలకేసి చూస్తూ వున్న సుందరమ్మ తల యెత్తి రామనాథం ముఖంలోకి చూసింది. ఆ ముఖంలో వంచన యెక్కడా కనబడలేదు. అతని కన్నుల నిండా ఆత్మ సంతృప్తి తప్ప మరేభావమూ లేదు. ఆమె మెల్లగా అడిగింది: '' నా కొరకు అంత త్యాగం చేయవలసిన పనేముంది మీకు? '' అది ప్రశ్నగా కాక తన అభిప్రాయం చెప్పినట్లు శాంతంగా చెప్పబోయింది ఆమె. కానీ, మధ్యలో అప్రయత్నంగా కంఠం వొణికి అది ప్రశ్నగా ధ్వనించింది. తనకు తెలియకుండానే తనలో కలిగిన ఆవేశానికి సిగ్గుపడి ఆమె మళ్ళీ తలవంచుకుంది.

రామనాథం యివన్నీ గమనించకుండానే వెంటనే జవాబు చెప్పినాడు. '' అదేం మాట సుందరం? మానవులన్న తర్వాత ఆదర్శాల కొరకు త్యాగం చెయ్యకపోతే యెట్లా? నీబోటి యువతులందరూ నిష్కారణంగా జీవిత సౌఖ్యాలకు దూరమై ఉసూరుమంటుంటే మన సంఘం

## •మానవతావాది•

రెండో ప్రపంచయుద్ధం జరుగుతున్న కాలంలో సుప్రసిద్ధ నాటకకర్త బెర్నార్డ్‌షా బ్రిటిష్ సైనికులు జర్మనీ సైనికులపట్ల నిర్దయగా వ్యవహరించడాన్ని నిరసించి ఇంగ్లండులో సంచలనం లేవదీశాడు. బ్రిటన్ ప్రజానీకమంతా ఆయన్ని దుమ్మెత్తి పోసింది. అయినా బెర్నార్డ్‌షా చలించలేదు. '' ప్రతి బ్రిటిష్ సైనికుడూ క్షతగాత్రుడైన ఒక జర్మనీ సైనికుణ్ణి కాపాడి సేవచేస్తేయుద్ధం ఎందుకు సమాప్తమవదో చెప్పండి '', అని పత్రికాముఖంగా ఎదురుప్రశ్న వేశాడు. షా వేసిన ప్రశ్నకు జవాబే లేకపోయింది.

# రాత్రిమజిలీ

-పాపినేనిశివశంకర్




దూరం సుదూరం
సాయం సంధ్య -
నీడలు ఆవరిస్తున్నాయి
రాత్రి నల్లబడుతోంది
దూరం ఎంతో దూరం
పిట్టలు నిట్టూర్చాయి
ఎన్నో కాలిగుర్తులు కాలంలో
కరిగిపోయాయి
మహా ప్రవక్తల వాక్యాలు
కన్నీళ్లు కార్చాయి
మొగ్గలు రాలిన దారి
స్వప్నాలు నలిగిన దారి
గాయాల నిశ్శబ్ద రోదన
మజిలీ ఒక మరీచిక
దూరం ఎంతో దూరం
కొత్తలోకం చేరాలి
ప్రపంచం పువ్వును వదిలం
చెయ్యాలి
నేల పరిమళించాలి
అలసట ... అలసట ... అలసట
ఆగే నిశ్చల బిందువు లేదు
కదలని శిథిల శరీరం
కానీ
హృదయానికి కాళ్లున్నాయి ●

బాగుపడేదెట్లా ?''

సుందరమ్మ మౌనంగానే వుంది. అతని మనస్సును అర్థం చేసుకోడానికి ఆమె ప్రయత్నిస్తూ వుంది. ఈ మనిషికి నన్ను సుఖపెట్టాలని యింత తాపత్రయ మెందుకో? తాను సుఖపడాలనే ఆశ యితనికే కోశానా లేదా? ఆమె ఆలోచనలు రామనాధం సాగనివ్వలేదు. రెండు చేతులతోనూ ఆమె ముఖం తన వైపుకు తిప్పుకొని అతనన్నాడు: ''యిటు చూడు సుందరం, యీ పెండ్లి కాకుండా వుంటే నీ జీవితమంతా యెట్లుం టుందో ఊహించుకున్నావా? నేను త్యాగం చెయ్యకపోతే నీ బ్రతుకులోని చీకటంతా తొలగి పొయ్యేదెట్లా?''

అతని కన్నుల్లోకి చూస్తూ వున్న సుందరమ్మ కనురెప్పలు వాల్చి విచారంగా చిరునవ్వు నవ్వింది.

రామనాధం ఆమె చిరునవ్వును మాత్రమే చూసినాడు. ఆ చిరునవ్వు లోని విచారాన్ని గమనించే స్థితిలో లేదు అతను. ''చూడు- యిప్పుడు నీ బ్రతుకంతా వెన్నెల అయింది. నా త్యాగమంతా నీ చిరునవ్వు రూపంలో ఫలించినందుకు నాకెంత ఆనందంగా వుందనుకున్నావ్?'' అని అన్నాడు సంతృప్తి, సంతోషం నిండిన కంఠంతో.

సుందరమ్మకు ఒక్కసారిగా భవిష్య త్తంతా అంధకారమయమైంది. 'ఇంత త్యాగం జీవితమంతా మోసే శక్తి నాకు లేదు' అని బిగ్గరగా అరవాలనుకుంది. ఆమె దిగ్గున లేచి నిలబడింది. అంతలోనే తన అసహాయత మెరుపు వలె ఆమె మనసులో తోచింది. కండ్లు తుడుచుకుంటూ రామనాధం పాదాల దగ్గర నేలమీద కూర్చొని, ''మీ త్యాగానికి తగిన యోగ్యత నాకు కలిగేటట్లు ఆశీర్వదించండి'' అని గద్గద కంఠంతో పలికింది.

(జనవరి 1958)

# నేటి సాహిత్య విమర్శ - ఒక పరిశీలన -

— డాక్టర్ నార్నె సురేష్ బాబు

సాహిత్యం ఎప్పుడూ మారుతుంటుంది. మారుతున్న కాలాన్ని బట్టి సాహిత్యం మారినట్టే విమర్శ కూడా మారాలి. విమర్శ ప్రతిపాదనలు, సూత్రాలు కొత్తవి చోటు చేసుకోవాలి. అయితే తెలుగులో ఇంతవరకు సక్రమమైన సాహిత్య విమర్శ సుస్థిరంగా అభివృద్ధి చెందలేదు. చెందకపోగా ఈ మధ్యకాలంలో చాలా విపరీత పరిణామాలు విమర్శ రంగంలో జరుగుతున్నాయి. విమర్శకులు ముందుగా శాస్త్రాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చెయ్యకపోవటం, అహంభావం, పక్షపాతం, కుల ప్రమేయం మొదలగు కారణాల వలన విమర్శ క్షీణించి పోయింది. కొన్ని ఉదాహరణల ద్వారా ఈ విషయాన్ని వివరిస్తాను.

వెనకటి కవుల్ని అంచనా కట్టేటప్పుడు ఆనాటి చారిత్రక పరిస్థితులు, సామాజిక పరిస్థితులు పరిగణనలోకి తీసుకోవాలి. ఆ కవులు, రచయితలు చేసిన కృషేమిటో గుర్తించాలి. అంతేగాని, గొప్పరచయితల మీద రాళ్లేస్తేనే విమర్శకుల మవుతా మనుకోటం పొరపాటు. గురజాడ, కన్యాశుల్కంలో బ్రాహ్మణ భావజాలం ఉందనీ, దళితుల ప్రస్తావన లేదని బి.ఎస్. రాములు లాంటి విమర్శకులన్నారు. ఉన్నవ 'మాలపల్లి' కూడా దళితుల్ని పక్కదారి పట్టించిందని కొంతమంది ఆరోపణ. ఇట్లాగే రావిశాస్త్రి రచనల్లో దళితుల ప్రస్తావన లేదనీ ఆరోపించారు. కానీ గురజాడ తన కన్యాశుల్కంలో బ్రాహ్మణ భావజాలాన్ని, వ్యతిరేకించాడే, గాని ఎక్కడా సమర్థించలేదు. ఇవాల్టి సామాజిక నేపథ్యంలో రూపుదిద్దుకున్న దళిత చైతన్యం గురజాడ కెట్లా ఉంటుంది? కులాలపేరు పెట్టకపోయినంత మాత్రాన రావిశాస్త్రి దళితుల బాధలు చెప్పలేదా? గోవులోస్తున్నాయి జాగ్రత్త ఎవరి కథ? 'నిజం' నాటకంలో అన్యాయానకి గురైందెవరు? పోతే మాలపల్లి'లో కథానాయకులు సంగదాసు, రామదాసు దళితులే గదా? అసలు 'మాలపల్లి'కే మరోపేరు సంగ విజయం' అని కదా?

అట్లాగే చలం బ్రాహ్మణ వాది' అని ఒక ముద్ర వెయ్యటానికి ఇటీవల ప్రయత్నం జరిగింది. ఆంధ్రజ్యోతి వారపత్రికలో ఖాదర్ మొహియుద్దీన్ '' బ్రాహ్మణీకం నుంచి బ్రాహ్మణీకం దాకా'' అని వ్యాసాలు రాశాడు. చలం తొలినుంచీ బ్రాహ్మణ సంప్రదాయం మీద తిరుగుబాటు బావుటా ఎత్తాడు. 'మైదానం, నేనం చేశాను, ఎరికలమ్మ' మొదలైన కథల్లో బ్రాహ్మణ సంప్రదాయాల్ని డైరెక్ట్‌గా ఖండించాడు. ఈ విమర్శకులికి బ్రహ్మణత్వం మీద ద్వేషం కాకుండా బ్రాహ్మణ ద్వేషం ఉండటం చేతనే చలాన్ని ఆ రకంగా విమర్శించటం జరిగింది.

కులమతాల్ని బట్టి సాహిత్యాన్ని కుదించటం శోచనీయం, అగ్రవర్ణ కవులనీ, నిమ్న కులాల కవులనీ వర్గీకరించటం చాలాచాలా దుర్మార్గాలకి దారి తీస్తుంది. సాహిత్య రంగంలో రిజర్వేషన్లు ఏమిటి? ఈ మధ్య కాలంలో కవుల కులాల పట్టిక ముందుపెట్టుకుని తయారుచేసిన 'చిక్కనవుతున్నపాట' అనే దళితుల కవితల పుస్తకం వచ్చింది. గుంటూరు లక్ష్మీ నరసయ్య, త్రిపురనేని శ్రీనివాస్ దీనికి సంపాదకులు. ఇది దళిత కవిత్వమని ప్రకటించారు. ఇందులోని కవులంతా ఎస్.సి., ఎస్.టి., బి.సి., మైనారిటీ కవులని తెలుసుకోవటానికి మాత్రమే ఆ పుస్తకం ఉపయోగపడింది. ఈ వర్గీకరణ ఎందుకో వాళ్లకే తెలియాలి. దళితుల్ని ఉద్ధరించేందుకు ఉపయోగపడే, కవిత్వమంతా దళిత కవిత్వమే అవుతుంది గదా? పోనీ అందులోని ప్రసేన్, అఫ్సర్, ఖాదర్ మొదలైన కవులు దళితులు ఎట్లా అవుతారు? పైగా దళితుల సమస్యలే ప్రస్తావించని కవితలెన్నో ఆ పుస్తకంలో ఉన్నాయి. మరి దళిత కవుల్లోనూ బూర్జువా కల్చర్ చోటు చేసుకున్నప్పుడు కూడా వాళ్లు దళిత చైతన్యం ఉన్న కవులే అవుతారా? లక్ష్మీ నరసయ్య, శివారెడ్డి కవిత్వంలో 'అర్ఘ్యమివ్వటం' లాంటి హిందూ మత ప్రతీకలు చోటు చేసుకున్నాయని విమర్శించాడు. మరి క్రైస్తవ మత సంకేతాలు గల సతీష్ చందర్ కవితలు తన సంకలనంలో ఎట్లా చేరాయో అతనే చెప్పాలి. 'దేశీయ మార్క్సిజమే దళితుల ఎజెండా' అని ఆ సంపాదకుడు ఒక ప్రకటన చేశాడు. మార్క్సిజం ఒక తాత్విక సిద్ధాంతం. దానికి కులమత పరిమితులుండవు. దేశీయ మార్క్సిజం, రాష్ట్రీయ మార్క్సిజం, జిల్లా మార్క్సిజం అంటూ ఉండవు. మార్క్సిజాన్ని, అంబేద్కరిజాన్ని ఏ పునాది మీదైనా కలగా పులగం చేసే వీలు లేదు. పోతే అగ్రవర్ణాల్ని తిట్టటమే దళిత కవిత్వం అనిపించుకోదు. '' ఒరేయ్ లంకొడకా'' అంటూ అగ్రవర్ణాల్ని తిట్టిన కవితలు ఈ పుస్తకంలో చేర్చటం వల్ల సంపాదకుల సంస్కారమే బయటపడుతుంది.

విమర్శకుల్లో అహంభావం చాలా ప్రమాదకరం. చేతుల్లో ఆయుధం ఉందిగదా అని విచ్చలవిడిగా ప్రవర్తించ రాదు. ఈ మధ్యకాలంలో వల్లభాచార్య ఆంధ్రప్రభ నపత్రికలో తెలుగు కథమీద ఒక వ్యాసం రాసి మధురాంతకం రాజారాంగారి తర్వాత కథారచయితలు ఆగిపోయారని ప్రక ంచాడు. నేటి తెలుగుకథకి రక్తమాంసాలు లేవనీ, కథల పుస్తకాలు మంచివి రావటం లేదని విచారం ప్రకటించాడు. అసలు తెలుగు కథే చచ్చిపోయిందని అఫ్సర్ అన్నాడు. వాస్తవానికి 1990 నుంచీ కథ బలం పుంజుకుంది. 'ఆహ్వానం', 'రచన' లాంటి కథల పత్రికలు, కథాస్రవంతి, కథాసాహితి, కథావేదిక లాంటి సంస్థలు ప్రచురిస్తున్న కథా సంకలనాలు, విరివిగా రచయితలు వేసే కథల పుస్తకాలు గానీ పరిశీలించితే ఇది తెలుగుకథకి స్వర్ణయుగమని తెలుస్తుంది. అట్లాగే బి. తిరుపతిరావు అనే ఇంకో కొత్త విమర్శకుడు 1980 తర్వాత విప్లవ కవిత్వం అంతరించి పోయిందని స్టేట్‌మెంట్ చేశాడు. దాన్ని సమర్థించుకోటానికి శ్రీశ్రీ మొదలుకుని మహాకవులందర్నీ వరసబెట్టి ఏకేశాడు. దీనిబట్టి విమర్శకుల అహంకారం ఏ స్థాయిలో ఉందో తెలుస్తుంది.

భాషమీద అధికారం లేకపోతే విమర్శకులు చేసే తప్పులకి అంతుండదు. ఈ విషయంలో కొంతమంది ప్రాథమిక తరగతిలోనే ఉన్నారు. ఉదాహరణకి Objective Correlative అనేది T.S.Eliot ప్రతిపాదించిన విమర్శ సూత్రం. దానికి ఒక విమర్శకుడు 'వస్తు సత్సంబంధి' అని అనువాదం చేశాడు. 'సత్' అంటే 'మంచి' అని అర్థం. 'Co' అనే Prepositionకి 'సహ' అని అనువాదం చేయాలి. ఆ రెండుమాటలకీ తేడా తెలీలేదు ఆ విమర్శకుడికి. అట్లాగే defamiliarization అనే ఇంగ్లీషు మాటకి 'అపరిచితీకరణ' అని ఇంకో విమర్శకుడి అనువాదం. 'కరణ' ప్రత్యయం చేరినప్పుడు ఏ భాషాశాస్త్రం ప్రకారం ఆ శబ్దం తయారవుతుందో ఆ విమర్శకుడే చెప్పాలి. అట్లాగే machanisation అనే మాటకి 'యాంత్రికీకిరించటం' అని అనువాదం. 'యంత్రీకరించటం' అనవచ్చు ? 'శంబుకూడు' అనే పాత్ర రామాయణంలో వస్తుంది. అది తెలీక దాన్ని 'శంభూకుడు' అని మాటిమాటికీ రాసే విమర్శకుడి జ్ఞానం గురించి అనుమానం కలిగితే తప్పేముంది?

తెలుగే సరిగ్గారాని ఈ విమర్శకులు ఇంగ్లీషు మాటల్ని వల్లెవేసి తమ పాండిత్యం ప్రదర్శించాలని చూస్తారు. ఇదో ఫ్యాషన్‌గా తయారైంది. ఇంగ్లీషు కొటేషన్లు గుప్పిస్తారు. ఆ సిద్ధాంతాలన్నీ తెలుగు కవిత్వానికి అప్లై చెయ్యాలని చూస్తారు. ఈ మధ్య ఆంధ్రజ్యోతి దినపత్రికలో వచ్చిన 'పునర్లేఖన వాదం' అనే వ్యాసం (బి. తిరుపతిరావు) దీనికో వుదాహరణ. 'రివిజనిజం' అనే ఇంగ్లీషు కవితా సిద్ధాంతాన్ని తెలుగులోకి దించాలని అతని ప్రయత్నమంతా. దీన్ని అనుసరించి ఓ కవి ఇంకో కవిని చూసి కవిత్వం రాస్తాడట. అందుకు దాఖలాగా అతను తెలుగు కవుల్లో సాధారణంగా ఉండే కొన్ని పోలికలు తీసుకుని ఆ కవుల సారాంశం వదిలేసి వాళ్లని వీళ్లు కాపీ కొడుతున్నట్టు తీర్మానించాడు. తెలుగు కవిత్వానికి ఏ మాత్రం సంబంధంలేని సిద్ధాంతాల్ని అప్లై చెయ్యబోతే ఇట్లాంటి ఘోరాలే జరుగుతాయి. ఇది చాలదన్నట్టు కాపీ పాండిత్యం గూడా చోటు చేసుకుంది. ఈ మధ్యకాలంలో ఆంధ్రజ్యోతి దినపత్రికలో 'కవిత్వనిర్మాణ పద్ధతులు' అనే వ్యాసాలు 'Post modernism' అనే పుస్తకం నుంచి సంగ్రహించినవే కావటం గమనార్హం.

విమర్శకులే రచయితలకు సిలబస్‌లు తయారుచేసి ఆ ప్రకారంగా కవిత్వం రాయాలని శాసించటం మరీ ఘోరం. విమర్శకుల పరిధి ఎంత వరకో వాళ్లకి తెలీదు. ఉదాహరణకి గుంటూరు లక్ష్మీ నరసయ్య అనే విమర్శకుడు శివారెడ్డి 'అజేయం' మీద విమర్శచేస్తూ ఆ కవి దళిత కవిత్వం రాయలేదని తప్పుపట్టాడు. మళ్లీ అదే విమర్శకుడు దళితేతరులు రాసేది దళిత కవిత్వం కాదని తీర్మానిస్తాడు. ఈ వైరుధ్యం ఏమిటో అర్థం గాదు. అట్లాగే ఆశారాజును విమర్శిస్తూ అదే విమర్శకుడు ఆ కవి కుల సమస్య మీద ఎందుకు రాయలేదని ఆరోపణ చేశాడు. ఈ విమర్శకుల కున్నట్టువంటి కుల కండూతి కవుల కెందుకుండాలో తెలీదు. అసలు కవుల్ని ఈ విషయం మీదే రాయాలని శాసించటానికి ఈ విమర్శకు లెవరు? కవికి స్వేచ్ఛ ఉండనక్కర్లేదా?

పత్రికల్లో పనిచేసే వాళ్లే కవులూ, విమర్శకులూ అయిపోవటం చేత తమకీ, తమ వాళ్లకి సంబంధించిన రచనలే వేసుకోవటం, లేదా తమని పొగిడేరచనలే వేసుకోవటం ఆనవాయితీ అయింది. కొత్తగా రాసే ప్రతిభావంతులకి అవకాశాలు కల్పించటం లేదు.

ఈ విధంగా చూస్తే సాహిత్యరంగంలో కుట్రలు జరుగుతున్నాయేమోనని అనుమానించాల్సి వస్తుంది. సాహిత్యం వ్యక్తిగత స్వార్థ ప్రయోజనాలకి బలికాకుండా నిలబడాలని ఆశిద్దాం ●



# నల్లెల మల్లారెడ్డి ఆవేదన




ఎక్కడున్నావమ్మ తల్లీ
ఎండిపోయిన కల్పవల్లీ (ఎక్కడ)
ఒకనాడు నీతలపు
ఉగ్రూతలూగించె
వెలరేగి దేశమే
జేజేలు కొట్టింది
ఆ ఆశలీనాడు
అడియాసలుగ మారె (ఎక్కడ)
అయిదేండ్ల పథకాల
అంచెగుర్రాలపై
పరుగు పరుగున నీవు
తరలివస్తావంచు
ఎదురుతెన్నులుచూసి
వేసారిపోయాము (ఎక్కడ)

తిండి బట్టల గూర్చి
దిగులెందుకన్నారు
తిన్నగాభూమికి
దిగివచ్చునన్నారు
నమ్మించిమా పుట్టి
నట్టేట ముంచారు (ఎక్కడ)
నల్లడబ్బులుచల్లి
కొల్లగొట్టే వాళ్ళు
దొంగనోట్లను మార్చి
దోచుకొను మగవాళ్ళు
మా మొనగాళ్ళు
రాజకీయాలలో
రాణించుతున్నారు (ఎక్కడ)
డబ్బుకోసం ఎట్టి
గబ్బునైనా మింగు
ఇబ్బంది గాళ్ళంతా
సిబ్బందిలోదూరి
లంచాలు భోంచేసి
లక్షాధిపతులైరి (ఎక్కడ)

మండుతున్నవి ధరలు
మండుతున్నది బ్రతుకు
ఎన్నాళ్ళు ఎన్నాళ్ళు
ఎన్నాళ్ళు ఇల్లాగ
కన్నీళ్ళతోమమ్ము
కడతేరమంటావు (ఎక్కడ)
బ్లాకు మార్కెట్టుదార్లు
పట్టి బంధించిరో
అధికార భూతాలు
అదుపులో వుంచెనో
కోటీశ్వరులు నిన్ను
కొని దాచుకొన్నారో (ఎక్కడ)

మళయాళీ కవిత

# వృద్ధులకు ప్రత్యేకం

— కె. అయ్యప్ప పణిక్కర్

అనువాదం: నిర్మలానంద

మై డియర్ డాడీ!
మళయాళం రాయడం చాలా కష్టం!
మీరు కులాసాయే గదా
ఇక్కడ బొంబేలో అంతా కుశలమే
స్మగ్‌లింగ్ చేయడంలో ఎలాంటి ఇబ్బందీ లేదు
ఎకనామిక్ రిఫార్మ్ అంటే
అర్థమయి పోతుంది
ప్రస్తుతం ప్రయివేటైజేషన్ క్రమంలో వున్నాం



ఓ ముఖ్య విషయం డాడీ!
హజబెండ్ అన్నారు
అయినా నా అభిప్రాయం కూడా అదేను
'మమ్మీ యిహ ఎలాగూ లేదు
ఎటొచ్చీ డాడీ ఒక్కరే గదా
అంత పెద్ద కొంప ఎందుకు?'
లోయర్‌క్లాస్ ఉనికి కనుమరుగయి పోతున్న ఈరోజుల్లో
సర్వెంట్స్ దొరకడం చాలా కష్టం గదా!

మీరు వుండేందుకు ఓ వంచను చేశాం
అదే మీకు అనువయిన చోటు అనుకుంటున్నాం
'వృద్ధజన.... నంథింగ్....'
ఓల్డ్ ఏజ్ హోమ్ అంటే
అర్థమవుతుందను కుంటాను

మానైబర్ తాలూకు మమ్మీ డాడీ కూడా
వుంటున్నది అక్కడేను
త్రీ టైమ్స్ మీల్స్... టీ.వీ. చూయించడం
మధ్య మధ్య నాలిగింటికి సమోసాలు టిఫినుగా
చనిపోతే తెలిజేయడానికి
అక్కడుంది ఓ టెలిఫోను!
అంతా బావుంటుంది.

ఇంగ్లీషు మీడియంలో
చదువుతున్నారు గదా పిల్లలు!
అందువల్ల రావడం కష్టం మేము
బొత్తిగా గిట్టదు పిల్లలకి
మళయాళం భాష అంటే
మీరు '...హోమ్' లో చేరిపోతే
అక్కడ మనింటికీ మన పొలానికీ
మంచి ధరే పలుకుతుంది

ఇక్కడో ఫ్లాట్ చూసి వుంచాం
రెండువారాల్లో మీ అల్లుడుగారు వచ్చి
...హోం'లో చేరుస్తారు మిమ్మల్ని
ఎక్కువ డబ్బు అట్టే పెట్టకండి బ్యాంకులో!
రేపేం జరుగుతుందో ఎవరు చెప్పగలరు?
ఆ అమ్మిన డబ్బుతో కొనేస్తాం షేర్లు
డాడీ నుంచి లభించే గిఫ్టుకి
మీ 'బేబీ' ఎంతో సంతోషిస్తుంది!
మీరు మరోలా ఫీలుకాకండి
మీరే గదా నన్ను ఇంగ్లీషు మీడియంలో చేర్పించింది.
అందుకే నాకు
ఇంగ్లీషు అంటే యిష్టం
వెరీగుడ్ ల్యాంగ్వేంజ్ గదూ
వెరీ క్విక్‌గా నేర్చుకో వచ్చు
పదప్రయోగం తప్పుచేసినా
పట్టించుకోవడం అంత తేలికేంగాదు
బయట్ని హా ర్న్ మోగుతోంది -
షాపింగ్‌కి వెళ్ళాలి

వస్తా డాడీ! మళ్లీ హోమ్
అడ్రసుకే రాస్తాను వుత్తరం!
ఛీర్ యూ!
బ్యాంక్ - బేబీ - షేర్స్
మరోలా అనుకోకండేం!

ఇట్లు మీ సుమీ జీ. పాల్

— మునిపల్లె రాజు

# నిశ్శబ్దం ఒక పదం కాదు



## 1

నిశ్శబ్దం ఒక శాంతి. నిశ్శబ్దం ఒక వరం. నిశ్శబ్దం నీలాకాశపు వైశాల్యం. నిశ్శబ్దం ఒక లతాగుల్మాల లోయ పుష్ప సౌందర్యం.

★ ★ ★

తను పడుకొనే ముందు గది కిటికీ తలుపులు తెరిస్తే, రాములవారి గుడి శిఖర దర్శనమవుతుంది - రావుగారికి. ఒక హృదయ నమస్కారం. మసక చీకటి. వేకువ తులశి. నిశ్శబ్దం ఆధ్యాత్మిక ఇంద్రధనుర్వలయం.

నెమ్మదిగా నడిచి మధ్యహాలులో లైట్ స్విచ్చివేసి పూజా గదిలో సాయిబాబా పటం ముందు ఒక అగరుబత్తీ వెలిగిస్తారు. కాకడా హారతి. '' నేనుండగా నీకు సంచిత కర్మ గురించిన భయమెందుకు భాయీ ? ''

తిరిగి వచ్చి రాగి చెంబులో చల్లని నీరు మూడు గుక్కలే తాగి భక్తి గీతాలకై రేడియో ఆన్ చేస్తారు. మంద్ర నిశ్శబ్దం. మనోనేత్రం. మహాశాంతి.

పది నిమిషాలలోపే పాలవ్యాన్ గంట. రెండు లీటర్లకు టోకెన్లు.

ఇంకో రెండు నిమిషాల్లో కాలనీ మొదటి ఎవెన్యూలో నివశించే మేజర్ కిషన్‌లాల్ గారి తండ్రి రామలాల్ మిశ్రా గారి హిందీ సంబోధన.

'' రావ్ సాహెబ్ - - మై ఆయా హూ ''

తెల్లకాన్వాస్ షూ. ప్రభాత ఫేరీ లాంటి కాలనీ పరిభ్రమణ. మూడు కిలోమీటర్లు.

మిశ్రాగారికి భార్యా వియోగం, కోడలితో కొన్ని సమస్యలు. నిశ్శబ్ద ఉషఃకల్యాణ లావణ్యంలో ఒక ఆక్రందన పరిభాష.

తిరిగి వచ్చి కాలకృత్యాలు. చన్నీటి స్నానం. రెండు ఇడ్లీలు. ఒక తేనీరు కప్పు.

బయట వేచివున్న నలుగురైదు గురికి హోమియోపతి మందులు.

మిశ్రాగారి నిద్రలేమికి మదర్‌టించర్. పరమశివంగారి వేలిమీద వార్ట్‌కు తూజా.

నారాయణ కూతురికి స్వల్ప అజీర్ణం - నక్స్‌వామికా.

పల్పడిల్లా ఇదివరకు ఇచ్చారండీ కమల.

ఇచ్చాం. ఇప్పుడు పొటెన్సీ మారుస్తున్నాం.
మంచి మందు.

"ఎందుకొచ్చిన తామర తంపర. రామా క్రిష్ణా అంటూ కూచోక". రావుగారు వినలేదు.

## 2

నిశ్శబ్దం ఊడలు దిగిన మహావృక్షం. నిశ్శబ్దం నిష్క్రమణద్వారం.

కాలం - మలుపులో పొంచివున్న కృద్ధసర్పం. ఆ ఉదయం -

పాల్వాన్ గంట, ఒకటి, రెండు, మూడుసార్లు. "ధూద్" -- "పాలు - సార్"

పై నుంచి పెద్దకొడుకు దిగి వచ్చి పాల సీసాలు అందుకొన్నాడు. నాన్నగారు బద్ధకించరే. ఐదు నిమిషాలు.

మిశ్రాగారి పిలుపు. "రావ్ సాబ్ -- రావ్‌సాబ్" తబీయత్ ఠీక్ నహీక్యా?

అచ్చా. అచ్చా.

"అమ్మా - నాన్నగారు లేవ లేదా? గదిలో కనబడరేం?"

"ధనుర్మాసం. గుళ్ళోకి వెళ్లారేమో నాయనా"

హోమియో తీపి మాత్రల కోసం వేచివున్న వారు వెళ్లి పోయారు. మిశ్రాజీ మళ్లీ వచ్చి తిరిగి పోయారు. గుడి ద్వారాలు మూసివేశారు. మనమడూ, మనవరాలు కాన్వేంట్‌కు వెళ్ళే హడావిడి. ఇవ్వాళ నైట్ షూ, పాలిష్ అయిపోయిందని ముందుగా చెప్పరా? టిఫిన్ డబ్బాలు ఎక్కడ దాచారర్రా?

పిల్లలు వెళ్లిపోయాక మహా ప్రశాంతి. ఆ అత్యాధునిక గృహంలో.

కొడుక్కు అనుమానం వేసింది. కోడలు వచ్చింది. చెప్పులిక్కడే వున్నాయే. రాగి చెంబూ నీళ్లూ తరగలేదు. దుప్పటి మడిచి వుంది. రాత్రి ఈ మంచం మీద పడుకోలేదే. కిటికీ మూసే వుంది. సాయిబాబాకు హారతి అగరుబత్తిలేదు. రేడియో మూగగానే వుంది.

"చిన్న పాపకు ఫోను చేసి చూడు". నో నో రాలేదు. ఏమిటా కంగారుగా మాట?

కోడలు తెలివి గలది. ఉత్తరాలు చూడండి. కొత్తవేమీ లేవు. పాతవి ఇనుప తీగెకు తగిలించేవున్నాయ్. అయన బ్యాంక్ పాస్‌బుక్ - డ్రాయర్లో పెట్టుకొంటారు. చూడండర్రా. "అక్కడే వుంది".

బావగారికి టెలిగ్రాం. బాబాయికి టెలిగ్రాం.

స్కూటర్ మీద ఆస్పత్రి దాకా వెళ్లి రారా - తమ్ముడికి పురమాయింపు.

నలుగురి నోట్లో పడితే నామరదా. ఊరికెళ్లారని చెప్పండి. ఎప్పుడొస్తారో? "పదిరోజులు"

కొడుకు తలపట్టుకొన్నాడు.

"అమ్మా, ఏమిటి మొన్న నాన్నగారూ, నువ్వూ వాదించుకొంటున్నారు?"

"పిల్లలు టి.వి.చూసి ఆలస్యంగా నిద్రపోయారు. రేడియో ఆపుచేయమన్నందుకు కోపం".

"ఆ మాత్రం ఆయనకు తెలును గదా. అంత పెద్ద వాదనెందుకమ్మా".

"మనసులో ఏముందో తెలీదు. అక్కతో గూడా చికాకుగా మాట్లాడుతున్నారు. ఎప్పుడు తన వాళ్ల గొడవే. ఇంట్లో సంగతి చిన్న మెత్తు పట్టదు."

"అక్కయ్య మాత్రం అట్లా మీద మీదకు పోయి అంత పరుషంగా ఎందుకు మాటలనాలి. ఎవరికైనా ఆత్మగౌరవం వుంటుంది. ఇంట్లో సంగతులు ఆయన చేయ్యాల్సిన వేమున్నాయని?"

"దాని పిల్లకు లెక్కలు రాలేదని దాని ఆవేదన, ఈయనగారు సుమతీ శతకం పద్యాలు అప్పజెప్పమని గొడవ. ఎవరికైనా విసుగు వస్తుంది."

"ఇంత మాత్రానికే---?"

"నాయనా - వాళ్లని వీళ్లని అంటావెందుకు? నువ్వు చేసిన ఘనకార్యం ఏమిటి? నీ స్నేహితుల ముందు ఏదో చెప్పొస్తే, లోపలి కొచ్చి - తమరు కొంచెం నోరు మూసుకొమ్మంటం - ఏమి సబబు రా!?"

"అదేమీ కాదండీ --- వాళ్ల నాన్నగారి తద్దినమని అన్నారు. ఇంట్లో కుదరదు, మఠంలో పెట్టుకోండని అత్తగారన్నారు. ఆ రోజు నుంచీ మనిషి మాటలు చాలించారు" చిన్న కోడలు తెలివిగా మాట్లాడగలదు. రెండర్థాలు.

"మిమ్మల్నెవర్నీ అర్థించ లేదు గదా. తన డబ్బు. వంట మనిషి దగ్గిర్నుంచి ఆయనే ఏర్పాటు చేసుకొంటున్నారు. "తన వాళ్లని" ఎవరికైనా వుంటుంది. అది తప్పుగాదుగా. ఛీ - ఛీ - ఛీ -- ఇటువంటి మనుషుల్ని నేనెక్కడా చూళ్ళేదు."

దూరాల నుంచి పెద్దనాన్న, బాబాయి, బావా వచ్చారు. వెళ్లారు.

రావ్‌సాబ్ సే కుచ్ ఖబర్ - కుచ్ లెటర్??

"దీని కంతకూ కారణం నువ్వు.

ఆ మాత్రం మనుషుల్ని అర్థం చేసుకోలేక పోతే ఎందుకు? నేను చికాకుగా ఏదో అన్నాను. నీకు తెలీదు - ఆ రాత్రే ఆయన మంచం వద్దకు వెళ్లి క్షమాపణ చెప్పుకొన్నాను." కొడుకు.

## 3

నిశ్శబ్దం ఒక పరివేదన, ఒక పశ్చాత్తాపం నిశ్శబ్దం మూడక్షరాలు, మూడు మహాసముద్రాలు.

★ ★ ★

నాలుగైదేళ్ల తర్వాత -

--- పాలెం. ఆశ్రమం నుండి ఉత్తరం వచ్చింది.

"శ్రీ రావుగారు గత నాలుగేళ్లుగా ఈ ఆశ్రమనివాసి. ఎప్పుడూ యోగ సమాధిలో వున్న మహారుషిగా యిక్కడ మెలిగారు. తోటి వృద్ధులకు చేతనైనంత సేవ చేశారు. క్రితం నెల రథ సప్తమి నాడు తన నిద్రలోనే ప్రశాంతంగా బ్రహ్మైక్యం చెందినారు. మొన్ననే వారి కాగితాలు కొన్ని లభ్యం కాగా ఈ చిరునామా కనబడింది. బ్యాంక్ ద్వారా వారు ఆశ్రమానికి అర్పించదలచిన ధనం గూడా అందినది. ధన్యజీవులు. వారి కాయితాలన్నీ మీరు పంపమంటే పంపగలము."

## 4

నిశ్శబ్దం - ఒక సమాధి నీడ.
నిశ్శబ్దం - ఒక మహా సర్పం.
నిశ్శబ్దం - ఒక మహాస్వప్నం గూడా.

★ ★ ★

రావుగారి ఫోటో ఎన్లార్జ్ అయి ఇప్పుడు గోడ మీద ప్రముఖంగా కనిపిస్తున్నది. అగరుబత్తి వెలుగుతుంది. చెమ్కీ పూలమాలా మెరుస్తుంటుంది.

--- పాలెం ఆశ్రమాధిపతులు ఆయన పత్రాలన్నీ పంపించారు.

ఆ కాయితాలు ఎవరూ విప్పి చదవ సాహసించలేదు. ముప్తాళ పత్రాల రహస్య శబ్దాలు.

అయినా -

పాలవాన్ గంట మోగటం మాన లేదు.

గుడిశిఖరం - ఉదయ కాంతిలో మెరుస్తూనే వుంది.

రామ్‌లాల్ మిశ్రా గారి పిలుపు మాత్రం వినబడటంలేదు.

ఇప్పుడు నిశ్శబ్దం - ఒక భయం. ఒక ఆందోళన. - ●




# జీవిత స్వరం

– అద్దేపల్లి రామమోహనరావు

ఒకకన్ను ఆకాశానికి సెర్చిలైటు కావచ్చు
ఒక కన్ను మాత్రం నేలకి కట్టుకొయ్యకావాలి -
ఆకాశం చెరువులో
తామరపువ్వు కోసం చెయ్యి జాస్తున్నప్పుడు
ఒడ్డునుండి కాలు జారిపోకుండా
దానికి జీవితాన్ని పూనుకోవాలి -
జీవితానికి ఆకాశం ఎప్పుడూ అందరానిదే
చేతులు సాగదీసిన కొద్దీ
అది యింకా దూరం జరిగిపోయేదే -
మేధావులు
ఊహాపుష్పాల అభౌతిక వృక్షాలు పాతేసిన
గ్రంథాల నీడల్లో నిలబడి
నువ్వు ఆకాశం వైపుకి చేతుల్ని సాగదీస్తావు
ఆ చేతుల వేళ్ళు
సూర్యుడి ఆవేశంలో బొగ్గుల కణువులైతే
గాలిపటానికి దారపు ఉండని
యింకా యింకా వదలవలసిందే
గాలిపటం యింకా యింకా
ఆకాశమార్గాన్ని కొల్లగొట్టవలసిందే -
దారపు ఉండనే వదిలేస్తే
ఆడుకునే దేముంది? ఆటలో అనుభూతి ఏముంది?
ఆదర్శం జీవితం గొంతులోంచి పాటలా రావాలి
ప్రతి అక్షరం వెనకా రైలువట్టాలుండాలి
సొంత రాగపు కొండ కొమ్మున నిలబడి
ఆకాశం మీద కెగిరే పక్షి పాటకి
చేతులు సాగదీసిన కొద్దీ
పాదాల పట్టు తొలగి పోతుంది -
పాదాలునేలమీద నిలిపి
చాచిన చేతుల్తో పూలుకోస్తుంటే
పుప్పొడి వానలో కరిగిపోయి చైతన్య బీజమై
నేలంత పులకరింత వౌతావు ●

# రాయలసీమ జీవితాన్ని చిత్రించిన చక్రవేణు కథలు

— డా. కె. శ్రీదేవి

రాయలసీమ అనగానే గుర్తొచ్చేది కరువు. కరువే సీమవాసుల బ్రతుకు చిత్రమంతా ఆక్రమించి ఉంటుంది. రాయలసీమ జన జీవితాన్ని చెప్పటమంటే... కరువు చరిత్రను చిత్రించటమే. రాయలకాలంలో వైభవోజ్వలంగా వెలిగిన రాయలసీమ సంస్కృతి, ఈనాడు కరువు సంస్కృతి. ఆ కరువు సీమలో పుట్టి పెరిగి అటు అనంతపురం ఇటు కడపజిల్లాల నుండి రాస్తున్న రాయలసీమ రచయితలు తమ 'నేటివిటీ'ని (Nativity) స్పర్శిస్తూ గాఢమైన జీవితచిత్రాలను అందించడానికి నిజాయితీగా ప్రయత్నించ గలుగుతున్నారు.

గత పదేళ్ళనుంచి కడపజిల్లా భౌతిక జీవితంలో వచ్చిన మార్పులు రాయలసీమేతరులకు అనూహ్యాలైనవి. పులివెందుల, కోడూరు, రాజంపేట చుట్టుప్రక్కల గ్రామాల నుండి పశువులను లారీలతో బెంగుళూరు, కబేళాకు తోలిన పరిస్థితి - కోడూరు నుండి కువైట్ దేశానికి తరలివెళ్ళే ఆడవాళ్ళ, అధమాధమ స్థితిగతుల గురించి చెప్పిన 'కసాయి కరువు' 'కువైట్ సావిత్రమ్మ' కథలను తెలుగు సాహిత్యంలో మొట్టమొదటి సారి సృశించిన అపూర్వ కథకుడు చక్రవేణు.

గ్రామీణ జన జీవితంలో పశువులు అంతర్భాగం. అందులోనూ వ్యవసాయ దారునికి పశువుతో ఉన్న అనుబంధం అవినాభావ సంబంధం. అట్లాంటి పశువును కసాయివాడికి తోలడమంటే తమనితాము వధ్యశిలకు అప్పజెప్పుకునేంతటి నరకయాతనను పల్లీయులు అనుభవిస్తారు. 'కసాయి కరువు' కథలో ఒకప్పుడు బావుల్లోనూ చెఱువుల్లోనూ నీళ్ళు తాండవమాడుతూ ఉండేది. చిన్నపిల్లలు నీళ్ళల్లో సాగించే ఆటలకు అంతుండేది కాదు. అట్లాంటి చోట తాగడానికి మంచి నీళ్ళు లేక బావులు, చెఱువులు, వంకలు అన్నీ ఎండిపోయినాయి. ఎప్పుడెప్పుడు పెద్దరెడ్డి మోటరేస్తాడా! అని ఎదురుచూడ్డంలోనే ఆపల్లెవాసుల బ్రతుకులు తెల్లవారి పోతుంటాయి. సన్నటి ధారలా పడే ఆ నీళ్ళను పట్టుకోడానికి కూడా అడ్డుపడిన పెద్దరెడ్డి సేద్యగాడిని రాజమ్మ సివంగిలా ఎదుర్కొంటుంది.



## చక్రవేణు గురించి....

చిన్న వయసులో గొప్ప కథకుడిగా పేరు తెచ్చుకున్న చక్రవేణు కడపజిల్లా రైల్వే కోడూరుకు చెందినవాడు. చిన్న వయసులోనే విరసం సభ్యుడిగా చేరాడు. కొన్నాళ్ళు చిత్తూరు జిల్లాకు విరసం కన్వీనర్‌గా వున్నాడు. ఒక దశాబ్దం పాటు విరసంలో కొనసాగాక రాజీనామా చేసి అందులోంచి బయటకొచ్చాడు. ఆయన రాసిన కథల్లో 'కువైట్ సావిత్రమ్మ' ఖ్యాతి గడించింది. సాహిత్యంలో ఇంకా ఎన్నో ఉన్నత శిఖరాల నందుకోవలసి వుండిన ఈ రచయిత జీవితం 1993లో జరిగిన ఒక రైలు ప్రమాదంలో విషాదకరంగా ముగిసింది.

మనుషులు తాగడానికే నీళ్ళులేక అవస్థలు పడుతుంటే పశువులకు మాత్రం ఎక్కణ్ణుంచి తెచ్చి నీళ్ళు పడతారు? వర్షాలు లేక బీటలుపడిన నేలలో పచ్చగడ్డి కాదుగదా పిచ్చి మొక్కలు కూడా మొలవటం లేదు. ఇలాంటి పరిస్థితుల్లో బళ్ళారి నుండి గొడ్ల వ్యాపారస్థులు కొంత మంది కడపజిల్లాలోని రాజంపేట, కోడూరు, పక్కపల్లెల్లో పశువుల్ని కొని బెంగుళూరులో కసాయివాళ్ళకు అమ్ముతున్నారు. అట్లా వచ్చిన పశువుల వ్యాపారస్థులకు తమ గొడ్లను అయినకాడికి అమ్మేస్తున్నారు. ఎంతో ప్రేమతో తమ బిడ్డల్లా పెంచిన పశువులు - తమ కళ్ళముందే మేతలేక, తాగేందుకు నీళ్ళులేక 'అంబా' అంటూ అలమటిస్తూ అరిచే అరుపుల్ని, కళ్ళు బయట కొచ్చేట్లుగా విప్పార్చి చూసే ఆకలి చూపుల్ని చూస్తూ భరించటం కన్నా వాటిని కసాయివాళ్ళకు అమ్మటమే వాళ్ళకు ఉచితంగా తోచింది. అమ్మగా వచ్చిన డబ్బుతో తమ బిడ్డలకు నాలుగు రోజులన్నా గంజికాచి పోయొచ్చనే ఆశ ఒకవైపు - అయ్యో! పశువులమ్మి బిడ్డల్ని బ్రతికించుకునే రోజులొచ్చెనా అని మరోవైపు ఆక్రోశించే మనసును రాయిచేసుకొని కబేళాకు తోలే దృశ్యం ఎంత బీభత్సంగా ఉంటుందో 'కసాయికరువు' కథలో చక్రవేణు చిత్రిక పట్టినాడు.

రాయుడు కర్రావును తనతో బుట్టువులా ఆప్యాయంగా చూస్తుంటాడు. మరో మార్గం లేక జ్వరంపడిన బిడ్డను బ్రతికించుకోడానికి నాగమ్మ గుండె దిటవు చేసుకొని రాయుడు ఇంట్లో లేనపుడు కర్రావును బళ్ళారి సాయెబుకు అమ్మేస్తుంది. వచ్చిన వంద రూపాయల్లో బియ్యం తెచ్చి వండి, బిడ్డను ఆసుపత్రిలో చూపిస్తుంది. కానీ రాయుడు కర్రావును అమ్మిన సంగతి స్నేహితుడి ద్వారా విని మూర్ఛపోతాడు. తన ఆశలన్నీ పెనవేసుకున్న కర్రావు తనకిక లేదని తెలిసి తల్లడిల్లిపోతాడు. 'అంబా' అంటూ లారీలో నుంచి మోరెత్తి పిలిచే కర్రావు గొంతే రాయుడి కలలనిండా. ''కర్రావును పట్టుకుపోతున్నారమ్మా, కొడ్తున్నారు, దాన్ని కొట్టదనమ్మా, ఒద్దమ్మా దాన్ని అమ్మొద్దమ్మా - ఏయ్ కర్రా... దా... దా... అమ్మా మన కర్రావుకు కడుగు నీళ్ళు తీసుకొనిరా తొందరగా రామ్మో'' అంటూ కలవరించే కొడుకు కడతేరి పోతాడేమోనని నాగమ్మ కర్రావు నమ్మినందుకు నిందించుకుంటుంది. 'కర్రావును అమ్మటమంటే తన కొడుకును అమ్మేసినట్లే' అని నాగమ్మకు తెలుసు. కానీ కరువు బారిన పడి చనిపోయేదాని కన్నా కసాయోళ్ళకు పశువును అమ్మటమే ఆమెకు సబబుగా అనిపించింది.

నాగమ్మ భర్త రోడ్డువేసే పనికోసం దగ్గర్లోని తిరుపతికి పోతాడు. రాత్రిళ్ళు రైల్వేస్టేషనల్లో తలదాచుకుంటున్న అతన్ని దొంగతనం కేసులు పెట్టి పోలీసోళ్ళు పట్టుకు పోతుంటారు. దొంగతనం చేస్తున్న వారితో వాటాలు కుదిరి - వాళ్ళ నొదిలేసి ఏమీ తెలియని అమాయకులపైన కేసులు బనాయించే పోలీసుల నిజాయితీ గురించి ప్రజలకే మాత్రం భ్రమల్లేవు.

నాగమ్మ అక్క భర్త యానదయ్యకు కోడూరు దగ్గరలోని మంగంపేట ముగ్గురాళ్ళ గనుల్లో పని దొరికిందని తెలుస్తుంది. ''రాళ్ళు కోసుకొని బాగా దెబ్బలు తగిలి పుండ్లవుతున్నాయంట. అయినా ఫరవాలేదు. పని దొరుకు తుందంట'' అంటుంది రాజమ్మ.

''అట్లయితే మీరు పోయినాక మామనడిగి బాగా పని దొరికేటట్లయితే జాబు రాయండక్కా! మేము కూడా మా ఇంటాయనకు చెప్పి అక్కడికే వచ్చేస్తాం. ఆపని చేసి పున్నెం కట్టుకో అక్కా! ....... మరిసిపోగాకక్కా! మీతోపాటు మేము కూడా ఒక పూట తింటాం''. అంటూ మళ్ళీ మళ్ళీ గుర్తుచేస్తుంది.

ప్రాణాలుగ్గబట్టుకొని గని కార్మికులు పనులకు పోతున్నారు ఆపనికి పోకుండా ఉండలేరు. ఛస్తూ, బ్రతుకుతూ అట్లా ఊపిరాడని గనుల్లోనే అప్పుడో, ఇప్పుడో అంటూ క్షణ క్షణం బ్రతుకు భయంతో పనులకు పోతూనే ఉన్నారు. పని మానేసి పస్తులుండటం కన్నా ప్రాణాంతకమైన పనులైనా సరే చెయ్యడానికే సిద్ధమవుతున్నారు. ఆ పనులే తమ కుటుంబానికి కూడా చూపించమని అతి దీనంగా రాజమ్మ నడుగుతుంది నాగమ్మ.

పనులు చూపించలేని పల్లెలో పసివాళ్ళు జ్వరంతో ఒకవైపు అల్లాడుతుంటే - పట్నం పోయిన భర్త తింటున్నాడో, పస్తున్నాడో అని భర్త గురించి మరోవైపు బెంగ కొడుకు కలవరింతల్లో ఉన్న కర్రావు పట్ల ఉన్న వెర్రి మమకారం అన్నీ కలిసి ఆమె నవనాడులను కృంగదీస్తాయి. కరువు ఉక్కుపాదాల కిందపడి కుటుంబాలకు కుటుంబాలు ఎలా ఛిద్రమౌతున్నాయో కళ్ళకు కట్టినట్లు స్పష్టంగా తెలుస్తూంది.

రాయలసీమ పల్లెలోని కరువు -

గొడ్లను కసాయోళ్ళు లారీ ఎక్కించి నట్లు ఆడవాళ్ళను రాజంపేట రైల్వేస్టేషనులో నుంచి కువైటుకు తరలిస్తూంది. భారతదేశం నుండి కువైట్ దేశానికి పోయిన వాళ్ళలో ఆంధ్రప్రదేశ్ నుండే ఎక్కువ. అందు లోనూ కడపజిల్లాదే అగ్రస్థానం. ఆస్థానం ఎలా కైవశమైందో కడపజిల్లా లోని కరువుకే తెలుసు. కసాయి కత్తులకు ఎరలుగా మారే పశువుల లాగే ఎంతోమంది సావిత్రమ్మలు రామలక్ష్మమ్మలు, పెండ్లికాని పది హేడేండ్ల అమ్మాయిలు మాన మర్యాద లను పణంగా పెట్టి కువైట్ దేశాలకు సంపాదన నిమిత్తం నడిచే ఖజానాలుగా మారుతున్నారు.

కరువు వలన మానవ సంబంధా లలో వచ్చిన మార్పును 'కువైట్ సావిత్రమ్మ' కథ అద్భుతంగా ప్రతిబింబించింది. సావిత్రమ్మ భర్త రాజయ్య చనిపోయిన తరువాత సావిత్రమ్మ కుటుంబానికి ఎవరి ఆదరణ లేక , ఇల్లు జరగని స్థితిలో దిక్కులేని దైపోయింది. అన్న చని పోయి నెల తిరగకముందే ఆమెను బెదిరించి మరిది ఆమెను చెరుస్తాడు.

బిడ్డలను పస్తుపడుకో బెట్టలేక, పోషించేందుకు మరో దారి లేక తన శరీరాన్నే ఆమె పణంగా పెడుతుంది. దానితో ఆమె మరిది ''ఊర్లో ఎవరెవరితోనో వ్యభిచారం చేసింది. ఎన్నిసార్లో కొట్టినాం తిట్టినాం. అయినా మానుకోలా. నలుగుర్లో మా పరువు తీసింది. ఇప్పుడు అక్కడెక్కడ నుంచో కువైట్‌కు పోయి ఒకనా - కొడుకు వచ్చివున్నాడు. ఈళ్ళమ్మ గారి ఊరంట. రహమాన్ అంట. ఆడితో కులుకుతా వుండింది. మా వంశాన్ని నాశనం చేయడానికే ఇది మా ఇంటి కొచ్చిందంటూ'' పరువు ప్రతిష్ఠల పేరుతో ఆమెపై అభియోగం మోపి ఊరినుండి వెళ్ళేట్లు చేస్తాడు.

పుట్టిల్లు చేరిన సావిత్రమ్మ బంధువుల సాయంతో, రహమాన్ సాయంతో కువైట్ వెళ్ళుతుంది. అక్కడ డబ్బు సంపాదించుకొని తిరిగి తన ఊరికి వస్తుంది. ''అయిపుట్టినోడికిందల్లా కొంగు పరచి సంపాదించిందంటూ ఈసడించిన జనం సావిత్రమ్మ డబ్బు సంపాదించుకొని రావడంతో ఆ ఊరి ప్రజలు, బంధువులు అందరూ ఆమెకు గౌరవంతో బ్రహ్మరథం పడతారు. పైగా ఒకప్పుడు పంచా యితీ పెట్టించి ఊరినుండి తరిమిన మరిదే సావిత్రమ్మను పలకరించి, తాను కువైట్ పోవడానికి వీలుగాక పోవడంతో తన భార్యనైనా సరే కువైట్ పంపి డబ్బు సంపాదించాలను కుంటాడు. పోనని మొరాయించిన భార్యను ప్రతిరోజు చావగొట్టి 'ఇక్కడ ఉండడంకన్నా కువైట్‌కు పోవడమే మేలనేట్లు చేస్తాడు. ఇంత వరకూ పరువూ - ప్రతిష్ఠ నీతి -

నియమం అంటూ వీళ్ళు నమ్మిన విలువలన్నీ డబ్బు మాయాజాలంలో పావులుగా మారి అది ఆడించినట్లల్లా ఆడే వ్యక్తిత్వాంలేని మరబొమ్మలుగా ప్రవర్తిస్తారు.

ఆడవాళ్ళు కువైట్‌కు సునాయాసంగా పోతున్నట్లుగా అనిపిస్తుంది కానీ వాళ్ళు తమ శరీరాలను ఏజంట్లకు, అధికారుల చేతుల్లో పెట్టి మరీ వెళుతున్నారు. కానీ కువైట్‌కు పోయిన ఆడవాళ్ళెవరూ ఆ సంగతులను విషం మింగినట్లు మింగి ఏమీ జరగనట్లే, కష్టాలన్నీ దిగమింగి తనవాళ్ళ సుఖంకోసం డబ్బు సంచులు పంపుతూంటారు. అందుకే అమాయకంగా తనతో కువైట్ వస్తానన్న రామలక్ష్మమ్మతో ''బొంబాయి పోయి నాక ఎట్టలేదన్నా నీవు రెండు మూడు నెలలు అక్కడే వుండొచ్చు. ఈ రెండు నెలలు నిన్ను తీసుకుపోలా వుండారా ఏజంట్లు వాళ్ళు మర్యాదగా చూస్తారనుకోగాకు. అక్కడ వాళ్ళకు కావాల్సిన మొగోళ్ళ దగ్గరికల్లా నిన్ను పంపిస్తారు. నేను చెప్పేది మాత్రం అచ్చరాల నిజం. నీకు ఇష్టమున్నా లేకున్నా సరే. వాళ్ళు చెప్పింది చెయ్యకుండా మాత్రం కువైట్‌కి పోలేవు''. ఆడోళ్ళు కువైట్ పోతున్నారంటే అంత సులభంగా పోతున్నారునుకో వద్దు అంటుంది. సావిత్రమ్మ పాత్ర ద్వారా రచయిత కువైట్ పంపే ఏజంట్ల గుట్టునూ, దళారీ తనాన్ని పూసగుచ్చినట్లు వివరించాడీ కథలో.

సావిత్రమ్మ రహమాన్‌తో ఉంటే, ''ఇద్దర్నీ గుడిసేలో పెట్టి నిప్పంటిస్తానన్న'' మరిది చిన్నబ్బ వాళ్ళు సంపాదించుకొచ్చిన తరువాత ''రహమాన్ అన్న''ను కువైట్ తీసుకుపోమని అడిగానని అంటాడు. అయిపుట్టినోడు కాస్త రహమాన్ అన్నగా మారిన వైనం అంతా డబ్బు మాయే!

అంతేకాదు కువైట్ పోవడమంటే మానాన్ని అమ్ముకోవటమేనని రామలక్ష్మమ్మ చెప్పినప్పుడు తన భర్తకు ఆ సంగతులన్నీ తెలుసని, తెలిసే ఆమెను పంపుతున్నాడంటుంది. రామలక్ష్మమ్మ చిన్నబ్బే కాదు. పరదాల మాటున మగ్గిపోయే పదిహేడేండ్ల పెండ్లికాని ముస్లిం యువతులను కూడా వాళ్ళ తల్లిదండ్రులే డబ్బు సంపాదనకోసం కువైట్ పంపుతున్నారు. ఇలా గ్రామం మొత్తం కువైట్ రొచ్చుగుంటలో విధిలేకనే అయినా నిలువునా కూరుకుపోవడానికి సిద్ధపడుతున్నారు.

ఒకప్పుడు ఊరినుంచి వెలివేయబడిన సావిత్రమ్మ కువైట్ నుంచి తిరిగొచ్చిన తరువాత అసాధారణమైన ఆదరణకు పాత్రురాలైంది. 'దండిగా డబ్బులొచ్చేట్టుగా వుంటే పెండ్లాలను కూడా అమ్మేంతగా దిగజారిన విలువల భయంకర విధ్వంసం కోడూరు రైల్వే స్టేషనులో కనిపిస్తుంది.

కుటుంబ చట్రంలో స్త్రీ ఎంతటి హింసను అనుభవిస్తుందో తెలిపే కథ 'మృత్యుహక్కు'. కట్నం కోసం, ఆస్తివాటా కోసం రఘునాధం తన భార్య జానకిని, ఆమె పుట్టింటి వాళ్ళను నానా దుర్భాషలాడటమే గాక చావ గొడుతుంటాడు. జానకికి పెదవివిప్పి చెప్పే ధైర్యంలేదు. పుట్టింటి వాళ్ళు తన పెండ్లికి చేసిన అప్పులు తీరకముందే ఆస్తిలో వాటా కోసం జానకి పుట్టిల్లు చేరుతుంది. కాని తల్లి దయనీయస్థితి ఆమెను అడగనీయదు. పర్యవసానం రఘునాధం చేతిలో గర్భసంచి పగిలిపోయి ఘోరంగా మృత్యువాత పడుతుంది. స్త్రీల పాలిట 'మృత్యుహక్కు'గా మారిందని చెప్పటం రచయిత ఉద్దేశం. అందుకే ప్రభుత్వ స్వభావంలో మార్పు రానిది సమస్య ఉపరితలంలో వచ్చే

మార్పులు తాత్కాలిక ఉపశమనాలే గాని పరిష్కారం కాదు. ప్రభుత్వం ఒక చట్టం చేసిందంటే, ఆ చట్టం నుంచి రాజ్యంలోని ఏమూలలో నున్న వారైనా తప్పించుకోలేనంత పట్టిష్ఠంగా అమలు పరిచేంత పకడ్బందీగా ప్రభుత్వ యంత్రాంగం నిర్మాణం జరగాలి.

ఏ ఆస్తికోసమైతే వాటా పంచుకొని, తన పుట్టింటినిపట్టేటులో ముంచి రమ్మని భర్త పంపించాడో అదే ఆస్తికోసం వడ్డీ వ్యాపారి గుంటకాడ నక్క కాపలా వున్నట్టు వున్నాడు. ఒకవైపు వడ్డీవ్యాపారి, మరోవైపు తన భర్త - ఇద్దరూ కూడా ఒకేజాతి మృగాల్లాగా జానకికి కనిపించారు. వారిద్దరి బారినుండి తన పుట్టింటిని రక్షించే ఆలోచన జానకికి తోచదు. అందుకే వాళ్ళకు విముక్తి లేదని గ్రహించేపాటి జ్ఞానం కుటుంబ చట్రంలోనే మసిలే ఆడవాళ్ళకు కలుగదు.

తల్లిపేగు బంధం నుండి పరాయీకరణ చెందిన వాళ్ళ పట్ల తల్లి పడే ఆవేదనను, 'అలా ఎందుకవు తుంది'? అన్న ఆలోచనను కలుగజేసే కథ 'తెగినపేగు'. గంగమ్మ చిందర వందరైన తన జీవితాన్ని కొడుకు తోడు నీడల్లో సేదతీరాలను కుంటుంది. అయితే ఆతల్లి వాసనను, ఆకారాన్ని చీదరించుకున్న చంద్రం ఆ వాసన నుండి దూరంగా పారిపోవాలను కుంటాడు. అట్లని తల్లంటే చంద్రానికి ప్రేమలేక కాదు. తన పాతకాల వాతావరణానికి ఇమడని సంస్కృతిలోని రూపంతో తల్లి దర్శనమిచ్చే సరికి ఆవాస్తవాన్ని జీర్ణించుకోలేక పోతాడు. తన వర్గ స్పృహను కోల్పోయి తనలో కొత్తగా ప్రవేశించిన సంస్కృతి భావజాలమే సజీవమైనదిగా భావించి తల్లివేరు నుండి వేరుపడతాడు.

మన విద్యావిధానంలోని లోపమే ఇలాంటి వ్యతిరేక సంస్కృతిలోకి చొచ్చుకొని వెళ్ళే తత్వాన్ని కలుగజేస్తుంది. ఏ విద్యను అభ్యసించడం ద్వారా కొడుకు తన బతుకు బాగు చేస్తాడని కలలు గందో ఆ విద్య మూలంగానే తనకు కొడుక్కు మధ్య అంతులేని అగాధం ఏర్పడుతుంది. అట్టడుగు వర్గం నుండి చదువుల తల్లి ఒడిచేరిన వాళ్ళు చదివిన చదువును తన వర్గీయుల సాంస్కృతిక చైతన్యానికి కాక తిరిగి వారి జీవితాలనే విధ్వంసం చేసేందుకు సమాయత్త మవుతున్నారు. వీరు తామెక్కిన కొమ్మను నరుక్కొనే బుద్ధిజీవులుగా మారుస్తున్నది వ్యవస్థ. దాని విష ప్రభావమే. ఇది అవగాహనకు అందని గంగమ్మ ఒక్కరోజు కనిపించక పోతే విలవిలలాడే వాడు. అన్నంకూడా మానేసి తనకోసం ఎదురుచూసే 'నాబిడ్డ చంద్రమేనా వీడు' అని రోదిస్తుంది.

''నా చింపిరి తల, చింపిరి గుడ్డలు చూసి అమ్మ అని చెప్పుకోలేదు, రేపు ఇంకా ఊహ తెలిసొచ్చినాక నాబతుకుంతా చింపిరి బతుకేనని, చెడిపోయిన బతుకని, చెడిపోయిన దాని కడుపులో పుట్టినానని తెలుసుకున్నాక అప్పుడు నన్నసలు అమ్మగా చూస్తాడా! అమ్మని చెప్పుకుంటాడా'' అనే ప్రశ్నలు గంగమ్మను ఉక్కిరి బిక్కిరి చేస్తాయి. ఆమె బతుకు భయం కొండంతై కొడుకు రూపంలో కనుల ముందు నిలుస్తుంది.

చిన్నతనంలో తల్లిదండ్రులను పోగొట్టుకొని దిక్కులేక ఊరి సర్పంచు ఇల్లు చేరుతుంది. పనిపాటలు చేస్తున్న అమ్మాయికి ప్రాయం రాగానే సర్పంచు కామదాహానికి బలవుతుంది. తన కంటూ ఏమీ మిగల్చలేని ఊరిపైన ఊరివాళ్ళపైన విరసన వ్యక్తంచేస్తుంది. తనొకటి తలచింది కాని జరిగింది వేరొకటైంది. తన జీవితానికి ఆశగా మున్న ఒక్కగా నొక్క కొడుకును తన నుండి ఎవరో వేరు చేసినారని మాత్రం గుర్తించగలిగింది. అందుకు కారణమైన శక్తులను నేపథ్యాన్ని గుర్తించే శక్తి మాత్రం లేకపోయింది.

''తల్లి రూపాన్ని తల్లి వాసనను చీదరించుకొని తల్లిపేగు బంధాన్ని పుటుక్కున తెంచేస్తూ మాతృ నుండి వర్గం దూరంగా పరుగులు తీసే మనస్తత్వం కలిగిస్తున్నది ఎవరు? పాఠాలు చెప్పే ఉపాధ్యాయులా? విద్యావిధానమా? మేడిపండు సంస్కృతి ప్రభావమా? ఎవరు? ఎవరు కారణమవుతున్నారు?'' అంటూ పరాయీకరణకు కారణమవుతున్న వ్యవస్థ స్థితిగతుల పైన చక్రవేణుగారు మౌలికమైన ప్రశ్నలు లేవనెత్త గలిగినారు.

యువతరం బ్రతికేందుకు పనికి రాని చదువులు చదివి నిరుద్యోగంలో, నిరాశా నిస్పృహల్లో కొట్టుమిట్టాడు తోంది. భవిష్యత్తును అంధకారంగా మార్చే గుమాస్తా చదువులు చదవడం కన్నా తమ బ్రతుకుల బాగుకోసం కొత్త చదువులు చదువుకోడానికి పల్లెల్ని ఆశ్రయిస్తుంది. అసలైన అధ్యయనం శవప్రాయమైన యూనివర్శిటీ మురికి గదుల్లో కాదు. పల్లెల్లో, కార్ఖానాల్లో, అడవితల్లి గర్భంలో ఉందని గుర్తించిన యువతరం, విద్యార్థులు కొత్తచదువు చదువుకోడానికి, ప్రజలను చైతన్యవంతుల్ని చేయడానికి పల్లెలకు తరలుతున్న వైనం 'కొత్తచదువు'లో చక్రవేణు సమర్థవంతంగా చెప్పగలిగినారు. కానీ కథనంలో ఎక్కువభాగం ఉపన్యాస ధోరణిలో సాగటం వలన కొంత పట్టు సడలినట్లని పిస్తుంది. పల్లెల్నుంచి చదువుకోడానికి పోయిన పిల్లలు చదువుకొని ఎవరి కొమ్ము కాయడానికి పోతున్నారో, ఏతల్లి రొమ్మును రక్తసిక్తం చేయడానికి సిద్ధపడుతున్నారో ఆ

కూలీలను, శ్రామికుల్ని ఎలా ప్రభావితం చేస్తున్నారో 'కొత్తచదువు' చదువుల అర్థం తెలుసుకొని విద్యార్థులు పల్లెదారి పట్టినారు. విద్యార్థి రాజకీయాలు ఈ రోజు పల్లెల్లో కథలో వివరంగా చెప్పిన చక్రవేణు సంస్కారం ఉజ్వలంగా భాసించింది.

విద్యార్థులు చేధించిన రాజకీయ పరిజ్ఞానంతో 'రామిరెడ్డి గారి పల్లె' ప్రజలు తమ కష్టాన్ని దోచుకుంటున్న గురునాధరెడ్డి అరాచకత్వాన్ని ప్రశ్నించి తమ హక్కును పరిరక్షించుకోగలిగినారు. తమ ఊర్లో సంఘం పెట్టుకొని, ఆ సంఘం అండదండలతో కూలిరేట్లను పెంచుకున్నారు.

మాలపల్లి లోని చింతకాయలన్నీ భూస్వామి ఇంట్లో కుప్పపోసే ప్రజలు వాటిని తాము అనుభవించే హక్కును సంపాదించుకోవటమే కాక, బిడ్డను కొట్టినందుకు గురునాధరెడ్డి పైన పంచాయితీ పెట్టి 500/- జుల్మానా విధించే స్థాయికి ఎదిగినారు. ఈ క్రమమంతా సంఘం యొక్క శక్తితో సాధించిన విజయమే.

అంతేకాదు 'దున్నేవానిదే భూమి' అని రైతు కూలి సంఘం ఇచ్చిన పిలుపు మేరకు భూమిని ఆక్రమిస్తారు. ఒకప్పుడు తమదైన బంజరు భూమిని గురునాధరెడ్డి దురాక్రమణతో స్వాధీనం చేసుకోగా, సంఘం నాయకత్వాన బంజరును దున్నుతారు. భూస్వామి పిలిపించిన గుండాలు, పోలీసులు కలిసి అమానుషంగా చావగొట్టినా, జైళ్ళపాలైనా భూమి హక్కును వదులుకోరు. అరకలు కట్టి పైర్లు పెట్టుకుంటారు. మట్టిలో మట్టిగా బ్రతికిన వ్యవసాయకూలీ గంగులన్న విద్యార్థులు ఏర్పరచిన సంఘంలో కొత్త చదువులు చదివి స్థాయిగల కార్యకర్తగా ఎదుగుతారు. అతని నాయకత్వంలోనే 'రామిరెడ్డి గారి పల్లె' భూపోరటం జరుగుతుంది. వీరి పోరాటశక్తి సంఘ బలాన్ని గుర్తించిన భూస్వామి గురునాధరెడ్డి రాజీ ప్రయత్నం చేస్తాడు.

చక్రవేణు కథల్లోని స్త్రీ పాత్రలు వ్యవస్థ చేతిలో కీలు బొమ్మలుగా మారి, దాని క్రూర దంష్ట్రలకు బలైన వాళ్ళే. 'మృత్యుహక్కు'లోని - జానకి, 'కసాయికరువు'లోని - నాగమ్మ, 'కువైట్ సావిత్రమ్మ', 'విముక్తి దారి' లోని - పిచ్చితల్లి, తెగిన పేగులోని - గంగమ్మ, కుటిల సామాజిక నీతిని నిలదీసి ప్రశ్నించి - విలయ తాండవం చేసే కడప రాజమ్మలే అయితే తప్ప బ్రతుకు బండి సవ్యంగా సాగదు. వాళ్ళు అలా నిలబడే రోజు వస్తుందనే నమ్మకంతోనే మహిళా ఉద్యమాలలో, రైతు కూలీ పోరులో మమేకం అవ్వాలనే ఆశను రచయిత చక్రవేణు 'విముక్తి దారిలో...., కొత్తచదువు కథల్లో వ్యక్తం చేసినారు.

మాతృమూర్తి గర్భంలో నవ మాసాలు వెచ్చగా గడిపి తల్లి గర్భాన్ని చీల్చుకుంటూ, పేగు తెంచుకొని పురిటి వాసనలతో భూమిపై పడ్డనాడే పెరిగి పెద్దయి రాక్షసుడిగా మారి తన జన్మస్థానాన్ని మరచి, జన్మనిచ్చిన సృష్టికర్త స్త్రీ అని గుర్తించి గౌరవించక మానవతకు జన్మనిచ్చు మాతృమూర్తిని పైశాచికంగా హింసిస్తూ చిత్రవధ చేస్తున్న పురుష అహంకారుల్ని ఏమనాలి? అంటూ సుశీలక్క పాత్రద్వారా చక్రవేణు ప్రశ్నిస్తారు.

చక్రవేణు రచించిన ఏడింటిలో ఐదుకథల్లోనూ మహిళల పట్ల ఆర్తి స్పష్టంగా కనబడుతుంది. సమాజంలో సగౌరవంగా ఉండాల్సిన 'సృష్టికర్త'ల బ్రతుకులిట్లా మారడానికి, ఇంతటి విధ్వంసం వాళ్ళ జీవితాల్లో ఎట్లా ప్రవేశించింది అన్న ఆలోచనా రచయితను సజీవమైన పంథాలో నడిపించింది. అందుకే విముక్తిదారిలో ....అనే కథల్లో స్త్రీలు వ్యక్తులుగా సాధించలేని పనులు సంఘం ద్వారా సాధ్యపడినట్లు చూపించడం ద్వారా సమస్యల పరిష్కారమార్గాన్ని చెప్పకనే చెప్పినట్లయింది.

రాయలసీమ ప్రజల భౌతిక జీవిత నేపథ్యం నుండి చక్రవేణు కథా మూలాలు విస్తరించాయి. కరువు, దారిద్ర్యం, వ్యవసాయం అక్కడ జరిగే పోరాట రూపాలను వేణు కథలు చక్కగా వ్యక్తం చేసినాయి. తెలుగు కథా సాహిత్యంలో తాము దర్శించిన జీవితాన్ని, జీవన వైఫల్యాలను విజయాలను వ్యక్తీకరించే రచయితల సంఖ్య గణనీయంగా పెరుగుతూంది. మారుమూల గ్రామాల్లో జరిగే పోరాట స్వరూపాన్ని విశ్లేషించేసి భావితరాలకు ప్రజల చరిత్రగా అందించాల్సిన కర్తవ్యం రచయితల పైనే ఉంది. ఆ బాధ్యతను తన రచనల్లో సానుకూల పరచిన సీమ కథా సాహిత్య చరిత్రలో అమరుడు చక్రవేణు ●



# కళ్ళల్లో సెలయేళ్ళు

డి. రామచంద్రరాజు.




అవే కళ్ళు!
సౌందర్యాకాశపు తారల లోగిళ్ళు,
అనాది నుండీ నీ అహంకారానికి ప్రేరించి
ఘనీభవించిన మంచు గుళ్ళు.
ఆ కళ్ళల్లో నిక్షిప్తమైన ఆవేదన
గదిలో నిశ్శబ్దానికి వేదన.
ఆ కళ్ళల్లో ప్రవహించే బాష్పనదులు
తరతరాల నీ పీడనకు
ఎదలో ఎగసే అలల సుడులు.
రాముడైనా, రావణుడైనా
పాదుషాలైనా, ఫకీరులైనా
ఆ నయనానంద సుందర తామసనేత్రాల కోసమే తప్ప
హృదయాంబుధిలో తపనల సడి వినే వారెవ్వరు?
నీవు పసిగా వుండే నకనకలాడినప్పుడు
కలవరపడి కంటి పాపగా తలచింది ఈ కళ్ళే

నీ కేరింతల పదతాడనలకు
హసించి మురిసింది ఈ కళ్ళే.
నీ కౌమారపు పోకిళ్ళకు లోనై
నీ పొందే పసందుగా తుళ్ళింది ఈ కళ్ళే.
నీ మదాంధకారనఖ, దంతక్షతాల కోర్చి
నీ స్వప్నమై మరుల వానలో తడిసింది ఈ కళ్ళే.
నీ చేతన పూపిరిగా నమ్మి సర్వం వదలి వచ్చిన దాన్ని
నీ నిరుపేదని కసాయిగా గర్జించినపుడు
హతాశులై భీతితో శోకించింది ఈ కళ్ళే.
నీ రక్తి నిముగనిరి జూసి
కించపడి ఆక్రందించింది ఈ కళ్ళే.
కాలపు గాలానికి తగిలి
ఆ కళ్ళు వుండ్లౌతున్నాయి.
వుండ్లలో సెలయేళ్ళు వూరుతున్నాయ్,
సెలయేళ్ళు ఉప్పెనలా ఉరుకుతున్నాయ్

# రుద్ర భూమి

— మధురాంతకం రాజారాం

నేను నా చిన్నతనంలో మాతాతగారితో కలిసి శ్మశానానికి వెళ్లాను. నేను తిరిగి వచ్చేశాను. ఆయన అక్కడే వుండిపోయారు'' అన్నాడట ఒక కవి సత్తముడు.



## నన్ను మించిన వారెవ్వరు ?

మా తాతగారు నేను పుట్టక మునుపే వల్లకాటికి వేంచేశారు. అందువల్ల ఆయన ద్వారా నాకు శ్మశాన సందర్శన భాగ్యం లేకపోయింది. నేను రుద్రభూమికి వెళ్లింది కన్నారావుతో కలిసే।

కన్నారావును నేను నామిత్రుడని చెప్పుకోను. ఎందుకంటే నాపట్ల అతడికున్నది గురుభావం. 'నేను మీశిష్యుడి వంటివాణ్ణే స్వామీ!' అని అతడే ఎన్నోసార్లు నాతో అని వున్నాడు. కాపీ చూస్తూ, చూస్తూ అంతటి ఘరానావ్యక్తిని నాశిష్యుడని ఎలా చెప్పుకోగలను? అందుకు తగిన యూనిఫారమ్ దుస్తులు తొడిగి వదిలిపెడితే అసలు సిసలు డి.యస్.పి.లా వుంటాడు కన్నారావు. ఆకార పుష్టిలో మాత్రమేగాదు. ఆర్థిక సౌష్టవంలో గూడా అతడే విశిష్టుడు. టౌనులో అతడికి మూడిండ్లున్నాయి. పదిపన్నెండు రిక్షాబండ్లు అద్దెకు తిరుగుతున్నాయి. ఎక్కడో పల్లెలో పొలాలు గూడా వున్నాయట! పెట్టిపుట్టిన అదృష్టంలోను, డబ్బులు సంపాదించడంలోను, సుఖంగా మనగలగడంలోను నిస్సందేహంగా గురుత్వం అతడిదే! ఎటొచ్చీ నేనంతో యింతో వ్రాతగాణ్ణే! అప్పటికదేదో అతిమానుషమైన పనైనట్టు నేనుకనిపించినప్పుడల్లా "మేష్టరుగారు! సునాయాసంగా మీరెలా రాసి పారేస్తారండీ?" అంటూ ఆశ్చర్యపడిపోతుంటాడు కన్నారావు. నాకైతే డబ్బు సంపాదించే ఘనకార్యం ముందు మిగిలిన వన్నీ చాలానాలీను పనులుగానే తోస్తాయి. అందుకని 'రాయడం ఏమంత కష్టమైన పనికాదు లేవోయ్ కన్నారావ్! పేనా ఒకటి చేతిలో వుండాలి. నాలుగు తెల్ల కాగితాలుండాలి. బస్. ఎవరైనా రాసి పారెయ్యొచ్చు." అంటాను. 'ఏం మాటలెండి! ట్రైచేసి వుండక పోతే నేనూ అలాగే అనుకునేవాణ్ణి. డబ్బారేకుల సుబ్బరాయుడు లేడటండీ! వాణ్ణి గురించి మీకు తెలిసే వుండాలి. పాపిష్టి ముండావాడు - ఎరువులన్నీ బ్లాకులో తగలేశాడా, చక్కెర బస్తాలను గిడ్డంగి దగ్గరే మారుబేరానికి అమ్మేశాడా, ఆ మధ్య ఆటో రిక్షాలుకొని సైకిల్ రిక్షావాళ్ల నోళ్లల్లో దుమ్ముకొట్టాలని గూడా చూచాడు. వాడిపైన ఓ కరపత్రం వేయాల్సి వచ్చింది. తెల్లవారు జాము మూడు గంటల దాకా ప్రయత్నించాననుకోండి! ఒక గీత ముందుకు సాగితే ఒట్టు...'

చచ్చానురా బాబో అనుకున్నాను. ఈ కన్నారావు కరపత్రాలు, ఆకాశ రామన్న ఉత్తరాలు మొదలైనవి రాసే వాళ్లకున్నూ, కథలు నవలలు మొదలైనవి రాసేవాళ్లకున్నూ స్వభావంలో తేడా ఏమీవుండదని భావించడం లేదుగదా!

ఒకసారి 'ఏదైనా రాయాలంటే దండిగా చదవాలోయ్ కన్నారావ్!' అన్నాను.

'అబ్బో, అబ్బో! నేను చదవని పుస్తకాలా! చెంచయ్య అంగడంతా చదివి ముగించేశానే' అన్నాడు కన్నారావు.

'ఏదీ! మరైతే మీయింట్లో పుస్తకమన్న వస్తువు ఎక్కడా కనిపించదే!' ఆశ్చర్యపడిపోతూ అడిగాను.

'అబ్బే, అవన్నీ తెచ్చి ఇంట్లో ఎక్కడపెట్టు కుంటామండీ! అదేమైనా అయ్యేపనా, పొయ్యేపనా? చదవడమున్నూ, ఇచ్చెయ్యడమే! రోజుకొకటి చొప్పున తెచ్చుకుంటూ వుంటాను...'

'అయ్యో, కన్నారావు!' అని మనసులోనే జాలిపడి 'అయితే దాన్ని అంగడనగూడదమ్మా' లైబ్రరీ అనాలి' అంటూ సవరించాను.

కన్నారావు ఒక్కపెట్టున నవ్వేశాడు - "ఊహూ, చెంచయ్య దగ్గర ఆపప్పులేమీ వుడకవండోయ్ గురువు

సీమసాహితి, రాయలసీమ రచయితలు మేధావుల వేదిక, నంద్యాల. ప్రధాన కార్యదర్శి: బి. పాండు రంగారెడ్డి

గారూ! ఉచితంగా మీకు పుస్తకాలిస్తే యిక చెంచయ్య బట్టలడిపి కడుపుపైన వేసుకోవలసిందే! చెవులు మలిమి, ముందుగా అద్దెడబ్బులు వసూలు చేసుకొని, ఆ తర్వాత అతడు పుస్తకం చేతికిస్తాడు...

నేను పల్లెటూరి వాణ్ణి. అడపి దడపా ఎప్పుడో పట్టణానికి వెళ్ళింటాను. పట్టణంలోవున్న నాలుగైదు పుస్తకాల షాపులూ నాకు చిరపరిచితమే! కానీ ఈ చెంచయ్య ఎవడో, అతడి పుస్తకాల దుకాణం ఎక్కడుంటుందో నాకు తెలియదు. కన్నారావు చెబుతున్నాడు గనుక ఎప్పుడైనా అక్కడికి వెళ్లాలి. ఏపుట్టలో ఏ పాములుంటాయో ఎవరికి తెలుసు ?

నాలోని రచయిత పట్ల కన్నారావుకు తిరుగులేని గురిఏర్పడి వుండడానికి కారణముంది చూశారూ, అది చాలా విచిత్రమైనదేనని చెప్పాలి. పాతికేళ్ళక్రితం సాహిత్య వ్యాసంగంలో ఓనమాలు దిద్దుకుంటూవున్న కాలంలో నేనొక నాటకం రాశాను. తరువాతికాలంలో అలాంటి నాటకం రాసినందుకు సిగ్గుపడ్డాననుకోండి! ఆ విషయం యిక్కడ అప్రస్తుతం. కన్నారావు ఆ నాటకంలో ఓ చిన్నవేషం వేశాడు. ఆ పాత్రకున్న ఒకటి రెండు సైలాగుల్నూ మోతగా వప్పజెప్పి కరతాళ ధ్వనులందుకున్నాడు. ఆక్షణం నుంచీ నేనొక మహారచయితనన్న విశ్వాసం. అతడి రక్తంలో జీర్ణించిపోయింది. అంతకుమించి ఇటీవలి కాలంలో పత్రికల్లో పడ్డ నారచనలను గానీ, అచ్చయిన పుస్తకాలను గానీ అతడు చూచిన పాపాన పోయినట్లు లేదు!

ఎప్పుడెదురైనా కుశల ప్రశ్నలు పూర్తికాగానే అతడు తప్పని సరిగా అడిగే ప్రశ్న: 'గురువుగారూ! మీరింకా ఆ యింట్లోనే అద్దెకున్నారా ?''

''అదే యిల్లు. అదే సంపాదన. అదే సంసారం. మార్పేలేదు''

అంటాను.

కన్నారావు నొచ్చుకుంటాడు - ''ఇదిపని గాదండీ గురువుగారూ! మీరేం లాభం లేదండీ! మీకంటే ఒకతరం వెనకపుట్టిన రైటర్లు ఎలా బ్రతుకుతున్నారో తెలుసామీకు ? కొందరైతే బ్యాంకు ఖాతాపైన వచ్చే వడ్డీ డబ్బులతోనే దర్జాగా జీవిస్తున్నారట! మరి కొందరైతే ఆదాయంపైన టాక్సు గూడా కడుతున్నారట!''

బహుశా వాళ్లెవరో సినామాలకు రాసే వాళ్లయి వుండాలి. లేదా తెలుగు తప్పించి మరోభాషలోనైనా రాస్తూ వుండాలి. ఆవివరాలు జోలికి వెళ్లాలన్న ఆసక్తినాకు లేదు. అందువల్ల ఈ విశేషాలన్నీ నీకెవరు చెప్పారు బాబూ ? '' అన్నాను.

''చెంచయ్య చెప్పాడులెండి! అతడికీ విషయాలన్నీ కొట్టిన పిండి!''

''అలాగా! ఆచెంచయ్య నొకసారి చూచినా బాగుండి పోవును...''

అంటూ చిరకాల వాంఛను మళ్లీ ఒకసారి బయటపెట్టాను.

''ఎప్పుడో ఎందుకూ! ఇప్పుడే వెళ్దాం పదండి!'' నేను చెంచయ్య షాపుకు వెళ్లడం అలా జరిగింది. ఇదివరకు నేనెన్నో సార్లు తిరిగిన మెయిన్‌బజారులోనే వుంది చెంచయ్య పుస్తకాల షాపు. కానీ తీరా కన్నారావు తీసుకొచ్చి వదిలి పెట్టేదాకా, అక్కడ అలాంటి షాపు ఒకటి వున్నట్లు నాకు తెలియక పోవడమే విచిత్రం. ఆ కొట్టు చాలా యిరుకుగా, ఒక గొందిలా వుండడమే యిందుకు కారణం గావచ్చు. పైపెచ్చు చెంచయ్య తన పుస్తకాల వ్యాపారం బాహాటంగా అందరికీ తెలియవలసిన అవసరం లేదనుకున్నాడేమో, కొట్టుకడ్డంగా ఒక గోనెపట్ట తెరకట్టాడు. 'తెర తీయగరాదా' అన్నాడుగదా త్యాగయ్య. అక్కడ తెరతీస్తే కనిపించేది స్వామి. ఇక్కడ తెరతీస్తే కనిపించేది పాతాళబిలం లాంటి కొట్టు.

నంతలో టోకుగా కూరగాయలు, లూజుగా లారీలోపోసి తరువాత యిచ్చవచ్చినట్టుగా బుట్టలకెత్తినట్టు సైజు, సబ్జక్టు అన్న పట్టింపు లేకుండా అక్కడ పుస్తకాలు స్టాండులో గుప్పబడివున్నాయి. పుస్తకాలు పాతగిల్లిన కొద్దీ అదొకరకం వాసన పుట్టుకొస్తుంది. అలాంటి వాసనతో అదొక గిడ్డంగి లావుంది.

''పిల్చు కొచ్చేశానోయ్ చెంచయ్యా! చెబుతుండే వాణ్ణిగా! వీరే గురువుగారు ...'' అంటూ పేరుతో సహా నన్ను పరిచయం చేసి పెట్టాడు కన్నారావు.

''అలాగా! రండిసార్! నమస్కారం. కూచోండి'' అంటూ ఆప్యాయంగా లోపలికి ఆహ్వానించాడు చెంచయ్య. కూచోమన్నాడే గానీ, పుస్తకాల స్టాండుల మధ్య నేను కుర్చీ వేసుకుని కూచుంటే, తరువాత లోపలికి బయటికీ రాకపోకలు బంద్తైపోయేటట్టున్నాయి. అంచేత నిల్చునే చేతికి దొరికిన పుస్తకాన్ని పైకితీసి చూడసాగాను. కాఫీ గ్లాసుతో దగ్గరికొచ్చేశాడు చెంచయ్య. ''పుస్తకాలు చూస్తున్నారా సార్! చూడండి. మీకు పనికొచ్చేవి గూడా వుండే వుండొచ్చు. సార్! నిజం చెబుతున్నానుసార్! మీకు చాలా పేరుంది. పుస్తకాల కొనుగోలుకు వెళ్ళినప్పుడల్లా అక్కడివాళ్ళు మిమ్మల్ని గురించి అడగడమే! గంటా గవర్రాజని ఓ పబ్లిషరున్నాడు ఓ పుస్తకం రాయించి పెట్టమని సతపోరుతున్నాడు సార్!''

''ఏదీ! ఆ గంటాగవర్రాజు పుస్తకాలిక్కడున్నాయా?'' అని అడిగాను. ''ఇదిగో, ఈ రెండు వరుసల విందుకూ అవే! అంతా వందల లెక్కల్లోనే కొనుగోలు! మాకు వంద నూటయాభైకి పడుతుంది. మేము డజను పాతికకుగానీ, ఒక్కొక్కటి రెండున్నరకు గానీ ఎలావీలైతే అలా వదిలించుకుంటాం!''

''మరైతే ఈ పుస్తకం మీది రేటుకూ, మీ హోల్‌సేల్, రీటెయిల్ రేట్లకూ సంబంధం వున్నట్టులేదే!'' అన్నాను

''ఇహిహీ'' అన్నాడు చెంచయ్య. ''ఈ వ్యాపారంలో చాలా లొసుగులున్నాయి లెండి గురువుగారూ! అదిగో, ఆ అటకమీద వున్న పుస్తకాలనైతే మేము వేల లెక్కల్లో కొంటాం. పోనీ ఇవి చూడండి! లైబ్రరీ ఎడిషన్ల కంటే అందంగా లేవూ! ఇవి నాకు అరవై పర్సెంటు

## రిపోర్టర్

– [illegible]

[illegible]
కష్టాల కత్తుల వంతెన [illegible] దాటుతాడు
[illegible] వెళ్ళల అసలు రంగు తెల్పి
[illegible] ప్రైవేట్ [illegible]
[illegible] కాళ్ళకు కట్టిన
[illegible] గాయాలకు
[illegible] మందులు పూస్తుంటాడు
[illegible]
[illegible] ముందడుగు [illegible]
[illegible]
[illegible]
[illegible] మెరుగానే [illegible]
[illegible] మూలమూల్లో [illegible]
[illegible] మూటగట్టుక వచ్చి
[illegible] ముందు విప్పుతాడు
[illegible]
[illegible] లాంటి దొరికే బరువును
[illegible] చూస్తాడు
[illegible] దారిలో నుండి
[illegible] తోడి, దాని ముంగిట పోసి
[illegible] పంటల్ని పండిస్తాడు
[illegible] చెలరేగిన
[illegible] ఊపిరి సలపకపోయినా,
[illegible] నిరంతరం కర్తవ్యాన్ని [illegible] ●

★ అల్లసాని పెద్దన సాహితీపీఠం, కడప. కార్యదర్శి: కె. గురుబ్రహ్మం

కమీషను పైన దొరికాయి .. ''

పాతపుస్తకాల వాసన కాఫీ ప్రభావం చెంచయ్య ద్వారా తెలిసిన వర్తమానం. ఈ మూడింటిల్లో ఏది కారణమో చెప్పలేను. నాకు స్వల్పంగా తల తిరుగుతున్నట్టుంది.

కామినీ, శాఖినీ, ఢాకినీ పిశాచాల గురించి నేను వినివున్నాను. ప్రత్యక్షంగా చూచే అవకాశం చెంచయ్య కొట్టులోనే లభించింది. ఏంలేదు, ఓ పుస్తకం తియ్యి. ముఖపత్రం వైపు చూడు. కామినీ పిశాచం వచ్చి నీ కనుపాపలో నిలుస్తుంది. నన్ను చూడు, నా అందం చూడు' అన్నట్టుగా ఓ మోహినీ పిశాచం బట్టలు విప్పుకుని పైకి వచ్చేస్తున్నట్టే వుంటుంది. తలలు విరబోసుకున్న జీబుదెయ్యాలు, బట్టలో ఒళ్లు దాచుకుని మీట్టపళ్లు ముందుకు చాపే ముసుగుదయ్యాలు. తల పుర్రెలు, కంకాళాలు, నెత్తురు మడుగులలో శవాలు. పెట్టెతియ్యి, శవం! గదిలో ప్రవేశించు, శవం! గొయ్యి త్రవ్వు, శవం!

చేసిన పాపం చెప్పుకుంటే పోతుందంటారు. నేనొకటి రెండు పుస్తకాలు తెరిచి అడుగు పెట్టరాని చోట్లల్లో అడుగుపెట్టాను. తిండీనీళ్లూ, బ్రతుకూ పరిమార్థమూ అంతా అదే అయినట్లు స్త్రీ పురుషులు కుక్కల్లా, పందుల్లా వ్యవహరించే వల్ల కాటి నాగరికత అంతా అక్కడే వుంది. కాపాలికులు శ్మశానాల్లో శవాలతో సంభోగిస్తారని ఎక్కడోచదివి, నేను నాలుగురోజులు తిండీనీళ్లూ లేకుండా ఖాయిలా పడ్డాను. చెంచయ్య అంగట్లో మళ్లీ అలాంటి అనుభవం ఎదురయ్యేట్టు తోచింది. ఒళ్లంతా చెమటలు పోశాయి. కాళ్లు కంపిస్తున్నాయి. కళ్లు గిర్రున తిరుగుతున్నాయి. ఉన్నట్టుండి శవాల జాతరలో పీనుగుల కుంభమేళలో, ఆటవిక దిగంబరుల పాశవిక ప్రవృత్తుల నడుమ నేను చిక్కువడి పోయాను.

అప్పటికి తనకు కావలసిన పుస్తకం ఒకటి ఎన్నిక చేసినట్టున్నాడు కన్నారావు. వీరబాహుడి దగ్గర కాటి సుంకం చెల్లిస్తున్నాడు.

'' ఇక వెళదామా కన్నారావ్ ! '' అన్నాను.

నామాట ఆక్రోశంలా వినిపించిందేమో, చెంచయ్య ఉలిక్కిపడ్డాడు.

''గురువుగారూ ! ఇక్కడ కొన్ని మంచి పుస్తకాలుండాలి. చూవారా '' అంటూ పరిగెత్తుకొచ్చాడు.

నిజమే ! అవి చాలా మంచి పుస్తకాలు. ఏ పబ్లిక్ లైబ్రరీలోనో ఉండదగినవి. ఏ సాహిత్యాభిమాని పుస్తక సంచయంలోనో చోటు చేసుకోదగినవి. పాపం, అకాల మరణం పొంది యిక్కడికి వచ్చినట్టున్నాయి.

'' వెళ్దామా ? '' అన్నాడు కన్నారావు. అప్పటికే నేను మెట్లుదిగి రోడ్డు పైన వున్నాను.

పదిబారల దూరం నడిచాక రహస్యంగా నాతో అన్నాడు కన్నారావు. '' మేష్టరు గారూ ! కొట్టుక్రింద నేలమాళిగ లాంటి దొకటుంది. దాని నిండా గూడా పుస్తకాలే వున్నాయి. చెంచయ్య ఎంతో నమ్మకమైన వాళ్లకు గానీ వాటిని చూపించడు. మీకైతే అభ్యంతరముండదముకుంటాను. చూస్తారా ఒకసారి ... ''

'' ఓహో, సుప్తాస్తికలన్నమాట ! వద్దులే కన్నారావ్ ! వాటిని మనం నిద్రలేపొద్దు. అవతల నాకింక అరగంటలో బస్సుంది '' అంటూ పరుగందుకున్నాను ●

## నగరం, నరకం



# ఎల్లువ

—దాదా హయాత్

"యెంకటేస్వర సామీ, కాపాడు తండ్రీ," కోర్టుహాల్లోకి వెళ్తూ తిరుపతి కొండ వున్న దిక్కుకు తిరిగి దండం పెట్టుకున్నాడు గొల్లనారాయణ.

దావా గెలిస్తే కొండకొస్తానని మొక్కుకున్నాడతను. ఆరోజే తీర్పు. కొద్ది సేపటి క్రితమే అతని వకీలు అతనికి ధైర్యం చెప్పాడు. "మరేం పరవాలేదు. దావా గెల్చేది మనమే. నువ్వు నిమ్మళంగా వుండు," అన్నాడు.

గొల్ల నారాయణ అలాగేనని బుర్రూపాడు. అయితే అంతటితో అతనికి ధైర్యం చిక్కలేదు. "అన్నింటికీ నువ్వే వుండావు సామీ," తిరుపతి వెంకన్నను తల్చుకుని అప్పుడే మనసులో దండం పెట్టుకున్నాడు. అతని భార్య కూడా అతను కోర్టుకు బయల్దేరే ముందు అదే చెప్పింది. "సామి సల్లంగా సూడాల్నే గాని, ఈ వకీల్లతో యేమైతాది? కోరటుకాడ నిన్ను బిల్సినప్పుడు యెంకటేస్వర సామిని తల్సుకో," అని హితబోధ చేసింది. గొల్ల నారాయణ ఇప్పుడలాగే చేశాడు. దాంతో మనసుకు కొంత ధైర్యం చిక్కింది. 'అన్నింటికీ బగమంతుడే వుండాడు. యెవలికీ ఆయన అన్యాలం సేయుడు,' అనుకున్నాడు. దాంతో మరికొంత ధైర్యం చిక్కింది. జడ్జిగారి ముందు వణక్కుండా నిలబడ గలిగాడు.

"గొల్లనారాయణ నువ్వేనా?" అడిగాడు బెంచి గుమాస్తా.

"నేనే సామీ," అన్నాడు నారాయణ.

"నీ దావా కొట్టేసినారు పో," అన్నాడు బెంచి గుమాస్తా. నారాయణకి అతనేం చెబుతున్నాడో తెలీలేదు. దావా కొట్టేసినారంటే గెల్చినట్టో ఓడినట్టో అర్థం కాలేదు.

"అంటే దావా గెల్చినానా సామీ?"



ఆ ప్రశ్నకు కోర్టు హాలంతా గొల్లున నవ్వింది.

'' ఓడి పోయినావు పోవయ్యా. నీ దావా పోయింది, '' అన్నారెవరో.

గొల్లనారాయణ కళ్ళముందు చీకటి వ్యాపించినట్లయ్యింది.

'' అన్యాలం సామీ, ఆ భూమి నాదే, '' మొరపెట్టుకున్నాడు.

జడ్జి మొదటిసారిగా నోరు విప్పాడు. '' భూమి నీదేనంటే అప్పీలు చేస్కో. ఇంక నేను చెయ్యగలిగిందేం లేదు. ''



నారాయణ ఎలా కోర్టు హాల్లోంచి బయటి కొచ్చాడో అతనికే తెలీదు.

''యెంకటేస్సర సామీ, నువ్వు గుడ్కా మోసం జేస్తివా!'' బిగ్గరగానే అనుకున్నాడు.

అతని వకీలు ఎక్కడా కనిపించ లేదు. మాలఈరిగాడు మాత్రం కనిపించాడు.

''ఈరిగా, మీకేం జేసినాననిరా నన్నీమైన సతాయిస్తావుండారు?'' కళ్ళల్లో నీళ్ళు తిరుగుతుండగా అడిగాడు.

ఈరిగాడు అతని వైపు జాలిగా చూశాడు.

''మాదేం లేదన్నా. గవర్నమెంటోల్లు ఆ భూమి మాకిస్తామంటే తిరుగుతాండాం,'' అన్నాడు.

''ఆ భూమి నాదిరా,'' వాపోయాడు నారాయణ.

'గవర్నమెంటుదంట గదన్నా! నీది కాందాని కెందుకు గసపెట్టుకుంటూ తిర్గుతావ్? లెక్కంతా కొండబోయి వకీల్ల నోట్లో యెందుకు బోస్తావ్? దావా వదిలేయ రాదా?'' సలహా ఇచ్చాడు ఈరిగాడు. ''యెంత మాటంటివిరా ఈరిగా! ఆ భూమి నాదన్న, ఏడుపొక్కటే తక్కువగా అన్నాడు నారాయణ.

ఈరిగాడు అతని మొహంలోకి చూడకుండా కళ్ళు తిప్పుకున్నాడు.

''వస్తాన్నా. నే బోతాండా. ఈ పొద్దు ఎమ్మార్వో రమ్మన్నాడు,'' అంటూ మళ్ళీ అతని వైపు చూడకుండా వెళ్ళిపోయాడు.

నారాయణ హతాశుడై ఒక చెట్టు కింద ముడుచుకుని కూర్చుండిపోయాడు. ఎదురెండకు కళ్ళు బైర్లు కమ్ముతున్నట్లనిపించి భుజం మీది పై గుడ్డ దులిపి నెత్తికి చుట్టుకున్నాడు. సూర్యకిరణాలు అప్పటికీ అతన్ని వదలకపోవడంతో నుదుటి మీద అరచేతులు చేర్చుకుని కూర్చున్నాడు.

కాసేపటికి అతని వకీలు అటుగా వెళ్తుండడం కనిపించింది. గొల్ల నారాయణ చెట్టు కింద నుంచి లేచి అతనివైపు పరిగెత్తాడు.

''సామీ!''

పరబ్రహ్మేశ్వర శాస్త్రి ఆగి అతని వైపు తిరిగాడు.

గొల్ల నారాయణ ఆయనకు రెండు చేతులూ జోడించాడు.

''దావా గెలుస్తామంటిరి గద సామీ! ఓడిపోతిమి.''

పరబ్రహ్మేశ్వర శాస్త్రి ఇబ్బందిగా మొహం పెట్టాడు. ఆయనకు బదులు ఆయన వెనకే దావా కట్టలు పట్టుకొస్తున్న వకీలు గుమాస్తా చంద్రాయుడు నోరు తెరిచాడు. ''సారుదేం తప్పులేదు నారాయణా! మనకేసు బలంగా వుండింది. ఆ మాల నాకొడుకులే జడ్జీకి లంచ మిచ్చారు,'' అన్నాడు.

పరబ్రహ్మేశ్వర శాస్త్రి ఆ ట్రిక్కుతో కొంచెం తేరుకున్నాడు.

''అవునవును. చేసిందంతా వాళ్ళే. అందులోనూ ఆ జడ్జీ పరమనీచపు ముండాకొడుకు. లంచమిస్తే చాలు, లొంగిపోతాడు,'' అన్నాడు.

''ఆ మాలోల్ల కాడ లంచమిచ్చినంత లెక్క యాడిది సామీ? అదే వుంటేగిన ఉద్దరగొచ్చే భూమి కోసరం యెంపర్లాడతారా?'' ఆశ్చర్యం ప్రకటించాడు నారాయణ.

''వెర్రి గొల్లోనివి నీకేం తెలుసులే నారాయణా! వెనకటి కాలం కాదు. ఈ కాలం మాలోళ్ళకాడ ఎంత డబ్బుందో నీకేం తెలుసు. ఉద్యోగాలు వాళ్ళవే. ఊళ్ళో భూములు వాళ్ళవే. అన్ని సదుపాయాలు వాళ్ళకే. అంత దూరం ఎందుకు, నీ భూమి కూడా వాళ్ళకే పోతోంది చూశావా! అడిగే నాధుడేడి? కోర్టులు కూడా వాళ్ళకు అనుకూలంగానే తీర్పులు చెబుతున్నాయి,'' తన ఆర్గుమెంటు వినిపించాడు పరబ్రహ్మేశ్వరశాస్త్రి.

''ఇప్పుడేం చేయాల సామీ?'' అడిగాడు నారాయణ.

''ఏం చేసేదేముంది? సబ్ కోర్టులో అపీలు చేసుకోవాలి,'' అన్నాడు చంద్రాయుడు.

''అలా చేస్తే నాభూమి నాకు తిరిగొస్తాదా సామీ?''

''ఎందుకు రాదు? మన కేసులో బలం వుందని చెప్తిని గదా.''

''అందుకెంతైతాది సామీ?'' పరబ్రహ్మేశ్వర శాస్త్రి వైపు తిరిగి అడిగాడు నారాయణ.

''ఆ విషయం చంద్రాయుడు చెప్తాడు. నాకవతల ఇంకో కేసుంది,'' అంటూ హడావుడిగా వెళ్ళిపోయాడు పరబ్రహ్మేశ్వర శాస్త్రి.

నారాయణ చంద్రాయుడి వైపు చూశాడు.

''ముందో పది రూపాయలు త్యా, చెప్తాను,'' అన్నాడు చంద్రాయుడు.

''ఇప్పుడు లేవు సామీ. జేబులో లెక్క లేదు.''

''అయితే సాయంత్రం ఆఫీసు కురా, అడ చెప్తాను,'' అంటూ వెళ్ళిపోయాడు చంద్రాయుడు.

నారాయణ కాసేపు దిక్కు తోచని వాడిలా అక్కడే తచ్చాడి నెమ్మదిగా

జీవితంలో బలం మాత్రమే బలమైంది కాదు. ఆలోచన అంతకంటే బలమైంది. అనుభూతి దానికన్నా బలమైంది. ప్రేమ అన్నిటికంటే బలమైంది. ఇంకో విశేషమేమంటే ఒకోసారి బలహీనతే బలమవుతుంది.

— డా. సంజీవదేవ్

కోర్టు ఆవరణలోంచి బయటికొచ్చాడు.

'' ఏం నారాయణా, యేమైంది కేసు ? '' అడిగాడు రాముడు.

కోర్టు వెలుపల టీ బంకు అతనిదే. అక్కడికి వచ్చినప్పుడల్లా నారాయణ రాముని టీయే తాగుతాడు.

'' పోయిందన్నా, దావా కొట్టేసినారు, '' దిగులుగా అన్నాడు నారాయణ.

రాముడు అతని మొహం చూసి ఆమాట ముందే గ్రహించాడు. ఏళ్ళ తరబడి కోర్టు ముందు టీ బంకు నడుపుతుండటం వల్ల ఎవరికేసు ఏమైందో మొహం చూసి చెప్పగల అనుభవం సంపాయించుకున్నాడతను. నారాయణ ఆమాట చెప్పగానే గమ్మున గ్లాసులో టీ పోసి అతని వైపు చాచాడు.

'' ఇదో, టీ తాగు. ''

'' వద్దులే, '' అన్నాడు నారాయణ.

'' పరవాలేదు తీస్కోన్నా. కోర్టులో కేసు గెలవాల్నంటే అంత సులభంగా అయితాదా? అవసరమైతే హైకోర్టుగ్గుడా పోవాల్సొస్తాది. ముందు టీ తాగు. ''

నారాయణ టీగ్లాసందుకున్నాడు. అతనికి టీ తాగాలని లేదు. కడుపులో దహించుకుపోతోంది. అయినా నెమ్మదిగా టీ చప్పరించడం మొదలెట్టాడు.

రాముడు పిస్టన్‌కొట్టి కిరసనాయిలు స్టవ్ మంట ఎక్కువ చేస్తున్నాడు. బుస్‌మని శబ్దం చేస్తూ మంట క్రమంగా పెరుగుతోంది. స్టౌమీదున్న పాత్రలో టీ మరింత వేగంగా మరగనారంభించింది.

నారాయణ ముభావంగా స్టౌమంటకేసి చూస్తూ కూర్చున్నాడు. తన పరిస్థితి ఆ స్టౌమీద మరుగుతున్న టీ పరిస్థితి ఒకటేననిపించిందతనికి. చూస్తుండగానే చేజారిపోతున్న తన నాలుగెకరాల భూమి గుర్తుకొచ్చింది. ఇక టీ తాగబుద్ధి కాలేదు. గ్లాసు పక్కనే బల్లమీద పెట్టేసి శూన్యంలోకి చూస్తూ కూర్చున్నాడు.

ఆ నాలుగెకరాల భూమినే నమ్ముకు బతుకుతున్న సన్నకారు రైతు అతను. వాన సరిగ్గా వస్తేగానీ అది కూడా సరిగ్గా పండదు. చాలాకాలం క్రితం అతనికా భూమికి పంపుసెట్టు వేయించాలనే ఆలోచన వుండేది. తన భూమికి పక్కనే వున్న రామిరెడ్డి పంపుసెట్టు కోసం బ్యాంకు ఋణం ఇప్పిస్తానని కూడా చెప్పాడు.

అయితే ఋణం తీసుకుని పంపుసెట్టు వేయిస్తే ఏమవుతుందో నారాయణకు తెలుసు. రామిరెడ్డి ఆ వూళ్ళోకల్లా పెద్ద పాలెగాడు. ముప్పై ఎకరాల ఆసామి. తన పల్లెలో పెత్తనమంతా అతన్దే. అతని మాట విని తను పంపుసెట్టు వేయించుకుంటే ఋణం ఇప్పించిన నెపం మీద పంపు నీళ్ళు తన భూమిలోకి మళ్ళించమంటాడు. తన నాలుగెకరాల సంగతేమో కాని అతని ముప్పై ఎకరాలకు నీళ్ళు సప్లై చేయడానికే తన జీవితకాలం సరిపోతుంది. ఆ భయంతో పంపుసెట్టు గురించి ఆలోచన మానుకున్నాడు. నీళ్ళు నదుపాయం వుంటే వరి సైతం పండే పొలం అతన్ది. వేరుశెనగ, పొద్దుతిరుగుడు పూలు అలాంటి వ్యాపార పంటలతోనే కాలం వెళ్ళబుచ్చుతున్నాడు. అంతలోనే పొలాన్ని వదిలిపెట్టి పొమ్మని గవర్నమెంటు ఆర్డరు పిడుగులా వచ్చి పడింది.

ఫలానా సర్వే నంబరు ప్రకారం గవర్నమెంటు పోరంబోకుగా వుంటూవున్న భూమిని చట్టవ్యతిరేకంగా నువ్వు దురాక్రమణచేసి సాగు చేస్తున్నట్లు మాకు తెలియవచ్చింది కావున వెంటనే భూమిని వదిలిపెట్టి పోవలసింది. అట్లు కాని యెడల నీ పై చట్టపరమైన చర్యలు తీసుకొనబడును — అదీ ఆర్డరు.

అలాంటి ఆర్డరు రావడంతో నారాయణకు మతి పోయినట్లయింది. ఇదేం అన్యాయం! తను సాగుచేస్తున్న భూమి గవర్నమెంటు పోరంబోకు కాదు. తాత తండ్రులనుంచి తనకు సంక్రమించింది. లబోదిబోమంటూ అతనా ఆర్డరు పట్టుకుని ఎమ్మార్వో ఆఫీసుకు వెళ్ళాడు. వాళ్ళకాళ్ళు పట్టుకుని వీళ్ళకాళ్ళు పట్టుకుని ఎలాగో తన భూమికి సంబంధించిన రికార్డులు బయటికి లాగించాడు.

''రికార్డుల్లో ఆ భూమి గవర్నమెంటు పోరంబోకనే వుంది. కాబట్టి నువ్వా భూమి వదులుకోవలసిందే, '' అన్నారు వాళ్ళు.

ఆ రికార్డులు పుట్టక ముందునుంచీ ఆ భూమిని వంశానుగతంగా తామే సాగుచేస్తూ వస్తున్నారు. అలాంటిది రికార్డుల్లోకి ఆ భూమి గవర్న మెంటు పోరంబోకని ఎందుకు ఎక్కిందో ఎంత బుర్ర బద్దలు కొట్టుకున్నా అతనికి అర్థం కాలేదు.

'' ఇదంతా కరణమయ్య పనే అయ్యుండాల. మీ నాయన బతికుండగా చానా పితలాటకం చేసిందా

భూమితో మాట్లాడు అది జ్ఞానాన్ని ఇస్తుంది
భూమి తల్లి కవిత్వం అమరం
ఊహ ఏ సౌందర్యాన్నయితే ఆకళింపు చేసుకుంటుందో అదే సత్యం

- జాన్ కీట్స్

యప్పే కదా. ఇప్పుడంటే ఈ ఎమ్మార్వోలూ వీళ్లంతా వచ్చినారు. అప్పుడంతా కరణమయ్యేగదా. పోయి అడుగు,'' అని సలహా ఇచ్చింది నారాయణ భార్య.

లక్ష్మమ్మ చెప్పింది నిజమే. ఇది కరణమయ్య చేసిన పితలాటకమే అయ్యుండాలి. నారాయణ పిల్లప్పుడు నారాయణ తండ్రికి తీవ్రంగా జబ్బు చేసింది. దాంతో భూమి సాగుచేసే వాళ్ళెవరూ లేక పోయారు. అప్పుడు కరణమయ్యే ఒక ప్రతిపాదన తెచ్చాడు.

''చూడు శేషన్నా! ఈ పరిస్థితిలో భూమి నువ్వెలాగా సాగు చేసుకోలేవు. కాబట్టి నాకు గుత్తకి చ్చేయ్. వచ్చిన పంటలో ఎంతోకొంత సీకిస్తాను. దాంతో నీకు దిగులుం డదు,'' అన్నాడు.

నారాయణ తండ్రికి కూడా ఆ పరిస్థితిలో అంతకంటే చేయగలిగిం దేం లేదనిపించింది. దాంతో కరణమ య్యకే ఆ పొలం గుత్తకిచ్చేశాడు. కరణమయ్య ఒక రెండేళ్ళు బాగానే వున్నాడు. ఆ తర్వాత మనిషే మారిపోయాడు. ఆ భూమి తనదేనని ప్రచారం చేసుకోవడం మొదలెట్టాడు. గుత్త ఎగ్గొట్టేశాడు.

అలా కొన్నేళ్ళు గడిచాయి. ఈలోగా నారాయణ తండ్రి జబ్బు నుంచి కోలుకున్నాడు. కరణమయ్య సంగతి పదిమంది పెద్దల్లో పంచాయి తికి పెట్టించాడు. ఆ భూమి తనదేనని కరణమయ్య మంకుపట్టుపట్టి కూర్చు న్నాడు. ఒకసారి అది తన తాతల కాలంనాటిదని బుకాయిస్తాడు. ఒక సారి శేషన్నే అది తనకు అమ్మేశాడం టాడు.

ఆ సమయంలో ఆ ఊరి రెడ్డిగా వున్నా, భూమిరెడ్డి, శేషన్న పక్షాన నిలిచాడు. అంతకుముందు కొద్దిరోజు లుగా కరణమయ్యకూ రెడ్డికీ ఏదో విషయమై కీచులాట జరిగింది. అదే శేషన్నని రక్షించింది. లేకపోతే భూమి కరణమయ్యదేనని తీర్పు చెప్పేసే వాడు రెడ్డి. శేషన్న భూమి శేషన్నకు ఆ విధంగా తిరిగి ఇవ్వక తప్పలేదు కరణమయ్యకు. అప్పట్నుంచీ శేషన్న కుటుంబం మీద గుర్రుగానే వుంటూ వచ్చాడు. ఎలాగైనా ఆ భూమి కాజేయాలని ఆ తర్వాత కూడా పథకాలు వేస్తూనే వున్నాడు.

శేషన్న తదనంతరం ఆ భూమి నారాయణకు వచ్చింది. ఆ తర్వాత కరణమయ్య పరిస్థితి కూడా మారిపో యింది. ప్రభుత్వం రెడ్డి కరణం పోస్టులు రద్దుచేసి మండల కార్యాల యాలు తెరిచింది. కరణం తన కొడుక్కి విలేజ్ ఆఫీసర్ ఉద్యోగం తెచ్చుకోవాలని చాలా ప్రయత్నించి విఫలమయ్యాడు. ఆ తర్వాత ఆయ నకు పక్షవాతం కూడా వచ్చింది. నారాయణకు శ్రీముఖం చేతికొచ్చే సమయానికి కరణమయ్య మంచాన పడున్నాడు. నారాయణ గవర్న మెంటు ఆర్డరు పట్టుకుని కరణ మయ్య దగ్గరికి వెళ్ళాడు.

''చూడు కరణమయ్యా, ఏం దిది?'' అన్నాడు నారాయణ. కరణమయ్య పరిస్థితి దారుణంగా వుంది. కుడిచెయ్యి, కుడికాలు పడిపోయాయి. మూతికూడా వంకర తిరిగింది. అయినా మాట్లాడగలిగే స్థితిలోనే వున్నాడు. నారాయణ పట్టుకొచ్చిన ఆర్డరు చూసి వంకర మూతితో అసహ్యంగా నవ్వాడు.

''ఇలాంటిది ఏదో రోజున జరుగుతాదని నాకు తెలుసురా. నేనే ఆ పని చేసింది,'' అన్నాడు ఏమాత్రం సిగ్గుపడకుండా.

నారాయణ గుడ్లు మిటకరించి, ''ఏం చేసినావు కరణమయ్యా?'' అన్నాడు.

''మీ నాయన నాకు చేసిందానికి రెండింతలు చెయ్యాలనుకున్నా. రికా ర్డుల్లో ఆ భూమి గవర్నమెంటు పోరంబోకని నేనే నాస్వహస్తాంతో రాసినా.''

'న్యాయంకోసం పోట్లాడ్డమే మా నాయన చేసిన నేరమా కరణ మయ్యా?' అని నారాయణ అడగ లేదు. ''నీ కోపం మా నాయనమీం దైతే నేనేం జేసినా కరణమయ్యా? బీద నాకొడుకుని నన్నన్యాయం చేస్తివే!'' అన్నాడు గుండె బాదు కుంటూ.

''నువ్వు మాత్రం? మీ నాయన కొడుకువి కావేమిరా? అన్నాడు కరణమయ్య.

''ఎప్పటిదో పగ ఇప్పుడు నామీద ఎందుకు తీర్చుకుంటావు కరణ మయ్యా? ఈ కుడిసేత్తో ఎన్ని దొంగరాతలు రాసి ఎందరి కొంపలు ముంచినావో బగవంతుడా చెయ్యి పడిపోయినట్టు చేశ. ఇంకనైనా కనికరించి ఈ భూమి గొల్ల నారాయణదని సాచ్చెం చెప్పరారా,'' కడుపుమంట ఆపుకోలేక అనేశాడు నారాయణ.

కరణమయ్య తల అడ్డంగా వూపాడు. ''నువ్వన్నెట్టు ఎన్నో పాపాలు చేసిన చెయ్యి పడిపోనే పడిపోయింది. అయితే మాత్రం నీకు నేనెందుకు సాయం చెయ్యాల? నా

సంఘం ఇష్టం తీర్చేవాడు గొప్ప రచయిత. తన ఇష్టం సంఘంచే స్వీకరింప చేసేవాడు కూడా గొప్ప రచయితే.

— కొలకలూరి ఇనాక్

చెయ్యి నాకు తిరిగొస్తాదా? ఇప్పుడీ భూమి నీదని సాక్ష్యం చెబితే దొంగ రికార్డులు రాసినందుకు నా గొంతు మీదికొస్తాది. పో, పోయి కోర్టులో కేసేసుకో, '' అన్నాడు.

'' అంతేనంటావా కరణాలయ్యా? '' దీనంగా అడిగాడు నారాయణ.

'' అంతే పో. నేనేం చేయలేను. ''

నారాయణ వకీల్ని చూడ్డానికి వెళ్ళాడు.

ఈలోగా మరొకటి జరిగింది.

ముప్పై సంవత్సరాల క్రితం ఎప్పుడో కుందేరు పొంగి చుట్టుప్రక్కల పల్లెలు కొన్ని మునిగిపోయాయి. ఆ ముంపులో బాగా దెబ్బతిన్నవి హరిజన కుటుంబాలు. వాళ్ళంతా కూడబలుక్కుని ఆ పల్లెలు వదిలేసి ఎగువ ప్రాంతాలకు వలసవెళ్ళారు. వాళ్ళంతా నారాయణ వుండే వూరు చివర కొట్టాలు వేసుకున్నారు. అప్పట్లో వాళ్ళని కొట్టాలు వేసుకోనిచ్చింది ప్రస్తుతం నారాయణ భూమికి పొరుగువాడైన రామిరెడ్డి తాతగారే. అప్పట్లో ఆయన పంచాయతీ బోర్డు ప్రెసిడెంటుగా వుండేవాడు. ఆవూరి రెడ్డి అయిన భూమిరెడ్డి నుంచి తీవ్రమైన పోటీ ఎదుర్కొంటున్నాడాయన.

'' మరేం పర్వాలేదు. ఇవన్నీ మన స్థలాలే. మీరంతా కొట్టాలు బేస్కోండి. మీ పేర్లు ఓటర్ల జాబితాలో ఎక్కిస్తాను. ఓట్లు నాకు బేయండి, '' అన్నాడు రామిరెడ్డి తాత.

హరిజనులు సరేనన్నారు.

రామిరెడ్డి తాతగారి రాజకీయాస్త్రం బ్రహ్మాండంగా పనిచేసింది. కొత్తగా తెచ్చుకోగలిగిన ఓట్లతో పంచాయితీ బోర్డు ఎన్నికల్లో ఆయన భూమిరెడ్డి అభ్యర్థిని చిత్తుగా ఓడించాడు. అప్పట్నుంచీ హరిజనులు అక్కడే వుంటున్నారు. వాళ్ళ ఓట్లన్నీ ఎప్పుడూ రామిరెడ్డితాతకే పడేవి. దాంతో ఆయన జీవితకాలంలో రాజకీయపలుకుబడికి తిరుగు లేకపోయింది.

ఆయన తదనంతరం రామిరెడ్డి హయాం వచ్చింది. అతనూ పంచాయితీ బోర్డు ప్రెసిడెంటు కావాలని ఆశపడ్డాడు. అయితే చాలాకాలం పాటు ప్రభుత్వం ఎన్నికలు జరపనే లేదు. ఇప్పుడు మళ్ళీ ఎన్నికలు జరుగుతాయనే. అలికిడి వినిపించ సాగింది.

ఈసారి ఎన్నికల్లో హరిజనుల ఓట్లు రామిరెడ్డికి పడవనే విషయం ముందే తేలిపోయింది. రామిరెడ్డి హరిజనుల్ని ఎప్పుడూ మనుషులుగా చూసినవాడు కాదు. మాలనా కొడుకులు ' అనే పదం తప్ప వాళ్ళను గురించి అతని నోటివెంట మరో మాట దొర్లిపడదు. దానికి తోడు అతని మనుషులుకూడా హరిజనుల పల్ల నీచంగా ప్రవర్తించడం మొదలెట్టారు. హరిజనుల ఆడవాళ్ళు కనిపిస్తే ఏడిపించడం, ఒంటరిగా దొరికితే పైటలాగడం వంటివి నిత్యకృత్యాలయినాయి. దాంతో హరిజనులు ఈసారి ఎన్నికల్లో రామిరెడ్డికి బాగా బుద్ధి చెప్పాలనే కృతనిశ్చయంతో వున్నారు.

రామిరెడ్డితో ఎవరు పోటీ చేస్తారో ఇంకా తేలలేదు. అతని తాతగారి కాలంలో గట్టిపోటీ ఇస్తూవచ్చిన భూమిరెడ్డి ఇప్పుడు లేదు. అతను బతికుండగా తనకుంటుంబం నుంచి ఎవర్నో ఒకర్ని పోటీగా నిలబెట్టేవాడు. వాళ్ళలోనే ఎవరైనా పోటీకి నిలబడవచ్చు. అదే జరిగితే ఈసారి ఎన్నికల్లో హరిజనుల ఓట్లు అవతలకి పోవడం ఖాయం. రామిరెడ్డి ఓడిపోవడము ఖాయమే.

దాంతో హరిజనుల్ని, స్థలాలు ఖాళీచేయమని పట్టుబట్టాడు రామిరెడ్డి. '' మాయబ్బ ఉద్ధరకిచ్చిన స్థలాలు. ఎల్లకాలం ఆడనే వుంటారే మిరా మాల నాకొడుకుల్లాలా? ఖాళీ చేయండి, '' అంటూ తాఖీదు ఇచ్చాడు.

ఆ తర్వాత చాలా కథ జరిగింది. విషయం కలెక్టరు దాకా వెళ్ళింది. ఎప్పుడో ముప్పైసంవత్సరాల క్రితం ఆక్రమించుకున్న స్థలాలు ఇప్పుడు హరిజనులు వదలడమేమిటని కలెక్టరు అడగలేదు. అలా అడగటానికి బదులు ఒక నిర్ణయం చేశాడు. హరిజనులకు వేరేచోట స్థలాలు చూపిస్తానన్నాడు. వాళ్ళు అందుకు ఒప్పుకున్నారు.

ఇక వాళ్ళకు వేరే స్థలం చూపించే విషయం వచ్చేసరికి ఎమ్మార్వోగారికి గబుక్కున దొరికింది. నారాయణ సాగుచేస్తున్న భూమే. దాన్ని హరిజనులకు అలాట్‌చేస్తూ ఆర్డర్లు కూడా జారీ అయిపోయాయి.

నారాయణ దాంతో మరీ బెంబేలెత్తిపోయాడు.

వకీలు పరబ్రహ్మేశ్వరశాస్త్రి నారాయణకు అభయం ఇచ్చేశాడు. '' మరేం పరావలేదు, నీ భూమి ఎక్కడికీ పోదు. టైటిల్ డిక్లరేషన్‌కి



మాటుపడేద్దాం. దాంతో అటు గవర్నమెంటువాళ్ళూ ఇటు మాల వాళ్ళూ ఇద్దరూ అణిగిపోతారు. నీ భూమి నీ కొస్తుంది, '' అన్నాడు.

నారాయణ సరేనన్నాడు.

కోర్టులో దావా మూడున్నర సంవత్సరాలు నడిచింది. నారాయణ ఓడిపోయాడు. తన కళ్ళముందే తన భూమి అన్యాక్రాంతమైపోయే పరిస్థితి దాపురించింది.

'' ఏమాన్నా, ఇంకో టీ ఇమ్మంటావా ? '' అన్నాడు రాముడు.

స్టేమెంటకేసి చూస్తూ కూర్చున్న నారాయణ నిట్టూర్పుతో లేచి నిలబడ్డాడు. '' వద్దులే. ''

అక్కడ్నించి అతను తన వూరికి వెళ్ళలేదు. ఆపూట భోజనం కూడా చేయలేదు. భోం చేయడానికి ఆకలిగా కూడా అనిపించలేదు.

సాయంకాలందాకా పిచ్చివాడిలా అటూఇటూ తిరిగి పరబ్రహ్మేశ్వర శాస్త్రి ఆఫీసుకు వెళ్ళాడు.

'' రారా, కూర్చో, '' అన్నాడు పరబ్రహ్మేశ్వర శాస్త్రి.

'' అపీలు చేసుకుంటావా ? '' అడిగాడు చంద్రాయుడు.

నారాయణ బుర్రూపాడు.

'' సరే, రేపు లెక్కతెచ్చీ. ముందు కాపీ స్టాంపులు వడేయాల. జడ్జిమెంటు కాపీ వచ్చినాక సబ్ కోర్టులో అపీలు చేసుకోవాల, '' అన్నాడు చంద్రాయుడు.

'' అపీలుకెంతైతాది సామీ ? '' అడిగాడు నారాయణ.

'' ఎంతవుతుంది, మాటుకెంతైందో దాదావు అంతే అవుతుంది, '' అన్నాడు పరబ్రహ్మేశ్వరశాస్త్రి.

నారాయణ గుండె గుభేల్మంది.

'' అంతనా ? '' అన్నాడు నోరు తెరుచుకుని.

'' అంతే మరి. కోర్టా మజాకా, '' అన్నాడు పరబ్రహ్మేశ్వరశాస్త్రి.

నారాయణ మొహం వేలాడేసుకుని తన వూరు తిరిగొచ్చాడు.

వస్తూనే అతను నేరుగా తన ఇంటికి పోలేదు. కరణమయ్య ఇంటికి వెళ్ళాడు.

ఈ మూడు నాలుగేళ్ళలోనూ కరణమయ్య పరిస్థితి మరింత క్షీణించింది. ఇది వరకు మాట్లాడగలిగే వాడు. ఇప్పుడదీలేదు. అతనికి అన్నీ మంచంమీదనే జరుగుతున్నాయి.

నారాయణ వెళ్ళేసమయానికి కరణమయ్య మంచందగ్గర ఎవరూ లేరు. నారాయణ తిన్నగా వెళ్ళి ఆ మంచం పక్కనే నేలమీద కూర్చున్నాడు.

'' నీ పగ తీరినాది కరణమయ్యా ! కోర్టుకూడా నువ్వు రాసిన దొంగ లెక్కే ఒప్పుకున్నాది. ఇంగ మాలోళ్లు నా భూమి ఇగ్గుకుంటారు, '' అన్నాడు.

కరణమయ్య కదల్లేదు. గాజు కళ్ళతో నారాయణకేసి చూస్తున్నాడు.

'' మీరంతా ఒకటే కరణమయ్యా. రెడ్డికూడా యాపొద్దూ నాకాడ పన్ను తీసుకున్నాక రసీదు యాల్యా. ఒక పనికిమాలిన నోటు పుస్తకంలో రాసిస్తావున్న్యాడు. ఆ రెడ్డీ సచ్చినాడు. ఇంక నువ్వు సస్తావ్, '' కసిగా అన్నాడు నారాయణ.

కరణమయ్య గాజుకళ్ళతో ఇంకా చూస్తూనే వున్నాడు.

'' ఎర్రిగోళ్లన్ని చేసి ఈ భూమ్మీద నాకింత అన్యాయం చేస్తే బగమంతుడు మాత్రం మిమ్మల్ని చమిస్తాడా కరణమయ్యా ? మిరంతా సక్కంగా నరకానికి పోతారు. ''

నారాయణ గొంతులో క్రమంగా దుఃఖం చోటు చేసుకో సాగింది.

'' నా భూమి నాక్కాకుండా చేస్తావా కరణమయ్యా ? భూమి పోయినాక కూలిపన్జేసి నా బిడ్డల్ని సాక్కుంటా. కానీ నాకింత చేసినావు నీ బిడ్డలు మాత్తరం అడక్కడుంటారు. చేతిలో చిప్పపట్టుకోని ఇంత ముద్ద కోసరం ఇల్లిల్లూ తిరిగేరోజు నీ పిల్లలకి వచ్చి తీర్తాది కరణమయ్యా ! నా ఉసురు నీ పిల్లలకి తగుల్తాది, '' నారాయణ గుండె దబదబా బాదుకున్నాడు. '' నా ఉసురు తగుల్తాది కరణమయ్యా '' ఇంగా తగుల్తాది. ఇంగా తగుల్తాది. ఇంగా తగుల్తాది. ''

అతని మంచం దగ్గర్నించి దిగ్గున లేచి పోబోతూ మళ్ళీ ఆగాడు. వెనక్కొచ్చాడు. కరణమయ్య మొహంలో మొహం పెట్టి చూశాడు.

'' ఇప్పుడు నీ మంచం కాడ యెవులూ లేరు కరణమయ్యా ! ఇప్పుడు నీ గొంతు పిసికి సంపినా నాకడ్డమొచ్చేటోల్లు ఎవులూలేరు, '' రెండు చేతులూ కరణమయ్య గొంతు దగ్గరి తీసుకెళ్ళాడు.

## అమరులు

**"ఈ విగ్రహం వెనక చరిత్రలో ప్రేమకోసం విలపించిన స్త్రీల రోదన వినబడుతోంది. లోపల ఒత్తిడికి తట్టుకోలేక రక్తం చర్మంపైన చిందినట్లు చిత్రించాలని ఎర్రరాయి వాడారు. అమరావతీ శిల్పులు అమరులు"**

**-బుచ్చిబాబు (ఎల్లోరాలో ఏకాంతసేవ)**

కరణమయ్యలో మొదటిసారిగా కొంత చలనం కనిపించింది. ఎడం చెయ్యి ఎడంకాలు ఆడించడానికి ప్రయత్నిస్తూ గొంతులోంచి కీచుమనే శబ్దం మాత్రం తెగలుగుతున్నాడు.

నారాయణ అతని గొంతు దగ్గ 'గా పోనిచ్చినవాడల్లా మళ్ళీ చేతులు వెనక్కి తీసుకున్నాడు.

'' ఛీ '' అంటూ ముప్పావు వంతు నిర్జీవంగా వున్న ఆ మొహంకేసి అసహ్యంగా చూసి చరచరా అక్కడ్నించి వెళ్ళిపోయాడు.

ఇంటికెళ్ళాక భార్యాబిడ్డల్ని దగ్గరికి తీసుకుని ఏడ్చాడు నారాయణ. '' ఉండే ఆధారం పాయ. ఇంగ మనం ఎవల్లగ్గర్నో కూలి చేసి బతకాల, '' అంటూ బావురుమన్నాడు.

అతని భార్య అతనంత బేల కాదు.

'' ఛా, వూర్కో! పిల్లలు బెదిరి పాయి సూస్తుండారు. మిందికోరటుకు దావా తీస్కెళ్లాలని వకీలు చెప్పినాడంటివి గదా! మన భూమి యాటికీ పోదులే, '' అని ధైర్యం చెప్పింది.

ఆమె ప్రోద్బలం మీదనే ఆ మర్నాడు నారాయణ మళ్ళీ టౌనుకు వెళ్ళి కాపీ స్టాంపులు పడేయించి వచ్చాడు.

అతన్లో ఇప్పుడే మాత్రం ఉత్సాహం లేదు. అపీల్లో కూడా తను గెలుస్తాడని నమ్మకం కుదరడం లేదు. దేవుడే తనకింక రక్షించాలి.

ఇంట్లోంచి బయటికి రావడం కూడా అతను మానేశాడు.

అతని భార్య అతన్ని ఓదార్చడానికి ప్రయత్నించి ప్రయత్నించి విఫలమై ఇక తన చేత కాదని వూరుకుండిపోయింది.

ఒక వారం రోజులు గడిచాయి.

నారాయణ ఇంట్లో మంచం మీద పడుకొని పైకప్పు కేసి చూస్తూ భూమి తన చెయిదాటిపోయాక ఏం చేయాలని ఎడతెగని ఆలోచనల్లో మునిగిపోయివున్నాడు.

అదే సమయంలో బయట్నించి ఒక పిలుపు వినిపించింది -

'' నారాయణా! ''

నారాయణ లేచి కూర్చున్నాడు.

'' ఎవరు ? ''



'' నేను రామిరెడ్డిని. ''

ఆపేరు వింటూనే నారాయణలో బద్ధకం వదిలి పోయింది. గబగబా బయటికి పరిగెత్తాడు.

'' నువ్వా అన్నా! రా, లోపలికి రా, '' అన్నాడు కంగారు కంగారుగా.

'' ఏం లేదు, నీతో మాట్లాడే దుంది, '' అన్నాడు రామిరెడ్డి.

'' రాన్నా, లోపలికి రా, '' అంటూ లోపలికి దారితీశాడు నారాయణ.

చెట్టంతమనిషి రామిరెడ్డి. ఎత్తుకు తగ్గలావు. నారాయణ ఇంటి పొట్టి గుమ్మంలోంచి బాగా వంగి లోపలికొచ్చాడు.

నారాయణ నులకమంచం మీద దుప్పటి పరిచాడు.

'' కూకో న్నా. ''

రామిరెడ్డి హుందాగా కూర్చున్నాడు.

మంచం కీళ్ళు కరకరమన్నాయి.

నారాయణ అతని ఎదురుగా నేలమీద కూర్చున్నాడు.

'' మరేం లేదు నారాయణా, నీ భూమి నాకమ్ముతావేమోనని వచ్చినా, '' రామిరెడ్డి మాట్లాడు తుంటే గొంతు ఖణేల్ ఖణేల్ మంటుంది.

నారాయణ తన చెవుల్ని తానే నమ్మలేక నోరు తెరిచేశాడు. రామిరెడ్డి నుంచి ఇలాంటి ప్రస్తావన వస్తుందని అతను కల్లోకూడా అనుకోలేదు.

'' అది కాదన్నా ...., '' అంటూ ఏదో చెప్పబోయాడు.

రామిరెడ్డి అతన్ని మాట్లాడనివ్వకుండా చెయ్యి అడ్డు పెట్టాడు. '' నువ్వేసిన దావా కొట్టేసినారు నాకు తెల్సు. అందుకే నేనొచ్చినా నారాయణా! ఆ భూమి నువ్వు నిలుపుకోలేవు. నువ్విస్తానంటే ఎకరా పదివేలకు నేను రాపిచ్చుకుంటా. ఏమంటావు. ? ''

నారాయణకు వెంటనే నోటివెంట మాట వూడిపడలేదు. బుర్ర

గోక్కుంటూ వుండిపోయాడు.

''నాకు తెల్సు నారాయణా!'' మళ్లీ చెప్పనారంభించాడు రామిరెడ్డి. ''నీ భూమి ఎకరా పదైదు వేలు పలుకుతాది. పదివేలు ధర అగ్గువే. కానీ దావాలో ఇరుక్కోనిపోయిన భూమికి పదిరూపాయలు పెట్టైనా ఎవులు కొంటారు? నా మాటిని ఒప్పుకో, ఆ లెక్కతో ఇంగోచోట యాడైనా భూమి కొనుక్కో. నాకు మాత్రం ఈ నాలుగెకరాలు ఇచ్చేయి. నీ మంచికోరే చెప్తాండా.''

అది కాదన్నా ...,'' మళ్ళీ బుర్రగోక్కున్నాడు నారాయణ.

''నాకు తెల్సులే నువ్వేందనాలనుకుంటాండావో! చెప్తా, యిను. నీ భూమి పక్కనే నా భూమి వుండాది. నీ భూమి కొంటే నా భూమి ఇంగా పెరుగుతాది. అవునా? అందుకే నీ భూమి కొందామనుకుంటాండా.''

కొద్ది క్షణాలు నిశ్శబ్దం.

''అసలు కారణం ఇంగోటుండాదిలే నారాయణా! సరే, అది గుడ్కా చెప్తా, యిను. నీ భూమి గవర్నమెంటోల్లకు బోతే ఆల్లు మాల్లోలకిస్తారు. ఇంతకాలం ఈ మాలనా కొడుకుల్ని ఊరవతల బరిస్తావస్తిమి. ఇప్పుడు నా భూమి పక్కకే వస్తానంటాండారు కొడుకులు. సూడు నారాయణా, నువ్వు గొల్లోనివి నేను రెడ్డిని. ఉంటే ఈ భూమి మనమద్దనే వుండాల. మద్దెన ఈ మాలనా కొడుకులెవరంట? ఈల్లకు మల్లా ఓట్లు! వాల్లు నాపక్కకు రానీకి లేదు. నేను రానివ్వను. ఇంక కోర్టు అంటావా? కోర్టంటే నాకేం భయంలేదు. కావాల్నంటే మండలాఫీసులో రికార్డులే తిరగరాపిస్తా. అదంతా నీకు తెల్వదులే. చెప్పుమరి, భూమి నాకమ్ముతావా? ఎప్పుడో ఎల్లువొచ్చి ఈ వూరి మిందొచ్చి పడితే ఈ మాలనా కొడుకులందర్కీ మాయబ్బ కొట్టాలే పిచ్చు ?నిచ్చినాడు. అయ్యి బట్కోని ఇప్పుడాల్లు నామింద ఎగుర్లాడతాండారు. నువ్వుగిన భూమి నాకమ్మితే యెట్లా ఎల్లువొచ్చి యాల్లంతా



పూర్వం పల్లెల్నొదిలేసి లేచినారో అట్టే మల్లా లేపిస్తా. నీ భూమి మాత్రం నాకు ఉద్దరగొద్దులే. ఎకరాకి పదివేలు ఇస్తానంటాండా. చెప్పు, న్యాయమైన మాటేనా?''

నారాయణ ఏదో అనడానికి మళ్ళీ నోరు తెరిచాడు.

అప్పటికే పెరట్లో వున్న అతని భార్య తలుపువాటుకొచ్చి ఆ సంభాషణంతా వింటోంది. మొగుడు నోరు తెరుస్తూనే ఏం అనేస్తాడోనని గబగబా ఆమె వాళ్ళ ముందుకొచ్చేసింది.

''అన్నా, రామిరెడ్డన్నా! ఆ దేముడే మిమ్మల్ని మాకాడికి పంపినాడు. నా మొగునికి ఒకటంటే ఒకటి తెల్వదు. అట్నే తీస్కోన్నా. ఎకరా పదివేలకిచ్చేస్తాం,'' అంది.

రామిరెడ్డి ఇంకేమనడానికీ నారాయణకు అవకాశం ఇవ్వలేదు.

''అదీ మాట. నీకంటే మీ ఇంటిదానికి తెలివి జాస్తిగా వుండాది. యాడున్నా బతికి పోతావుపో. ఇంకేమనాకు. ఎకరా పదివేలు. రేపే రిజష్టరు చేయించుకుంటా. అగ్రిమెంటూ గిగ్రిమెంటూ యేమొద్దు. ఈ అడ్వాన్సు నీకాడుంచు,'' అంటూ జేబులోంచి పదివేలరూపాయల కట్టలు రెండు తీసి నారాయణ చేతిలో వుంచేశాడు.

నారాయణ వెర్రివాడిలా ఆ కట్టల వంక చూస్తుండగా ఎలా వంగి లోపలికొచ్చాడో అలాగే వంగి గుమ్మం లోంచి బయటికి వెళ్ళిపోయాడు రామిరెడ్డి.

ఆ రాత్రి నారాయణకు కలొచ్చింది.

కల్లో పెన్నానది పొంగింది. తమ ఊళ్ళోకి ఎల్లువొచ్చింది. ఆ ముంపులో తనూ హరిజనులూ కొట్టుకుపోతున్నారు.

ఊరిగాడు గూడ తన పక్కనే కొట్టుకుపోతుండడం నారాయణకు స్పష్టంగా గుర్తు ●



# నోట్స్ ఫర్ సమ్థింగ్

— మో




(నల్లకళ్ళద్దాలు - నువ్వులగానుగ - నిద్రలో నడుస్తున్న ఎద్దు - నువ్వుల
నూనె మీద జారిన నవ్వు - పగిలిన నల్లకళ్ళద్దాలు - తిలాతైలం - తలాకాస్తా-)

(సిటీ బస్సు) - చించు టిక్కెట్లు - కోయ్ కోత - దార్లు బ్రిడ్జీ మీంచి
- సమాగమాలు లేవు - లేవు స్థిరత్వ సహవాసాలు - సంయోగాలు లేవు -)

(కారులో సీసాలు - కైజారులు - కొట్టు కిసుకున్నగోలీ సోడాలు - మూడు
నిద్రలు ఒకే రాత్రిలో - కారులో షికారుకెళ్లే సారాబుగ్గలు)

(వేలాడుతూన్న అంచుల లోయలు - గబ్బిలాలు పడీపడకండా - ముగ్గురు
తానటాస్, యమధర్మరాజా, హెర్మిస్ -)

(రుధిర జలధార - మొలకెత్తే కలువ పువ్వు - నార్సిసస్ నవ్వు - కలక
కదలిక - కొబ్బరి బోండాంలోకి దూరిన సూర్యకిరణం - ఆకు ఆక్మగలగల)

(గాయమైన మందారం - సోల్జర్ పేట - ఫాక్స్ట్రాట్ - హెల్లీనకం -
వార్నిష్ రాసిన కపోలాలు - రెడ్ కార్పెట్ మీద గన్నేరు పప్పులు)

(స్పానిష్ షిప్ - మెక్సికన్ మీసాలు - నల్లఖండపుఛాతీ - భాంజోడ్రమ్ములు
- పెట్రోల్ వాసన - నీగ్రో ఎదురొమ్ముల చీకటి కొండలు)

(వృత్తాలు పునరావృతాలు - సిన్నూ జిన్నూ జన్నయి - ఓ ఉగ్గిన్నెడు
రక్తసారం - ముదుచుకున్న విమాన చక్రాలు - మూగ నిద్ర)

(నూనె మరలో నల్లకళ్ళజోడు వృషభం - గుండ్రంగా ఒంటేలు - మద
మసాల్ కోసం - సిటీబస్సు, టాక్సీ, సిసిఫస్ బండ, కొలనూ, కాబర్,
హార్బర్, గగనం - పొరలన్నీ వొల్చేయాలి లాగిలాగిలాగేల్లా!)

●



# నగ్నవర్షం

— ఎన్నెస్. ఖలందర్

కాలమెప్పుడూ తన నడక మార్చుకోదు
దశాబ్దాలు నడిచినా శతాబ్దాలు గడిచినా
కాలంగిట్టల క్రింద నలుగుతున్న చీకటి నీడల బతుకుప్రవాహం ముందుకు సాగదు
జీవితం కరెన్సీ కొలమానమై జారుతోంది
రంగటద్దాల్లో వూపిర్లు పోసుకున్న భావాలకు వాస్తవం కరగదు
ముక్కలు ముక్కలుగా తెంచేసుకున్న ఆలోచన్లు
గాలక్సీ రూపంలో కొచ్చిగానీ ఆగవు
ఇప్పుడు మనదంతా యాంటెన్నాల సంస్కృతి
బలహీనతలే ట్రెండ్ సెట్టర్లు
చీరజారిన అందాలు క్షణాల మీద రెక్కలు మొలిచి
ఆకాశం ఎత్తుల్లో వరుచుకుంటున్నాయి
రూపాయి చూపులన్నీ డాలర్ల నక్షత్రాలకై నోళ్లు చాస్తుంటే
నక్షత్రాల కళ్లన్నీ రూపాయలకేసి పొడుచుకుంటున్నాయి
నగ్నత్వమే అంతర్జాతీయ మారకద్రవ్యమై ప్రవహిస్తోంది
మిస్ యూనివర్స్‌లు మిస్ ఏసియాలు ప్రవాహంలో కొట్టుకొస్తున్నాయి
కర్మ సిద్ధాంతాల్ని తలకెక్కించుకునీ ఎప్పట్లాగే సింహాసనం నిద్దర్లోకి జారిపోయివుంది
పెట్టుబడుల హక్కుదార్లు పెత్తందార్లు
సామ్రాజ్యవాదం కుళ్లిన విస్తర్లోకి అన్నం మెతుకులు విసిరేస్తుంటే
గద్దల్లాంటి రాజకీయ నాయకులు గాల్లోనే తన్నుకు ఛస్తున్నారు
ఎవరు ఏమనుకున్నదాల్లో వాళ్ల నడకసాగుతోంది
కాలం మాత్రం రెక్కలు తెగ్గోసుకున్న పక్షిలా విలపిస్తూ ముందుకు సాగుతోంది ●

# చంద్రుడు చెదిరిన రాత్రిలో..

– జయప్రభ

ఆకాశపు నలుపు మీద
కనకాంబరపు పువ్వులా విప్పారిన చంద్రుడు
మాతో కలిసి
తాటి కొమ్మల్లో తారాడతాడు
తగలబడిపోతున్న చెరుకుపొలాల్లోకి మాయమౌతాడు
అలల వక్రరేఖలలో చిక్కుకుంటాడు

పరిగెడుతున్న రైల్లోంచి పూర్ణచంద్రుడిని చూడటం
ఒక పురాతన పరిచయం లాంటిది
పూచిన చిగురాకు కొమ్మలాంటిది
వాన వాసన భూమి లాంటిది
వియోగ భారం లాంటిది
మా కల్లోల మానసాలతో
చంద్రుడితో కలిసిన ప్రయాణం
సుడిగుండాల లోతుల్లోని పూల పడవలాంటిది
పన్నీటి చిలకరింపు మాటున పగ రగిలిన రాత్రిలాంటిది

పొరలన్నీ వదిలించుకుని
మా అంతరంగాలని తెరిచినప్పుడు
ఇనపముద్దలా దుఃఖాలతో
ఇరుల దృశ్యాలతో మేం మిగిలినప్పుడు
రైలు రైలంతా
వెలుగునీడల వ్యధాచిత్రం విస్తరించింది
కరుణమై ఉద్రేకమై కలగలిసి
గాలి .. కొత్త భాషలతో వీచింది

ఆ చల్లటి రాత్రి
మేం నలుగురం ఆడవాళ్ళం
బతుకులో బాధలతో నలిగిపోయిన వాళ్ళం
బంధించిన మంటల్లాంటి వాళ్ళం
కపోలాల మీద కన్నీటి ముద్రలు చెరగని వాళ్ళం
సౌఖ్యోపశమనాల సరిహద్దులు తెలియని వాళ్ళం
మాదైన మాటలతో లోకాన్ని చూశాం
ప్రయాణం గంగా ప్రవాహంలా చేశాం

మాతో కలిసి ప్రయాణించి
చంద్రుడూ ...
అన్ని దుఃఖాలూ అన్ని దారుణాలూ చూశాడు
ఎర్రకలువ లాంటి అత్తయ్య గారాల కూతుర్ని
కట్నంకోసం హింసపెట్టి చంపినప్పటి
పోస్ట్‌మార్టమ్ ఫొటోలు చూశాడు
బాణాల గుర్తులతో చూపించిన
చీరుకుపోయిన గాయాల చిత్రహింసని చూశాడు
ఉరి వేసిన కంఠం చుట్టూ
ఉబ్బిపోయిన నీలపు రక్తనాళాలని చూశాడు
మరిది.... మామ.... మొగుడూ చేరి
శరీరాన్ని చీల్చి... ప్రాణాన్ని పెకిలించిన
ఘోర పాతకాన్ని చూశాడు
నిర్వచించలేని మనిషి హీనతని చూశాడు
ఈ దేశపు హత్యా సంస్కృతిని చూసి
పాలిపోయిన ఫాల్గుణ పౌర్ణమి చంద్రుడు
కొండల్లోకి రాలిపోయాడు
గౌతమీ కెరటాల జారిపోయాడు

నల్లకోర్టు తీర్పు
అసలు హంతకుడిని నిర్లజ్జగా వదిలేస్తుందని
అత్తయ్య విలవిల్లాడి నప్పుడు
గుండెలవిసి గొల్లు మన్నప్పుడు
చూడలేక
మా పెగలని దుఃఖం చిట్లి
మా గొంతులోనే తొణికింది—
మరణబాధకి
మా నిట్టూర్పులలో చితిరగిలింది

ఆ రాత్రి
ఆ రైలు పెట్టెలో ...
మేం నలుగురం ఆడవాళ్ళం
నిప్పుకణికల్లాంటి వాళ్ళం
ఎక్కుపెట్టిన బాణాల్లాంటి వాళ్ళం
పదునెక్కిన మనసుమీద మానం పూస్తున్న వాళ్ళం
మానవ బీజాన్ని మోస్తున్న వాళ్ళం
తీవ్రంగా మిగిలాం!
చంద్రుడు చెదిరిన రాత్రిలో...
కలిసి కనకాంబరపు కోపంతో వెలిగాం!!

# కరువొచ్చె.... కచ్ఛులూ వచ్చె

—పాలగిరి విశ్వప్రసాద్

నేల కెట్టలంబడి గడ్డంతా పైపై సుంగులన్నీ ఎర్రం గెండి పోయి ఎరమన్ను పూత బూసినట్లుంది. అట్లాటి గడ్డినే ఆపోతా పెరుక్కొన్తిండయ్ యెద్దులు. ఆకలయ్యోని కడుపుకు అటుకుల్ గూడా ఆబువ్వే గద మళ్ళ. మళ్ళా యీ మాత్తరం గడ్డైనా దొరుక్తాదో లేదోనని దీచ్చగా తింటాండే యెద్దల్ను సూస్తాంటే కడుపు కోసక పోతాన్నెట్టుంది, రామాడ్డికి.

"బట్ట కోడె ఒక్కటే జొళ్ళున్నర పొట్టు తింటాండె. అట్లాడ్డి రొంటె గ్గల్ని జొళ్ళ పొట్టనా పెట్టల్యాకుండ. ఏం కర్‌వో! ఏం కాలమో! తీ!" బాధ పడ్తా నిట్టూర్చి నాడు.

సెట్టు కింద కూకోండే తావు నుంచే మోర పైకెత్తి మోడం దిక్కు జూసినాడు. తాప్పం పట్ట్యాక గడియ్ కోసారి అయప్ప సూడ్డమే గాసీ, ఆడేమన్నా ఒక్కరొవ్వ గుడ్డిమోడ మన్నా వుంటే గదా! ఏకిన





దూదిసిరేసినట్లు పొగమాదిరుండే మోడాలు యాడికో పరిగెత్తండయ్. అయి తప్పనివ్వి, వానొచ్చే సూపేం కాన్రాలె. ఉబ్బరపెండేమో మాడు పగల్ గొడ్తాంది. '' రేపో, మాపో ఈ గొల్ల కార్తి గూడా పోతాంది. ఈ వానింగే మొస్తాదబ్బా! '' రామాడ్డికి ఉసూర్మన్పిచ్చింది. పయిమింది తుండు గుడ్డతో మొకం తుడ్సుకుని, '' పొద్దు తిరిగినట్లుంద ''ను కుంటా లేసినాడు.

సెనక్కాయ్ సేన్లిక్కు సూడను గూడా బుద్దిపుట్లే. ఆవల్ల మూల్న యెవర్వో రెండు ఎనుములు, అబ్బని సొత్తంతా గుట్టబోసినట్లు సేలోబడి మేసొండయ్. దాంట్లెన్ జూస్తానే, అప్పడ్దాంకా నీర్సచ్చుగా వుండిన ఆతనిపయి కోపంతో జల్దరిచ్చింది. పండ్లు పటాపటా కొరుకుతా, వొంగి సేతిపిండా రాయిదిస్కొని ఆ వళ్లకు

బిళ్ళల్ బిళ్ళల్‌గా యెండిపోతాండే ఉర్కుతా ... థయ్... నీయమ్మ...

పొలం పైరు మిందుంటే ఎవర్తే మిమ్మల్నిడిస్పెంది. లంజా కొడ్ కులు రయితులైతే ఈ కాలం పసల్ను పొలం మింది కిడుస్పారా?'' అని అర్ నుకుంటా, రొప్పుతా ఎనమల్నెంట పన్నాడు.

మనిసి ఉరుకుతా రాడం పసిగట్ని ఎనుములు మోరపైకెత్తి రామాడ్డి దిక్కు ఒక్‌పారి జూసి, వాతేసిన దాంట్ల మాదిరి సెంగిరి బింగిరని యెగిరి, ఆమెయిన ఒకటే పరుగు దీస్కున్నెయ్. రామాడ్డి దాంట్లెంబడే రొంతదూరం పర్ గెత్తి.... ఇంగ పర్ గెత్తల్యాక రాళ్ళిసుర్తా నిలబ న్నాడు. ఎనుములు కంటిసూపు దాటెల్దాంకా దాంట్లెనూ, దాంట్టి రైతల్ను, వాళ్ళ వంశాల్ని షాడు తిట్లు తిడ్తానే ఉన్నాడు.

ఒక దిక్కు వాన్రాక పైరెండి పోతాంటే, ఉండే రొంతపైర్నూ ఊలోల్ల పశులు మేసిబోతే ఎవరికైనా కడుపు కాల్తాది మళ్ళ.

ఆ ఎనుములు కనబడకుండా పోతానే తిరిగి యెద్దుల కాడికొచ్చి పగ్గాలు సేతికి దీస్కొని, యెద్దల్ను యింటి మొగానికి మళ్ళిచ్చినాడు. వచ్చే దావలో - వాడ్డోని వొంకలో నీళ్ళేమన్నా వుండాయేమోనని పార జూచ్చే, యాడా నీళ్ళ సుక్కలేదు. యెద్దులు ఎండతాకిడికి బుస పోస్కుం టాంటే, ఉసూరంటా యింటి మొగం పట్నాడు.

ఎద్దుల్ని గాటిగట్టేసి, సెంబెడు నీళ్ళు తాగి - '' బువ్వ తినకుండా మళ్ళీ యాడికిప్పుడు? '' అని పెండ్లాం పిలుస్తున్నా యినిపిచ్చుకో కుండా, బయటపడి నేర్ గా రంగాడ్డి కాడికి బోయ్‌నాడు.

రంగాడ్డి అప్పుడే బువ్వదిని యింటి ముందర యాపసెట్టు కింద అరుగుమింద కూచ్చొని, పక్కనుండే కిస్టాడ్డితో '' బ్బ! ఏం యెండ కాస్తాందెన్నా! వానయితే వచ్చేట్టు లేదు '' అంటాండగనే

ఆదల బాదల ఆడికొచ్చిన రామాడ్డి '' అబ్బీ! రంగా! పొలంలో ఎనమల్ను సూడుపో! కాయిలి కాండ్లు ల్యాక పొలమంతా నాశనముయి పోతాంది. ఇట్నే ఇడ్సిబెట్తే యెట్లబ్బీ! యెట్నో కట్ట వూర్లో అందర్తో మాట్లాడి ఆ కాయిల కాళ్ళను బెట్టు. అరొంత మేపన్నా దక్కిచ్చుకోకుంటే పసల్ను మైద్ కూర్ సంతకు దోలాల్సిందే'' అంటూ యేడుపు గొంతుతో సెప్తాంటే, రంగాడ్డిలోమటుకు ఉలుకులేదు - పలుకులేదు.

ఉలకడానికీ - పలకడానికీ కాయిలి కాళ్ళకు బెట్టేది మాటల్తో అయ్యే పనైతే గదా! యాలంటే? - రాయల్సీమలోని అన్ని వూర్ల మాద్రె ఆవూర్లో పార్టీ వుంది మరి. ల్యాకుండా ఉండను - ఆడేమన్నా గాందీ తాత బుండారా, యేమన్నానా? ఆవూర్లో వుండేదీ మామూలు రాయల్సీమ జనమే. కరువుల్తో కటకటలాడ్తా, నదువు సందెల్యాక, రాజకీయ నాయకులు సెప్పినట్టల్లా ఆడే మట్టి బుర్ర మడుసులే ఆడా వుండారు. అందుకే ఆ వూర్లో గూడా పార్టీ వుంది. పార్టీ వుండాది కాబట్టి కూటికీ, కూరాక్కూ రాకపోయినా అప్పుడప్పుడూ కూనీలు గూడా సేసుకున్నార్రు. ఈ మద్దెనే రామలింగాడ్డి కూనీ అయినాడు. కూనీ కన్నా రొన్నెళ్ళు ముందుర పంచాయ్తి ఎలచన్లు జరిగినయ్.

'' ఎలచన్లలో ఈ సారైన్నా ఆ ముసిలి పెసిడెంట్ను పడగొట్టాల. మీ వూరి పంచాయ్తి మన సేతల్లోకి రావాల'' అని ఎమ్మెల్లే రోసం బోసి కైపెక్కిచ్చినాడు.

ఆ కైప్మిందనే రామలింగాడ్డి తమ గుంపులో అందర్తో మాట్లాడి, నదువ్కున్నోడని తన మేనల్లుడు శ్రీరాం రెడ్డిన్నిలబెట్టి గట్టి తగులే తగిలి రొంతలో ఓడిపోయ్నారు.

అయితే, సావుదప్పి కన్నులొట్టబోయ్నట్లు ఆడికాడికి గెల్చాల్కా, పెసిలెంటు ముసిలోనికి మన్సులో యామూల్నో రామలింగాడ్డి మీద అగ్గెంటుకున్నాదేది. దానికి తోడు ఎమ్మెల్లే కాపోజిట్లుండే నాయుడొచ్చి '' ఏంది సుబ్రెడ్డీ! ఇట్లయింది. నువ్వూ, నేనూ ఎన్ని దొంగ తిరగల్లో పడ్తే నాలుగోట్లు మెజార్టెచ్చినే. ఇంగ ఈ రామలింగాడ్డి గాడ్ని బతకనిస్తే నీకూ, పక్కూర్లోనే ఉన్నెందుకు నాగ్గూడా బరువే. సూడుమళ్ళ'' అంటా ఆయగ్గిమీద యింత గబ్బు



నూనె గుమ్మరిచ్చినాడు. అంతే. ఊర్లో నుంచి ప్యాటకు బోయే దావలో రాంలింగాడ్డి కూనీ అయినాడు. రాంలింగాడ్డి గుంపుకు రంగాడ్డి లీడరైనాడు. యింత జరిగినాంక పెసిలెంటు పెత్తనం సాగనియ్యగుడ్డని రంగాడ్డి గుంపోళ్ళు అనుకున్నాద్దరంటే, అనుకోరా మరి.

అనుకుండేదే ఆల్చెం - '' ఇప్పట్నుంచీ బందెలెక్కా, పుల్లరి లెక్కా పెసిలెంటు కాడ గాకుండా, వూర్లో నలుగురు పెద్ద మన్సుల్ని బెట్టి, వాళ్ళ సేతికియ్యాల. అట్లయితే కాయిలి కాండ్లను బెట్టి బందె నడుపుదాం. ల్యాకుంటే వొద్ద'' న్నార్రు.

మరి పెసిలెంటు గుంపోళ్ళు తక్కువా? - '' ఇన్నేండ్లా లేని పద్దతి ఇప్పుడేంది? ఎప్పటి మాదిరిగానే పుల్లరి, బందె పెత్తనమంతా నాదే. అట్లగాకఉంటే కాయిలే వొద్ద'' న్నార్రు. ఇద్దరూ శానా రోసంగా అట్లను కున్నానారు. అందుకే ఈ యాడాది కట్టుబాట్లుల్యాక, వూర్లో, కాయిలికాళ్ళుల్యాక, పొలంలో పసలకు తిన్నాలయింది.

ఇదంతా రామాడ్డికి తెలక గాదు - తెల్సు. అయినా కడుపులో భగ్గుమంటాంటే, ఉండబట్ల్యాక వొచ్చి రంగాడ్డికి సెప్పినాడు. అందుకే రంగాడ్డి ఉలక లేదు - పలక లేదు.

'' ఏం బీ! పలకవ్?'' రామాడ్డి గొంతులో యెవరి మిందనో కోపం, ద్యానికోన్మో దిగులు, ఏమీ సేయ ల్యాక పోతండామనే బాధ - అన్నీ ఉండయ్.

'' ఏం బలకాలన్నా! నీకు తెలందేదుంది? నిన్నగాక మొన్న మన అన్నన్ సంపుతే, అదెంతా మర్సిపోయి వాళ్ళకే పెత్తనమిచ్చి బందె నడిపి కాయిలి కాండ్లను బెట్టమని సెప్పమంటావ్?'' రంగాడ్డి గూడా రొంత కోపంగానే అన్నాడు.

రంగాడ్డి కోపం జాసేమో రామాడ్డి ఆపైనేం మాట్లాడ్లేక పాయె. పక్కనుండే కిస్నాడ్డి కలగ జేస్కొని '' మనమే మన దిక్కుండోళ్ళనే, ధైర్యంగా వుంటామనే వాళ్ళను యిద్దర్ని కాయిలికి బెడ్తే ఏమయ్తాది?'' అన్నాడు.

'' ఏమయ్తాది! అవతలోళ్ళు అతానికైనా వాళ్ళ పసల్నిడ్సి పొలం మీద తోల్తారు. దొంగ్లెను బందెకు తోల్కొచ్చెప్పుడల్లా సిల్లర కొట్లాటలయ్ తంటయ్''

రంగాడ్డి తుందుగుద్ద యిసురుకుంటూ నిబ్బరంగా ఆ మాటనేసరికి కిస్నాడ్డికి మంట పుట్టింది. '' అని నువ్వన్కుంటే యెట్లా? యెనమ

ల్నిడిస్ర తోల్దానికి వాళ్ళు దినేది బువ్వా?, దొంకల్లోదేమన్నానా? ఏం వాళ్ళు రైతల్‌కు బుట్నోళ్ళు గాదూ?''

గుర్విందగింజ తన కిందుండే నలుపు తనెరక్క, నేనె(రదాన్నని ఎగిరినెట్టు, రోసంతో యెదుటోళ్ళను తప్పల్ బట్టా కూచ్చోడంతోనే తెల్లార్తాంది గానీ, సరిగ్గా ఆలోసించి బాగుపడ్దామని ఎవర్‌కీ తోసదు. ఒకరని గాదులే! రొండు గుంపుల్లో ఇదే సంతే.

ఆడికి, ఆ బందె సుద్ది సాలిస్తామనుకున్నాడేమో రంగాడ్డి గూడా ''సర్లెయితే, మన గుంపులో అందర్తో మాట్లాడి దండవారేయ్‌చ్చి రేత్తిరికి సావిట్లో కూచ్చుందాంలే!'' అన్నాడు.

ఆయప్ప ఆ మాటలాడికి తుంచుతండగనే (శ్రీ)రాంరెడ్డి అటుగా వొచ్చినాడు.

''ఏంవోయ్! ఎమ్మెల్లే కాడికేమన్నా పోయ్‌న్నావ్వా? గవుర్మెంటు కరువ్ బత్తెమేందెన్న యిస్తాదేమో ఎమ్మెల్లే నడగ్గూడ్దా? మీ మామ్ గారు శానా యిబ్బంది పడ్తాన్నెట్టుంది'' అంటా అడిగినాడు. అప్పటికి కిస్నాడ్డికి యా యిబ్బందీ లేనట్టూ, ఆయప్పకు కరువ్ రానెట్టూ!

(శ్రీ)రాంరెడ్డి అరుగుమీద కూచ్చుంటా అన్నాడు ''మావ గారొక్కరేనేం? రాయల్సీమంతా యిబ్బంది బడ్తాంది. అయ్‌నా మనక్కరువులొచ్చినా బత్తే(లావు... బొగ్గు(లావు. సస్తే పాడెగట్టుగోను గూడా లెక్కెయ్యరు. మన్‌సావు మనం జావాల్సిందే''

ఉత్తరాదిన తుపాన్లొస్తే గవుర్మెంటోళ్ళే రాష్టమంతా సెందాలడిగి వాళ్ళనాదుకుంటారు. మరి ఈడ కరువొస్తే ఏ గవుర్మెంటూ పూన్‌కొని సెందాలడగదు, ఈళ్ళ నాదుకొదు. అట్లెందుకో ఈళ్ళకు అంతుబట్టదు. (శ్రీ)రాంరెడ్డిని ఆమాటే అడిగితే, అతనంటాడూ - ''మనం యెనక బన్నోళ్ళం. ఓట్లేయ్‌డానికి తప్పనిచ్చి ద్యానికీ పనికి రానోళ్ళం. మన్లోమనం కొట్టుకుంటా ఎట్లైనా రొండు పార్టీల్‌కు సెరిసగం ఓడ్లేస్తాం. అంద్‌కే మనకు సాయం జేయక పోయ్‌నా ఈ గవుర్మెంటు కొచ్చే నట్టమేం వుండదు. నట్టముండదు గాబట్టే సాయం జెయ్యరు. అయ్‌నా, ఎవడైనా ఉండేవానికే సాయం జేస్తాడు గానీ, లేనోనికీ - యెనకబన్నోనికీ ఎపుడూ సేయడు. అది లోకం రీతి. అంతెందుకు మనూర్లో మాలా మాదిగోళ్ళు యిబ్బంది పడ్తాంటే మనమే మా(త్రం ఆదుకుంటండం? ఈడ లేనోళ్ళనూ, మాలా మాదిగోళ్ళను మనమెట్ల జూస్తండమో, అట్లనే రాష్టంలో రాయల్సీమ బతుకులంటే మాలా మాదిగోళ్ళకన్నా కనాకట్టంగా ఉండయ్, ఈ గవుర్మెంటుకు - ఈ నాయ్‌కులకు.''

''ఈ రాజ్కీయాల్లో బడ్తే తెగేది గాదు గానీ'' అంటా రామాడ్డి, కిస్నాడ్డి దిక్కుజూసి ''ఏం బ్బీ! జొన్నల్ రేటెట్టుండాయంట?'' అంటా అడిగితే, కిస్నాడ్డి మొకమూ పక్కకు దిప్పుకుంటా-

''ఏం రేటోలే! రైతుకు అమ్మబోతే అడివి, కొనబోతే కొరివయ్‌తాంది. జొన్నల్ మార్కెట్టు మంద మొచ్చిందంట. ఆసెట్టే, నూట నలబై రూపాయ్‌ల్కన్నా జాచ్చి పెట్టనంటండాడు.'' అంటా నిట్టూర్చినాడు.

''ఏం మందమంట? ఈ పెద్ద నాకొడుకులందరూ యాన్నో బొంబాయ్‌లోనో, ఢిల్లీలోనో కూసుండేదీ - ఆడ రేటుబెట్టి దేశమంతా పోన్లుజేసి జెప్పేదీ - ఆ రేటమ్మడి ఈడ ఈళ్ళు కొంటాండేదీ. అయ్‌నా, దేశంలో అన్ని వస్తువల్‌కు తయార్ జేసినోడూ, అమ్మేవాడూ రేటు బెడ్తాడే! అదేం కర్మరా- రైతు బండిచ్చిన తిండి గింజల్కు మటుకు రైతు రేటు బెట్టకుండా, కొనే నాకొడుకులే రేట్లుబెట్తారు?'' అంటా ఆయప్ప ఎవ్‌ర్మిందనో వుండే మంటను కిస్నాడ్డి మింద నూపిచ్చినాడు.

కిస్నాడ్డి నగుతా ''ఇదేందిది? నామందెగుర్తాడు. నేనేమన్నా పి.వి. నర్సిమ్మారావ్‌నా? ల్యాక మన్మోకన్సింగునా? యేందో కమీసన్ దీస్కోని తూకలేసే వాన్ని, నన్నడుగుతే ఏం లాబం. రేపు మనెమ్మెల్లే ఐ(దాబాద్ నుంచొచ్చి నాంక అడుగు'' అన్నాడు.?

''ఎవన్నడిగినా-మన బత్కులింతే గానీ, ఉప్పూ మిరప్కాయగ్గూడా లెక్కలేదు. జొన్నలన్నా అమ్మదామంటే, నువ్వా మాటంటండవ్ అంత అర్ధమానంగా రేటు కాలబడింటే యాడమ్ముతవ్ తీ! సంగటో, కారెమో దిని కండ్లు మూస్కుంటే, రేటున్నెప్పుడే అమ్మచ్చు'' అని రామాడ్డి దిగులుగా యింటి మొగం పట్నాడు.

రంగాడ్డి ''ఏంన్నా! పోతండవ్!

కూకుందురా'' అంటే, ''ఇంగా బువ్వగూడా తిన్లేల్చే. ఆ పొలం కాయిలి మాటే మాట్లాడ్దామని సేని కాన్నించి ఇట్నే వొచ్చినా. ఆ యినయం మనాళ్ళందర్తో మాట్లాడిందు మరి'' అంటా రామాడ్డి దాటి పోయినాడు.

★ ★ ★

రేత్తిరి తొమ్మిది గంట్లప్పుడు ఒక్కొక్కరే వూరి సావిట్లోకి జేరుకున్నారు. రంగాడ్డి గుంపోళ్ళే గాకుండా వూళ్ళోని రైతులంతా వొచ్చినారు. అవతల పెసిలెంటు గుంపోళ్ళు ఇంగా రాలె. కిస్నాడ్డి పక్కనే రంగాడ్డితో ''అవ్‌తలోళ్ళు ఇంగా రాలేదే! మనమే సెర్చుమొదుల్ బెడ్దామా?'' అంటే ''ఇంగ రోంచేపు సూస్తాంలే'' అన్నారెవరో. వాళ్ళకోసం జూస్తా అందరూ లోకాబి రామాన్నెంలో పన్నారు.

ఆడ పెసిలెంటింటి కాన్నేమో సావిట్లోకి పోదామా! వొద్దా!' అని రోంచేపు ఊగిస్లాడి ''మనం ల్యాకుండా వూళ్లో పంచాయ్‌తీలు జరగబట్టే, మన పెత్తనమేం గావాల''న్కొని, సావిటి కాడికి పోదామనే తీరుమానం జేసినారు. ముందు - ఉత్త సేతల్తోనే పోదామనుకున్నారు. అయ్‌తే ఎవ్‌డో వొకడు గిలిగాడుండనే వుంటాడు గదా! ఉడత పెత్తనం బూస్కొని ''ఏం దిన్నా! మీకేం లోకం తెలుస్తాందా, లేదా? నిన్నగాక మొన్న రాంలింగాడ్డి కూనీ పన్నాది. అవతలోళ్ళింకా ఉడుకు మిందుంటారు. ఇట్టాటప్పుడు వాళ్ళదరకు ఉత్తసేతల్తో బోతామంటారే! ఒకటే సారి గుంకునంతా గుండం జేస్తామనుకుంటండారా? యెట్లా? అని గిరె.

''ఔన్నిజవే...ఔన్నిజవే'' అన్రి తందానాగాళ్ళు. ఆకరుకేమో ''పెద్ద దల్చి మళ్ళా మంచి జూడమన్నారు పెద్దోళ్లన్జెప్పి, కొందరి సేతల్లోనన్నా యారముల్లుండాలన్‌కొని కట్టెలు, ఈటెలు, యాటకొడువండ్లు సేతబట్టి కదిల్రి. ఇంగేందుంది, అగ్గిపుల్ల గీకినట్లయింది.

సేతల్లో యారముల్లతో సావిట్లో కొచ్చిన వాళ్ళ అంగామా జూసి కిస్నాడ్డి, రామాడ్డితో ''అన్నా! ఈ నాకొడుకులంతా పంచాయ్తి కొచ్చినట్లు కాన్రాలె. ఆ సేతల్లో ఈటెలూ, కత్తులేంటికి? నాకేందో అన్మానంగా వుంది. నేను కూడా మన యారముల్లన్నీ తీస్కొస్తా!'' అంటా, రామాడ్డి వారిస్తన్నాయినకుండా, ఆవల్ల కూస్కొండే బాల్రెడ్డినీ, జయరాం రెడ్డినీ, సెంచి రెడ్డిని ల్యావ దీస్కపోయినాడు.

సావిట్లో ఒకరిద్దరు ముసిలోళ్ళు మటుకు ''ఈ వూరేం బత్కి బట్టగట్టే రకం గాదులే'' అనుకుంటా న్యాలకేసి జూస్తా కూచ్చుండ్రి.

''అందరూ వూరెక్కూచ్చుంటే యెట్ల? యెవురోకరు సెప్పండి'' అని యెవరో ఎత్తిడ్సాల్క, రంగాడ్డి లేసి నిలబడ్తా ''ఊళ్లో మీ యందర్‌కీ తెలందేం లేదు. సెనక్కాయ్ రొన్నెళ్ళ పైరయింది. వాన్రాక ఆ సెల్లకు యిప్పుడ్దాంకా వూడల్ గూడా దిగలే. సెల్లన్నీ యెండిపోతండయ్. ఇట్టాటి కర్‌వులో వూళ్లోని పన్కిమాలోన్నెళ్ళు కొందరు పసల్ను పైరు మిందికిడ్సి పెడ్తండారు. ఉండే రొంత పైరా వూలోళ్ళ పశులు మేసిపోతే, మల్లపసల్‌కు మేపు గూడా ఉండదు. అందుకే యాటా మాదిరే కాయిలికాండ్లను పెడ్దాం'' అన్నాడు.

ఎవరూ ఏమీ మాట్లాల్లె. ఇట్టాటి సాట రొండు గుంపుల్లోని పెద్దోళ్ళు మాట్లాడాల్సిందే తప్ప, వూర్లో జనం కలగజేస్కోరు. యాలంటే, గామ పార్టీలో యేదొక గుంపుకు తమను గూడా జమకడ్తారేమోనని బయం. అందకయే ''యాలొచ్చిన పీడ తీ!'' అని ఎవరూ మాట్లాల్లె.

రొంచేపుండి, ముసిలి పెసిలెంటెత్తున్నాడు ''కాయిలి కాండ్లను బెట్టొద్దని ఎవడన్నాడు? నేను కాయిలి కాండ్లను బెట్టింటే, మీ గుంపోళ్ళే వొద్దన్నారని వాళ్ళు మాన్‌కున్నారు.

ఎనకంబడే రంగాడ్డందుకున్నాడు ''మేం కాయిలి కాండ్లను వొద్దన్నామని ఎవడనింది? అపడ్దాలాడి వూర్లో మమ్మల్ని సెడ్డ సెయ్యొద్దు. బందె లెక్క నీసేతి కియ్యకుండా, వూర్లో పెద్ద మన్సుల్ను బెట్టి వాళ్ళ సేతికియ్యమని జెప్పినం. అట్లయితే కాయిలే మానుకోండెని కాయిలి కాండ్లను నువ్వే మాన్పిచ్చినవ్.''

ఒకచెణం ఎవ్వరేం మాట్లాల్లె. కొందరేమో యేందొ గొణుక్కుంటాండ్రి ''ఆకులో బెట్టమని ఒకడూ - బోకిలో బెట్టమని ఒకడూ - ద్యాంట్లో బెట్నాం ఎవరోకరు మీరు బొక్కలాడ్దానికే గానీ వూరు బాగయ్యేదేం లేదులే. ఈ పంచాయితేగేదంతకన్నా లేదు'' అని. అయ్‌తే పైకి ఎవ్వరేం మాట్లాల్లె.

ఒక చెణమున్నాఁ్యంక పెసిలెంటు యింత జంపున నిట్టూర్చి "అట్ల యితే మీరంతా సక్కనోళ్ళా, నీటైనోళ్ళా. మేం మట్టుకే దొంగ నాకొడుకులమంటావ్? వూర్ సొమ్ము తింటాండేది మేం మట్నేనంటవ్?" అంటా సెతురు బర్కినాడు.

ఆయప్ప సెతుర్ కు ఈళ్ళకు మండిందేమో "యేమనేదేంది! ఎవర్ దొంగనాకొడుకుల్లో వూర్లో అందర్ కీ తెల్సు" అంటా రామాడ్డి యింతెత్తున లేసినాడు.

అప్పుడ్దాంకా వూర్కె సూస్తాండే పెసిలెంటు రొండో కొడుకు మల్లాడ్డి కల్లజేస్కుంటా "ఏందిరా తెల్సేది? ఊర్లో మేం మంచోళ్ళం అన్కె బట్టే మేం గెల్సింది. అది సేతగాక మామింద బడి యేడుస్తారే? సేతగానోళ్ళు సేతగానెట్టు పడిండండి. మీరు పెసిలెంటయినా పొద్దు మాట్లాడ్డురు." అన్యాడు.

"ఎవర్రా సేతగాన్నాకొడుకులు? మీరు.. మీరే సేతగాన్నాకొడుకులు. సేతగాకనే నాయ్డుగాన్తో కల్సి కుట్ర బన్ని మాయన్నను దొంగ దెబ్బ తీస్సంపినారు". అంటా రంగాడ్డి, రామాడ్డి ముందుకు తీస్కొచ్చినారు.

అప్పుడ్కే రొండు గుంపులోళ్ళ మన్సుల్లో సెగ రాజుకున్నాది.

"ఏం గోరం సూడాల్సొస్తాదో! యెందుకు తీ పాడు పీడ!" అనుకుంటాండే ముసిలోళ్ళు మటుకు లేసి పోను మొదులు బెట్రి.

అసల్ ముందు, వాళ్ళకు మేత గురించి, కాయిలి గురించి కాబట్టింటే గదా! ఆ కాయిలి మింద, బండె మింద తమ పెత్తనమే ఉండాలని యిద్దర్ కీ వుండాది. అది కుదిరేది గాదు. "మనుసులకు తిండెట్లా లేదు - వుండే పసల మేతనన్నా కాపాడుకుందాం" అని మాట్లాడుకోడాని కొచ్చి, అసల్దిడ్సి పెట్టి ఆవేశాల్లో పన్యారు. పాతయన్నీ తోక్కోని మాటామాటా పెంచుకున్యారు.

ఇంతలోకే యారముల్ల కోసం బోయిన కిస్నాడ్డి, బార్రెడ్డి, జయరాం రెడ్డి, సెంచిరెడ్డొచ్చి గుంపులో కల్సినారు.

ముందు జాగర్తగానే వొచ్చిన పెసిలెంటు గుంపోళ్ళ సేతల్లోని యారముల్లు గాల్లోకి లేసినయ్... అర్పులు.. ... పరుగులు... ఉర్కులు.... తల్కాయలు బగిలెన్నె సప్పుళ్ళు.

రొంచేపట్లోనే సావిట్లో బీబత్సం! "కొబలీ....! నర్కు....! సంపు.......! సెక్కండి నాకొడకల్ను....!" అర్పులు దెబ్బల్కు తట్కోల్యాక పరుగుల్ బెట్యారు.

సీకట్లో కొట్టుకోడానికి ఎవరు యెవరో తెలక రొండు గుంపులోళ్ళ తెల్సింటాది. తెల్లార్జాము కల్లా యర్రగుంట్ల నుంచి జీపునిండా వొచ్చి దిగినారు. రొండు గుంపోళ్ళు సీకట్లో ఎవర్కి దొరికిన దావ వాళ్ళు బట్కోని పర్గెత్తినారు.

మళ్ళా అందరూ తప్పించుకుంటే యెట్ల? కేసు రాయిచ్చే వాడెవడు? అది వాళ్ళకూ తెల్సు. అందుకయే దండిగా దెబ్బల్దగిలోన్లెళ్ళా, పాణం మిందికొచ్చినోళ్ళు మట్టుకు పోలీసోళ్ళకు సిక్కి కేసుర్రాయిచ్చినారు.

ఊర్లో పోలీసోళ్ళు కాంపేసినారు.

★ ★ ★

ఊరు వల్ల కాదయి పోయినట్లాయ. ఊర్లో నల్గురు కల్సి కూచ్చోని మాట్లాడు కుండేదే ల్యాకపోయ. ఇవతల గుంపులో బార్రెడ్డి, అవతల మల్లాడ్డి బాంబు



పరిగెత్తి మిద్దెలెక్కినారు. పెసిలెంటు గుంపోళ్ళు పెసిలెంటు మిద్దెక్కినారు. ఆ మిద్దెకు యెదురూగ్గండే రాంలింగాడ్డి మిద్ది మిందికి యివతలి గుంపోళ్ళెక్కినారు.

ఆ సీకట్లో రొండు మిద్దెల్ మిందనుంచీ బాంబులు పుట్టసెండ్ల మాదిరి వొచ్చి పడ్తుండయ్. ఆకరుకు మబ్బున యేం కాన్రాక 'బాంబులాట' సాలిచ్చి, రొండు గుంపోళ్ళు మిద్దెల్ మిందనే కూచ్చున్యారు.

పోలీసోల్లకు తెలకుండా వుంటాదా? ఆడుండేది నాల్గుమైళ్ళు. ఈడ బాంబు లేస్కుండేప్పుడే ఆడ దెబ్బల్దగిలి పెద్దాస్పత్రి పాలైనారు. ఇవ్తలోళ్ళు, అవ్తలోళ్ళు వురిడ్సి పొయ్రి. ఊళ్లో వుంటే యాజామున పోలీసోళ్ళొచ్చి యిండ్ల మింద బడి ఈడ్సక బోతారోనని బయం. ఇంగ ఈళ్ళిద్దరి సేల దిక్కు మొకం సూపడానికి క్కాడ మొగోడే ల్యాకపాయ. ఇంగేముంది-బోగమిండ్లు కొల్లబోయింది. కాటిక్కాల్ జాంపు కొండే ముసిలోడు గూడా గోసిప్పుకుని ఉరికెత్తడవే. అనేవాడూ, అడిగేవాడూ ల్యాక వూరందరి పశులు ఈలిద్దరి సేలల్లోనే.

ఊరిడ్చిన రంగాడ్డి గుంపోళ్ళేమా,

యాన్నో గుట్టకిందుండే పల్లెలో నెలుసైనా - యప్పు ఎవరో వుంటే, వాళ్ళింట్లో తల్దాసుకున్నార్రు.

శ్రీరాం రెడ్డి మట్టుకు ఎమ్మెల్లే కాడికి, పోలీస్‌టేసన్కు, వకీల్ కాడికి తిరిగి, తిరిగి పోలీసోళ్ళ తాకిడి ల్యాకుండా తాము వూరికి బోయి వుండేట్కు - నాల్రోజులయినాంక కోర్టుకు ఆజరయ్యేట్కు మాట్లాడి నాడు. పెద్దాసుపత్రి డాక్టర్ గ్గూడా ఎమ్మెల్లేతో పోన్ జేయిచ్చి, డాక్కర్ సర్టిపికెట్ బాగొచ్చేట్కు మాట్లాడ్నాడు. కేసు 307 సెక్సు వ్రాసినట్లూ, ఆజరయితానే బెయిల్రాదు గాబట్టే కొన్నాళ్ళు జైల్లో వుండాలనీ, అందుకే ఈలోగా వూరికి బోయి ఏమన్నా పనులుంటే, ముక్కెంగా లెక్క నక్కబెట్టుకుండే పని సూస్కోమని వకీలెప్పినాడు.

ఈ యినయాలన్నీ శ్రీరాం రెడ్డి బోయి తమ వాళ్ళతో జెప్పినాడు "ముక్కెంగా యిప్పుడు లెక్కతో పని. ఎపుడు జూసిన లెక్కకు సెయ్ జాంపుతండాడు. లెక్కలేంది యా పనీ కాదంలే" అని సెప్పేసరికి,

కిష్టారెడ్డి కేకరిచ్చి మూసి "థూ.... దీనెమ్మ బత్‌కులు సెడ. యాదుండే నాకొడకల్కు మన బతుకులంటే ఎరిదాని సంద్లకన్నా లోకువయి పాయనే" అన్నాడు. అంతే మళ్ళ ఎర్రిదానికి సంద్లోచ్చినా యంటే, వూర్లో వ్వాయసి నా కొడకలందరకీ సంకల కింద నక్కిలి గిలి బెట్నట్టుంటాది. యాలంటే, తలోక సెయ్యేసి పీసుక్కుంటాండాచ్చవి.

ఇప్పుడు ఈళ్ళ బత్‌కుల్ను గూడా పోలీస్‌టేసన్ కాడా, కోర్టు కాడా, మండలాపీసు కాడా అదాటయి నోడల్లా పిసుకుతండాడు.

'ఈ కరువ్ కాలంలో ఇప్పుడే బాడ్ కోవ్ కర్సల్కు లెక్కేడ త్యావాలబ్బా' అంటా సింత జేస్తా కూచ్చున్నార్రు. ఆకరుకు యాడా తెగక,

"ఊరికి బోయి అందరం జొన్న లమ్మేదాం పాండి" అన్నాడు రామార్డి. ఇదే మనిసి మూన్నాళ్ళప్పుడు "కారెమో, నంగటో దిని కండ్లు మూస్కుంటే రేటున్నెప్పుడే అమ్మ" చెప్నాడు. ఇప్పుడీ మాటవాల్సొచ్చింది.

అంటానే, కిష్టారెడ్డందుకున్నాడు. "నేను సెట్టితో మాట్లాడినా. వాడిప్పుడు నూట ముప్పై కన్నా జాచ్చి లేదన్నాడు. మన కర్మ .... ఈ జొన్నల్ రేట్లు రోజుకు పడిపోతండయ్" అప్పుడే ఏమయింది? దయ్యం బట్టింది - ఇంగెన్ని మెట్లు దెబ్బతిన్నాల్నో!

"నూట ముప్పై గాకుంటే, నూటిరవయే గానీపో. మన అవ్‌సరమట్లుంది.... మనం కష్టం జేసి ఈ యాపారం జేసే నాకొడకల్నా, పోలీస్నాకొడకల్నా, కోర్టు నాకొడకల్నా, రాజ్కీయం నా కొడకల్నా బలికియ్యాల. మన రాత అట్లుంది."

అందరి మొగాల్లో దిగులు నల్లమోడం మాదిరి కమ్ముకున్నాది.

ఆ వాతావర్నం మార్చాలని శ్రీరాం రెడ్డి - "ఆస్పత్రి కాడికి పోయిన్నె. బాల్రెడ్డన్నకు బాగుంది. అయితే ఇప్పుడే డిచ్చార్జయితే అవ్‌తలోల్లకు బెర్న బెయిలొస్తాదని - ఎమ్మెల్లేతో పోన్జేయిచ్చి ఆస్పత్రిలోనే ఉన్నిచ్చుకోమని డాక్టర్కు సెప్పిచ్చినా. పొద్దాక ఆస్పత్రిలో వుండడానికి యాసిర్కనిపిస్తే, బయట తిర్గొచ్చు - ఇబ్బందేం ల్యా. పోలీసోళ్ళ కండ్లల్లో బడకుంటే సాలు"

శ్రీరాం రెడ్డి మాటలు ఎవర్కి ఊరట కల్గిచ్చినట్లు లేదు.

ఉప్పూ, మిరప్కాయకూడ కట కటలాడ్తాన్నా. రేట్ తక్కువని కడుపులెండ గట్కోని దాపెట్టుకోండే జొన్నలు, అయిన కాడికి అమ్మడానికి వాళ్ళకు యేడుపొస్తాంది. యేడ్వడ మొకటే తక్కువ. అయ్‌నా సేసేదేం ల్యాక, తమకు ఆశ్రయమిచ్చిన నూరేమార్డికీ, వాళ్ళింట్లో వాళ్ళకు జెప్పి తమ వూరి దావ పట్నార్రు.

శ్రీరాంరెడ్డి బుర్రలో ఆలోసెన్లు ముసురుకుంటండయ్ — "ఈ కచ్చలు మాసిపోయే దెప్పుడో--- అనాదిగా ఈడ కచ్చలుండయ్--- అనాదిగా ఈడ కరువులుండయ్--- కరువ్‌కూ, కచ్చల్‌కూ కాన్రాని సంబందముందేమో! ఏం పనీలేని మనిసి బుర్ర దయ్యాలకు కొంపంటారు. అట్లాటి మన్సి దురలవాట్ల దిక్కో, రాచ్చసత్వం దిక్కో మళ్ళు కుంటాడేమో!--- కరువుల్తో సేయ్ డాన్కి ఏం పన్లేక, అన్నిట్లో యనకబడి ఆలోసించే ఇంగితం గూడా ల్యాక రాయల్సీమరైతు, తన అసహ్నాన్ని అణుసుకుండేదెట్నో తెలక కచ్చల్ దిక్కు మళ్ళినాడేమో! ఈ కచ్చల్‌కు తోడు అగ్గిలో నూనె బోసినట్లు ఈ రాజ్కీయాలొకటి--- థూ---

శ్రీరాం రెడ్డి తల్కాయిదిలిమ్చుకున్నాడు.

మిగిలోళ్ళు గూడా యేందో ఆలోసించుతాన్నెట్లుంది. నిజమే, ఆలోసెన్లు రాక ఏం జేచ్చయ్ మల్ల. జొన్నలమ్మిన లెక్కేమో కేసల్కే

సొల్లు--- ఇంగోదిక్కు జూస్తే, యెండిన పైర్లలో నయాపైసా రాదు--- ముందుకు పైర్లు బెట్టడాన్కి పెట్టుబడెట్ల? అప్పుడ్దాంకా బతికేదెట్ల? తలోకెకరా బూమెమ్మాల్నేమో! అయ్‌నా ఈ కరువ్ కాలంలో బూములెవరు కొంటారు ?----

ఈ ఆలోసెన్లన్నీ యిప్పుడే--- ఈ రోంచేపే. మళ్ళా కుక్కతోక వొంకరే. రొన్నాళ్ళుంటే ఈ ఆలోసెన్లన్నీ గుడ్డతో తుడ్సినట్టు పోతయ్. అప్పుడు—

“ఏమన్నా గానీ - బూములూ, ఇండ్లూ, పెండ్లాం, పిల్లోళ్ళూ--- ఏదేమన్నా గానీ మనం వొంగిపోగూడ్దు. అవతలోళ్ళను నాశనం సేయాల మనం సచ్చినా సమాధానమే. ఈ పొద్దు సచ్చే మన్నాటికి మూన్నాళ్ళు---- మూన్నాళ్ళ బరువుల్ దించుకుంటే అంతా మర్సిపోతారు. అంతే” — అనుకుంటారు అక్కసుగా, పౌరుసంగా.

★ ★ ★

ఊర్లో కొచ్చిన రేత్తిరికే అందరూ శ్రీరాంరెడ్డి యింట్లో గుంపయినారు. మాడీలో వాకిండ్లేస్కొని సెర్చులు మొదులు పెట్నారు. గుంపులో ఉండే వాళ్ళందరూ బూమిని బట్టే, సంపాదనను బట్టే కర్చుకు సెందాలేస్కోడం మింద మాట్లాడ్తాండారు.

ఇసురుగా వాకిలి దొబ్బుకొని శ్రీకళ లోగా కొచ్చింది. ఆమె శ్రీరాం రెడ్డి పెండ్లాం. పెండ్లై యాడాది గూడా కాలె. సిన్నప్పట్నుంచీ పట్నంలో బెరిగి, సదువుకున్నేదే అయినా— బంధుత్వముండడంతో సిన్నప్పట్నుంచీ యిష్టపన్నే శ్రీరాంరెడ్నే సేసు కున్నాది.

శ్రీకళ యిసురుగా లోగా కొచ్చాంక, అందరూ సెర్చుల్ జాలిచ్చి ఆమె దిక్కు జూసినారు.

“ఏం”? అన్నెట్లు.

ఆమె నిబ్బరంగానే అడిగినాది “నేను సిన్నదాన్ని అడుగుతండానుకోవాకండి. అసలు మీరెందుకో కొట్లాట పెట్టుకొండేది? మనుషులకు తిండానికి ల్యాకున్నా, పసలకన్నా మేపుండాలని పంచాయితి మొదులు బెట్టే - కొట్టుకోడానికీ, ఆకర్‌కు నరుక్కోడానికీ సిద్ధపన్నారు. మీరూ, మీరూ కొట్కోని - పూర్లంబడి, జైళ్ళంబడి పోతే యాడ మీ పసల్‌కు మేపుంటా దునుకున్నారా? మీ కొట్లాటల్తో సేల్లో మేపును కాపాడుకున్నారా?----”

ఇంగా యేందో అడగబోయింది.

తమకన్నా సిన్నది - అందునా ఒక ఆడపిల్ల తాము జేస్తాండే దాన్ని తప్పులు బట్టడం, వాళ్ళకు మింగుడు పల్లె. వాళ్ళ అహం మింది గొడ్డల్తో బేసినట్లయింది. సెప్పాలంటే, ఆమె అడిగే పెశ్నల్‌కు జవాబులు గూడా వాళ్ళ కాడ లేవు మళ్ళ.

రామాడ్డి పొడిసే సూపు జూస్తా “అమ్మేయ్! నోర్మూస్కొని బయ్‌టికి పో!” అన్నాడు. అప్పుడ్దాంకా నిబ్బరం జూపిన శ్రీకళకు శివాలెత్తింది. అమ్మవారు పూన్నెట్లు ఆవేశపడింది.

“మా ఆడోళ్ళందరం ఇన్నేండ్లూ నోర్మూస్కొని, మీకు తందాన తాన అంటాండ బట్టే యిట్లయింది. మీరేమో మీపాటికి మీరు కొట్టుకొని జైళ్ళంబడిబోతే, ఇండ్లకాడ మీ పెండ్లాం పిల్లోళ్ళు ఏ సావు సస్పుండారోమీకేమన్నాతెల్తాందా?--- తట్టదు.

ఎప్పుడో మీ నాయ్నగారు వాళ్ళ నాయన్ను సంపినారని, వాళ్ళు మిమ్మల్ని సంపడం - మిమ్మల్ని వాళ్ళు సంపినారని, మీ పిల్లోళ్ళు వాళ్ళ పిల్లోళ్ళన్సంపడం - ఇట్నే తరతరాల్నుంచీ అర్థం పర్థం లేని పౌరుసాలు సూపిచ్చుకోడమే మీకు తెల్సేది. అంతేగానీ, మీరు ద్యానికోస

మైతే కచ్చల్ పెంచుకున్నార్రో, ఆ గమ్యాన్ని ఈ కచ్చల్తో సేర్తుండారా? లేదా? - అనేది మీకు తట్టదు.

రేప్పొద్దున మీ పిల్లోళ్ళు - మా యబ్బగారూ, మా నాయ్నగారూ బొబ్బిలి పులులు--- పల్నాటి సింహాలు--- అందుకే మేం ఈ సిమ్మెంటు ప్యాక్టరీల్లోకీ, రాళ్ళ గనల్లోకీ కూలికి పోతండం - అల్లైప్పుకుంటా ముర్సిపోతార్లేండి. అప్పుడ్దాంకా కొట్టుకుంటా, నాశనమ య్తానే వుండండి-----''

ఆమె గొంతులో యేడుపు జొర బడి మాట జీరబోయింది.

శ్రీరాం రెడ్డి యిసుర్‌గా లేసి, కొట్టేవాని మాదిరి మండిపడ్తా '' నువ్ ముందు బయిటికి పోతావా? లేదా? '' అన్నాడు.

ఆమె అంతే యిసురుగా బయిటికి పోయింది.




అప్పుడ్దాంకా యెంతో పౌరుసంగా - ఎవర్నెవర్ని యాడ సిక్కిచ్చుకొని కొట్టాలో్న! ఎవర్ని సంపాలో్న! ఆ పనల్కు సెందా లెంతేస్కోవాలో్న - అని సెర్చించు కుంటాండే వాళ్ళ మనసులు, ఆమె మాటల్తో యిరిగి పోయినయ్. తలల్లో శూన్నెమేర్పడింది.

పక్కగదిలో శ్రీకళ సన్నంగ యెక్కెక్కి యేడుస్తాన్నెట్టు, యినప డ్తానే వుంది. బరువెక్కిన వాళ్ళ మనసుల్లో--- యాన్నో--- యా మూలో్న--- అడుగు మట్టాన--- మసక మసగ్గా ఒక పెశ్న రూపుదాలు స్తాంది.

'' ఔరా! మనం దేని కోసం కొట్టుకుంటాన్నెట్టు? ''

# కనురెప్పల్లో కెంపులు... — సాగర్ జయ్యది

నెత్తుటి పొద్దున
క్రేంకరిస్తున్న మయూరం గుండెలో
తుపాకి గుండు దూసుకొన్నప్పుడు
నాకళ్ళు చెమర్చి, ఉల్కాపాతం జరుగుతుంది!
తొలి సంధ్యన విషం చల్లి పులిని కడతేర్చి
చర్మం వొలిచినప్పుడు -
చౌరాస్తాలో నిలదీసి
నా వలువలు యెవరో వలిచేసినట్లు
మనోవ్యధ!
ప్రకృతి ఆయుస్సు క్షణక్షణం క్షీణిస్తుంది.
ప్రతి నెత్తురు మరక పరిహసిస్తుంది
ఏదో బాధ ద్యోతకమౌతుంది
నిండు చూలాలిగా భాసించే విమానం
నేల కూలినప్పుడు -
పడకటింటికి
పొల్లాను తీసుకుపోయే పడతిలావున్న
నౌక, సముద్రగర్భంలో కృంగినప్పుడు
నా హృదయంపై గాయం ....
అంతరంగ క్షోభ వర్ణించలేను
తప్పటడుగులు వేస్తున్న పసిపాపలా వున్న రైలు,
పట్టాలు తప్పినప్పుడు ...
వృద్ధురాలిలా నడిచేబస్సు
మెలికలు తిరిగి చెట్టుకు గుద్దుకొన్నప్పుడు
ఆ విషాదం హృదయాన్ని కౌగలించుకుంటుంది -
కంఠం వణుకును ముద్దు పెట్టు కుంటుంది -
మతకలహాలకు కళాఖండాలు
మందిరాలు .. మసీదులు
సాష్టాంగ పడినప్పుడు
మస్తిష్కంలో విస్ఫోటనం
కనురెప్పల చివర నెత్తుటి కెంపులు మొలుస్తాయి.
నా ఆననం పశ్చిమాద్రి సూర్యుడౌతుంది
నా కలం కంట్లో నలుసు పడుతుంది
నా భావాలు కృంగి పోతాయి ....

# మైథిలిగారి మహిళలు

— కొమ్మిశెట్టి మోహన్

ఆధునిక హిందీకవులలో మైథిలీశరణ్ గుప్తాగారికి ఒక ప్రత్యేక స్థానముంది. వారు తన అపూర్వ రచనలద్వారా హిందీ సాహిత్యాన్ని, విశ్వసాహిత్యంలో ఉన్నత శిఖరాలకు చేర్చడానికి ప్రశంసనీయమైన పాత్ర నిర్వహించారు. వారు రచించిన కావ్యాలన్నీ దేనికదే ప్రత్యేకతను సంతరించుకొని యున్ననూ, వాటిలో 'భారత్‌భారతీ', సాకేత్, జయద్రధ్‌వధ్, శకుంతలా, ద్వాపర్, జయభారత్, విష్ణుప్రియా, రత్నావళీ మొదలైనవి ప్రత్యేకంగా పేర్కొనదగినవి. వీటన్నిటిలోను 'సాకేత్', ఆధునిక హింది మహాకావ్యాల్లో ఒకటిగా ప్రసిద్ధిగాంచి, హిందీ సాహిత్యాకాశంలో గుప్తగారి కీర్తిబావుటాను ఎగురవేసింది.

మైథిలీశరణ్ గుప్తాగారి కావ్యాల్లో ఎన్నో విశిష్ట లక్షణాలున్నా ప్రస్తుతం వారు తన కావ్యాల్లో మహిళలపట్ల అవలంభించిన దృక్పథాన్ని గురించి ఇచ్చట పరిశీలిద్దాము.

గుప్తగారి హృదయాంతరాళలో స్త్రీజాతి పల్ల అగాధమైన కరుణాసాగర ముప్పొంగు చున్నది. ఈ ప్రవాహం సహృదయ పాఠకుల హృదయాలను రససిక్తము గావించినది. యుగయుగాలుగా ఉపేక్షింపబడుతూ వచ్చిన స్త్రీజాతి భావనలకు మాటల రూపాన్ని ఇవ్వడానికే ప్రసిద్ధకావ్యాలను వ్రాశారనుట అతిశయోక్తి కాదు.

గుప్తగారు తన అమరకావ్యం 'సాకేత్' నందు యుగయుగాల నుండి ఉపేక్షింపబడిన ఊర్మిళ భావాలకు సాకారరూపాన్నిచ్చారు. రామాయణగాథలో మహాసాధ్విసీత నెరుగనివారు, ఆమె ఔన్నత్యానికి తలవంచనివారు వుండరు. కానీ ఊర్మిళ? తపస్సు, త్యాగం, సతీత్వం, పాతివ్రత్యం, అన్నిటిలోను సమఉజ్జీయైననూ, భాషాభేదం లేకుండా కవులందరూ చిరకాలంగ ఆమెను ఉపేక్షిస్తూనే వచ్చారు. ఊర్మిళ భర్త లక్ష్మణుడు అన్నావదినలను సేవించుటకు పదునాలుగు సంవత్సరాల సుదీర్ఘకాలమనే హద్దును నిర్ణయించి అడవులకు వెళ్ళాడు. మరి ఈ అభాగ్యురాలు అంతకాలం ఒంటరిగా ఎలాగడపాలి? ఒక విరహావిదగ్ధయగు స్త్రీ హృదయావేదనను గుర్తించడం మైథిలిలాంటి సహృదయుడగు కవికే సాధ్యమయ్యింది. ఆ హృదయ స్పందన ఫలితంగానే ఆయన సాకేత్ మహాకావ్యాన్ని సృష్టించ గలిగాడు.

ఉపేక్షింపబడిన ఊర్మిళను పాఠకుల దృష్టికి తెచ్చుటకే, విశ్వకవి రవీంద్రుని ప్రేరణతోనే, సాకేత్ కావ్యసృష్టి జరిగిందని ఈకావ్య విమర్శకుల ఏకాభిప్రాయము. సాకేత్ నవమసర్గ యందు ఊర్మిళ విరహాన్ని కవి అత్యంత హృదయ విదారకంగా వర్ణించాడు.

'మానస్ మందిర్‌మే సతీ,
ప్రియకీప్రతిమాథాప్,
జల్‌తీథీ ఉస్‌విరహమే, బనీ ఆరతీ ఆప్'

ఊర్మిళ తన మానస మందిరంలో తన ప్రియుని ప్రతిమను ప్రతిష్టించుకొని, తానే హారతిగా ఆ విరహాగ్నిలో కాలిపోతూవుందని, గుప్తగారు ఊర్మిళ పట్ల తన ఆందోళననూ, అపారమగు సానుభూతిని ప్రదర్శించారు.

ఒక ఊర్మిళయే కాదు. మైథిలిగారు తన రచనా కళానైపుణ్యంతో కైకేయిలాంటి శాశ్వత తిరస్కృతయగు స్త్రీకి కూడ ఎంతో కరుణ, మమత, స్నేహశీలత అందించారు. ఆమెపట్ల హృదయంలో యుగయుగాలుగా కరుడుగట్టిన అసహ్యం, తిరస్కారం లాంటి కలుషిత భావాలను ప్రక్షాళనగావించారు.

థూకెమురుఘపర్ త్రైలోక్య భలేహీ థూకె,
జో కోయీ కుఛ్ కహసకె, కహే క్యోంచూకె.
యుగ్ యుగ్ తక్ చల్‌తీ రహే కఠోర్ కహానీ
రఘుకుల్ మే థీ ఏక్ అభాగీ రాణీ.''

ఈ పంక్తులు చదువుతూ చదువుతూ సహృదయ పాఠకుల హృదయాలు ద్రవింపకమానవు.

''ముల్లోకాలు నామీద ఉమ్మివేయనీ,
నన్ను నిస్సంకోచంగ నిందించనీ,
రఘుకులము నందు ఒక అభాగినియైన రాణి కఠోరగాధ యుగయుగాలకు తెలియనీ''.

అంటూ కైకేయి తాను చేసిన తప్పిదానికి పశ్చాత్తాపంతో కుమిలిపోతుంది. పాఠకులు ఆమెచేసిన మహాపరాధాన్ని మరచి, ఆమెపట్ల అపారమగు సానుభూతిని వ్యక్తపరుస్తారు. పరిస్థితుల ప్రభావం వల్ల క్షణికావేశంలో పొరపాటుచేసినా, తుదకు స్త్రీమూర్తి మహనీయమైనదేనని గుప్తగారు చాటిచెప్పారు. సమాజంలో ఏ స్త్రీని కూడ అవమానించడం ఆయన సహించలేకపోయారు. అందుకే వారి కన్నీటిని తుడిచే ఏ ఒక్క అవకాశాన్ని ఆయన

చేయి జారనీయలేదు.

గుప్తగారు యశోధర' కావ్యం ద్వారా ఆకావ్యనాయిక యశోధరకు కరుణ, సానుభూతి అందించి అపార మైన శక్తిని ప్రదానం చేశారు. వారి చలువల్లనే యశోధర తన పతిదేవుడూ, విశ్వవందితుడూ అగు బుద్ధభగవానునితో సమంగా భక్తి శ్రద్ధలకూ, ఆదరాభిమానాలకు పాత్రురాలైంది.

'స్వయం సుసజ్జిత్ కర్ కె రణ్ మే,
ప్రియతమ్ కో, ప్రాణోంకె పణ్ మే,
హమీ భేజ్ దేతీహై రణ్ మే-
ఛాత్ర ధర్మ కెనాతే,

సఖి, వే ముఝుసే కహకర్ జాతే'.

అని యశోధర నోటివెంట పలికించి, ఒక యశోధరే కాక, సమస్త నారీలోకము గర్వంతో తలఎత్తుకొనేలా చేయడం గుప్తగారికి మాత్రమే చెల్లింది.

లోక కళ్యాణార్థియై, సిద్ధార్థుడు తన ధర్మపత్ని యశోధరకు, ముద్దుల తనయుడు రాహులునకు చెప్పకుండా అర్ధరాత్రి దొంగలా వెళ్ళిపోయాడు. అదే యశోధర ఆత్మాభిమానాన్ని దెబ్బ తీసింది.

'నాతో ఒక్కమాట చెప్పివుంటే, క్షత్రియ ధర్మానుసారం, నేనే వారిని క్షణాలలో అలంకరించి యుద్ధభూమికి పంపినట్లు, పంపియుండేదానను గదా!' అని వాపోతుంది. సిద్ధార్థుడు ఈవిధంగ చేయడం యశోధరకంటె గుప్తగారినే ఎక్కువగ కలచివేసింది కాబోలు. తుదకు సాక్షాత్తు బుద్ధునిగా మారిన సిద్ధార్థుని నోటివెంటే యశోధరకు క్షమాపణలు చెప్పించే వరకు శాంతించలేదు.

యది మైనె నిర్దయతాకీతో,
క్షమాకరో ప్రియజాన్,
మైత్రీ కరుణాపూర్ణ ఆజ్ మై,
శుద్ధబుద్ధ భగవాన్.''

నీపట్ల నిర్దయంగా ప్రవర్తించి వుంటే నన్ను మన్నించు.' అని చెప్పడం, బుద్ధుని రూపంలో సమస్త పురుష ప్రపంచం స్త్రీ జాతి పట్ల తమ కఠోర ప్రవర్తనకు పరితప్తులగు నట్లు తోచుచున్నది.

సాకేత్ కావ్యంతో పోల్చితే యశోధర' కావ్యమందు నారీ భావం ఎంతో వికసించింది. 'సాకేత్' మహిళలు, తమ పతులకు అనువర్తినులుగా, విరహిణులుగా, పశ్చాత్తాపానికి ప్రతిరూపాలుగా నిలిచారు. కానీ గుప్తగారు యశోధరను అత్యంత సంయమనశీలగను, వివేక, బుద్ధిసంపన్నురాలిగను, గంభీర, ఆదర్శ యువతిగను చిత్రించారు.

యశోధర భర్త ఆమెను శాశ్వతంగా వదలి వెళ్ళాడు. అతనెక్కడున్నాడో, ఎలావున్నాడో తెలియదు. ఆమెకు తన ప్రియ వల్లభుని పొందే అవకాశం రవంతయు లేదు. ఆయన ఈనశ్వర ప్రపంచానికి దూరంగా, ఆత్మజ్ఞాన ప్రాప్తికై వెళ్ళాడని ఆమెకు తెలుసు. ఒకవేళ ఆయన తిరిగి వచ్చినా, అతని హృదయంలో రసానుభూతి అసంభవం. అతని మానస మందాకిని శాశ్వతంగా ఎండిపోయింది. కానీ ఊర్మిళ పరిస్థితి వేరు. ఒక నిశ్చితకాల వ్యవధి వరకు ఆమె భర్త వెళ్ళాడు. అదికూడ, తల్లిదండ్రులకంటె, మిన్నగా చూసుకొనే సీతారాముల నీడలో సురక్షితంగా వున్నాడు.

ఈ విధంగ కవి ఊర్మిళ విరహవ్యథకు 'యశోధర'లో ఒక కొత్త రూపాన్నిచ్చాడు. యశోధర రూపంలో కర్తవ్య పరాయణయగు ఒక పతివ్రతా రూపాన్ని చిత్రించాడు. ఆమెకు తనభర్త వెళ్ళాడని దుఃఖం లేదు. తనతో చెప్పకుండా వెళ్ళాడనే దుఃఖమంతా. ఈ విధంగ కర్తవ్య పరాయణత్వంతోపాటె, స్త్రీ సహజ మైన విరహంలోని సంఘర్షణను చూపించి కవి యశోధరను మరింత సజీవం చేశారు.

యశోధర మనసా, వాచా, కర్మణా పతివ్రత అయినా, అత్యంత స్వాభిమానం గలది. ఆస్వాభిమానం ముందు దుస్సహమగు విరహవేదన కూడ ఓడిపోయింది. బుద్ధుడే స్వయంగా రాజధానికి వచ్చినా, ఆయన దగ్గరకు తానే వెళ్ళడానికి ఆమె స్వాభిమానం అడ్డు నిలిచింది. ఈ విధంగ 'యశోధర'లోని మహిళ 'సాకేత్' లోని మహిళ కంటె అధిక శక్తి సంపన్నురాలు.

నారీత్వపు తేజోవంతమైన చరమ స్థితిని గుప్తగారి 'ద్వాపర్' కావ్యంలో చూస్తాము. 'ద్వాపర్' నందు విధృత రూపం మహోత్కృష్టంగాను, తేజోవంతంగాను చిత్రించారు. విధృత పతిదేవుడు ఆమెను చెలులతో కలిసి శ్రీకృష్ణుని వద్దకు వెళ్ళనీయడు. శ్రీకృష్ణునితో ఆమెకు అనుచిత సంబంధముందేమోనని అతని అనుమానం. ఇది ఆమె ఆత్మాభిమానాన్ని దెబ్బతీసింది. ఆమెలో తిరుగుబాటు బయలుదేరింది.

''అధికారోం కె దురపయోగ్ కా కౌన్ కహా అధికారీ?
కుచ్ భీ స్వత్వ నహీ రఖ్ తీ క్యా అర్థాంగినీ తుమ్‌హారీ?''

'తమ అధికార దుర్వినియోగం చేసే హక్కు ఎవ్వరికీ లేదు. మీ అర్థాంగిగా నాకేమీ వ్యక్తిగత గుర్తింపు లేదా? ఎవరికీ పిడికెడు పెట్టడానికి కూడ నాకు హక్కులేదా?' అని ఆడసింహం వలె గర్జించి తనపతి దేవున్ని నిలదీస్తుంది. విధృతవంటి శక్తివంతమైన మహిళ మనకు హిందీ సాహిత్యంలో మరెక్కడా కనిపించద నుట అతిశయోక్తి కాదు.

ఇప్పుడే కాదు, ప్రతియుగంలోనూ పురుషుడు స్త్రీపట్ల శంకాశీలుడుగానే ప్రవర్తించాడు. స్త్రీని తన స్వంత తండ్రి, పుత్రుడు, సోదరునితో కూడ

ఒంటరిగ చూసి ఓర్వలేనంతగ పురుషులు పతనమయ్యారు. పురుషునిలోని ఈ దూషిత ప్రవృత్తిపై విధృత తీవ్రమైన దెబ్బకొడుతూ వుంది.

'నర్ కే బాంటె క్యానారీ కీ
నగ్నమూర్తి హీ ఆయీ ?
మా, బేటీ యా బహిన్ హాయ్।
క్యానంగ్ నహీవహ్‌లా యీ ? '

ఈ విధంగ 'ద్వాపర్'లోని మహిళ పతివ్రత్వపు, మాతృత్వపు హద్దులనధిగమించింది. కవి విధృతలోని ఈ చైతన్యాన్ని సమాజమంతటా చూడాలని కాంక్షిస్తున్నాడు.

పురుషుడు సదా స్త్రీపట్ల అవిశ్వాసమే కలిగియున్నాడు. పురుషుని నూరు తప్పులైనా క్షమించాలి. అతను ఇంటి యజమాని గనుక. విధృత ఈ అన్యాయాన్ని నిర్భయంగ ఎదిరించింది.' ద్వాపర్ ' లోని మహిళ అన్యాయాన్ని, అత్యాచారాన్ని సహించడం కంటె, ఆత్మార్పణ గావించుకోవడమే శ్రేయస్కరమని భావిస్తుంది.

'యిన్ అన్యాయ్ సమక్ష, మరూ
మై, కభీనహీ ఝుక్‌సక్‌తీ''

'ద్వాపర్' మహిళ ఎంత ప్రచండ రూపిణియో, అంత శాంతమూర్తి కూడ. విధృత విద్రోహిణి. కుబ్జ ప్రేమమూర్తి. ఈ విధంగా ప్రణయం, ప్రళయం, రెండు భావాల అపూర్వ సంగమం ఈ కావ్యం. శ్రీకృష్ణుని సాంగత్యంలో కుబ్జతన్నుతాను మరచింది. ఆమెకు సృష్టి అంతా ఆనందమయంగా తోచింది.

కవి ఈ కావ్యంలో మమతామయి మాతృమూర్తి హృదయాన్ని దేవకి ద్వారా చూపారు. దేవకి రూపంలో మనకు ఆశానిరాశల మధ్య కొట్టుమిట్టాడుతున్న మాతృ హృదయం కనిపిస్తుంది.

తర్వాత మైథిలిగారి దృష్టి 'విష్ణుప్రియ' వైపు వెళ్ళింది. విష్ణుప్రియ చైతన్య మహాప్రభువు అర్థాంగి. బుద్ధునివలె చైతన్య ప్రభువుకూడ తన తల్లిని, భార్యను వదిలిపెట్టి, సన్యాసి అయ్యాడు. ఫలితంగా విష్ణుప్రియ జీవితం కూడ యశోధర జీవితంలాగే కరుణా పూరితమయ్యింది. ఊర్మిళకు ప్రియపతి మళ్ళీ లభించాడు. యశోధరకు ఆటపాటలతో మైమరపించే కుమారుడున్నాడు. కాని విష్ణుప్రియ జీవితమే కరుణారస ప్రవాహమగు అగాధ సాగరము.

విష్ణుప్రియ' తర్వాత గుప్తగారి కృతులలో 'రత్నావళి' ప్రధానమైనది. ఈరోజు ప్రతి ఇంటిలోను 'రామచరతమానస్' భక్తి శ్రద్ధలతో పఠిస్తున్నారు. ఆ గ్రంథకర్త తులసీదాస్ పట్ల జనుల మానసమందు అపార శ్రద్ధాభక్తులున్నాయి. కానీ, తులసీదాను నింతవాన్ని చేసి, రాముని చరణాలపట్ల అనురాగాన్ని మేల్కొలిపిన రత్నావళిని గూర్చి ఎవరూ పట్టించుకో లేదు. గుప్తగారు ఈ బాధ్యతను కూడ తన భుజాలపై వేసుకున్నారు. వీరు తన పుస్తక ప్రారంభంలోనే, ఈ కార్యాన్ని నిర్వహించడం తన కర్తవ్యమని విన్నవించుకున్నారు. ఎవరివల్లనైతే హిందీ సాహిత్యానికి తులసీదాసంతటి మహాకవి లభించాడో, వారికి శ్రద్ధాంజలి ఘటించి, తాను ఒక కర్తవ్యాన్ని నెరవేర్చానని గుప్తగారు తన వినయాన్ని, విశాల హృదయాన్నీ చాటుకున్నారు.

రత్నావళి తాను విరహాగ్నిలో జ్వలించిననూ, తనప్రియ పతికి, రాముని అండ ప్రాప్తించాలని కోరుకుంటుంది.

'' యహీ వినయ్‌హై రామ్, తుమ్‌హారీ
ఛాయాప్రియకొ ప్రాప్తహో,
మేరా వికల్-విలాప్ మృత్యుతక్ జో
చాహేన సమాప్త హో''

ఈ విధంగ మైథిలీశరణ్ గుప్తగారు మహిళల పట్ల తన శ్రద్ధాభక్తులను చాటి, సానుభూతిని వారికందించారు. వారు మలచిన ఊర్మిళ, కైకేయి, యశోధర, విధృత, దేవకి, విష్ణుప్రియ, రత్నావళి, సమస్తనారీ లోకానికి తలమానికములై, ఆదర్శప్రాయంగా నిలిచారు. వారు అజరామరమై నిలుచుటే గాక, గుప్తగారికి కూడ హిందీ సాహిత్యంలో శాశ్వత కీర్తిని ఆపాదించారు ●

# అతణ్ణి ఎందుకు అడగరు?

— డా॥ పి. యల్. శ్రీనివాసరెడ్డి




ఇద్దరం సమాన భాగస్వాములం
ఎందుకు నన్ను మాత్రమే ప్రశ్నిస్తారు ఫలితం గురించి?
అతణ్ణి ఎందుకు అడగరు?
నేను దృష్టం
అతను అదృష్టం
అందుకే అతణ్ణి అడగరు
నేను స్థిరను
అతను అస్థిరుడు
పిక్కబలముంది కాలికి బుద్ధి చెబుతాడు
అందుకే అతణ్ణి అడగలేరు
అతను తిడతాడు కొడతాడు
అందుకే అతణ్ణి అడిగే ధైర్యం లేదు
హుంకరించే చోట ప్రశ్నపుట్టదు, పుట్టినా చస్తుంది
నేను
ఉదరంలో భరించాను ప్రసవోద్భవ వేదన పొందాను
శిశువు మలమూత్రాల్లో జలకాలాడాను
నేను
భ్రూణహత్య చేయలేదని మీ బాధ
నేను కనీసం హంతకురాలినైనా కావాలని మీ ఉద్బోధ
నేనుచంపను చంపుతూవుంటే చూస్తూ చావలేను
కని పెంచేపని పోషించేపని నాది
నా అజ్ఞానాన్ని అమాయకత్వాన్ని
ఆసరాగా తీసుకొని అవహేళన చేస్తున్నారు
పెళ్ళి కాకుండానే నేను తల్లినెలా అయినానని మీ ప్రశ్న
పెళ్ళి కాకుండానే అతను తండ్రి ఎలా అయినాడని
ఎదురు ప్రశ్న
అతణ్ణిడగండి నన్నడిగినట్లుగానే
మీరెందు కడుగుతారు?
మీరు పురుషులు, పురుషత్వమున్న స్త్రీలు
అభినవకుంతి అని నన్ను నిలదీస్తున్నారు
అవమానిస్తున్నారు అసహ్యించు కుంటున్నారు
మునిమంత్రం ఏ మాత్రం పని చేస్తోందోనని
కనుక్కోవాలని కోరితేనే
కుంతికి సద్యోగర్భాన్నిచ్చాడు సూర్యుడు
నేనడక్కుండానే
నన్నడక్కుండానే
నా అయిష్టత తోనే
నావ్యతిరేకత తోనే
నాకీ ఫలితాన్నిచ్చాడతను
అతణ్ణి అడగండి.
'అభినవ సూర్యభగవానుణ్ణి అడగండి
నిలదీయండి
అవమాన పరచండి
అసహ్యించుకోండి ●

# కనిపించని మంట!

— రాధేయ

మన్నించాలి!
సకల స్వార్థాలతో కాలుష్యమై పోయిన చిరునవ్వులతో
పరాయితనం అతికించుకున్న ఈ ముఖం నాదికాదు!
సందేహం లేదు!
ఈ నిర్బంధ జీవన వ్యవహారంలో
ఫోర్జరీ చెయ్యబడిన ఈ సంతకం నాది కాదు!
రెప్పపాటు సమయాన్ని కూడా వృధా చెయ్యలేని
ఈ కరెన్సీ కాల ప్రవాహంలోంచి
ఈ ఊహాతీత గందరగోళంలోంచి
జీవితం పారదర్శకమై పల్కరిస్తూ ఉంది
పూర్తి నిజాన్ని ఆలోచించడానికీ, చెప్పడానికీ
కనీసం వినడానికి కూడా భయపడే నువ్వు
సహృదయత వెనుక స్వార్థాన్ని కొలతలు వేస్తావు
ఎదుగుతున్న మనిషిని మాసి నీకైనీవుకుంచించుకుపోతావు
మీ ఆత్మల విముక్తి కోసం ఆధ్యాత్మిక స్థావరాల కోసం
అన్వేషిస్తావు!
అనంతశ్రమకీ, అనుభవించేహింసకీ మధ్య
మా ఆత్మాభిమానం ఒకపచ్చిపుండు
హత్యలు గురించీ, అరాచకం గురించీ
నువ్వు ఆలోచించనప్పుడు,
హతులపట్ల నీ ఖరీదైన సానుభూతి, రాయితీలు
మాకక్కర్లేదు!
నాగేటి చాళ్ళలో ధారపోసిన స్వేదం
మట్టిపొత్తిళ్ళలో ఇంకిపోయి
అగ్నిశ్వాసగా మారిపోతున్నప్పుడు
మా కంట్లో గాజు ముక్కలు గుచ్చుకున్నంత దుఃఖం
మానాభిలోంచి గడ్డపార దిగుతున్నంత దుస్సహమైన బాధ
మట్టిపొరల్లోంచీ అంకురం మొలకెత్తుతున్నప్పుడు
తప్పిపోయిన పసివారు మా ఇంటికి చేరుకున్నంత ఆనందం!
కంకిమీద గింజలు కనిపిస్తే చాలు
అరచేతుల్లోకి అన్నం ముద్ద చేరినంత ఆనందం!
నేర్చుకోలేని వాడే బోధించడానికి పూనుకుంటాడు
తన భవిష్యత్తును కంప్యూటర్ జోస్యానికి
అంకితం చేస్తాడు!
సాలీడు తన ఉచ్చులోకి ఈగల్ని ఆకర్షించినంత నేర్పుగా
ఈ దుకాణాలన్నీ దోపిడీ కేంద్రాలుగా గోచరిస్తాయ్ నాకు
మనుషుల్ని రోగులుగా, రోగుల్ని కష్టమర్లుగా భావిస్తూ
పంజా వదుపు కోసం కాసుక్కూర్చున్న పెద్దపులుల్లా
ఆసుపత్రులు దర్శనమిస్తాయ్ నాకు!
సాధారణమైన బాధ నుంచీ, అసాధారణమైన శోకం దాకా
అంతరాత్మల్ని కుదించుకున్న దీర్ఘకాలిక ఆత్మవంచనలలో
ఒక కనిపించని మంట రాజుకుంటూ ఉంది
అనుభవం కిరాతక దరహాసమైనప్పుడు
మననం ఉపశమనం కాదు
జీవితమంటేనే జ్వలన శీల వ్యక్తిత్వం!
రాతికీ కత్తికీ మధ్య సంక్షోభ ధ్వని!
రాయికీ అర్థానికీ ఉన్న దగ్గరి సంబంధం! ●

★ కేశవ ఆర్ట్ థియేటర్స్, నబీకోట, కడప–516 003.

# తడి

—సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి

కల్లం కట్టవ వారన చేనిగట్టున కూచుని మెల్లిగా గడ్డి పరకల్ని పెరుక్కొంటోంది చెన్నమ్మ. గోడ కింద కట్టేసిన బఱ్ఱెదూడ ఆకలి చూడలేక లేని ఓపిక తెచ్చుకొని కఱ్ఱ వూతేసుకొంటూ వచ్చిందామె.

జంగిడి దొడ్లలోంచి తప్పించు కొన్న రెండు బఱ్ఱెగొడ్లు - వానకు తడిసి నల్లగా మగ్గి, కుళ్లిపోయిన వేరుశెనగకట్టె కుప్పల్ని కొమ్ములతో కుమ్ముతున్నాయి.

స్వాతి కార్తె వచ్చింది మొదలు ముసురు పట్టింది. అక్కడక్కడా తేలిగ్గా వెళ్లిపోయే మేఘాలు కుఱ్ఱపన్ని నట్లు అన్నీ కలసిపోయి ఆకాశానికి తెర గట్టాయి. సన్నసన్న పుల్లజిను కుల్తో, యీదురు గాల్తో మొదలైన వానకార్తె చివరిదాకా తగ్గలేదు.

నీళ్ల తడికి గతిలేని, వాననే నమ్ముకొన్న చేలల్లో ముక్కాలు భాగం ఎండిపోయిన పైరు యీ వానదెబ్బకు వూడలతో సహా కుళ్లి పోయింది.

పీకాలనుకొని తడేసి సిద్ధంగా వుంచుకొన్న పైరు సైతం బాగా దెబ్బతింది. పీకి కుప్పలేసిన కట్టె పరిస్థితి మరీ అధ్వాన్నంగా వుంది. కాయలన్నీ తెల్లగా మోసులెత్తి వున్నాయి.

రాక రాక వచ్చిన యీ వాన రైతు కళ్ల చెరువుల్ని అరుగులు పొంగేలా నింపి వెళ్లింది.

పెరుటి పరిస్థితి మళ్లీ రాకుండా జాగ్రత్త పడుతున్నంతలో దయ్యంలా విరుచుకుపడింది యీ వాన.

ఈ కరువుకు తోడు మనుషుల మధ్య ఆరిపోని 'పగ'లు కడుపు నిండకున్నా పర్లేదు - కసిదీరాలి.

పైరు పండకున్నా పర్లేదు పంతం నెగ్గాలి.

పల్లె పూర్తిగా చెడిపోయింది.

నిన్న మొన్నటి దాకా బాగున్న తనవాళ్ల మధ్య కూడా పగల సెగలే.

వెనగ్గా ఏదో సవ్వడి విన్పించి తలతిప్పి చూసింది ఆమె.

సుబ్బన్న వస్తూ కన్పించాడు.

మెల్లిగా నడుచుకొంటూ వచ్చి ఆమె కెదురుగా నిల్చున్నాడు

తలెత్తి అతనికేసి చూసి మళ్లీ తలదించుకొని గడ్డి పెరుక్కోసాగింది.

ఏదో పనిబడి వచ్చిండు. ఎనక ముందాడలాండు. సిన్నప్పట్నించీ అంతే యీడు. ఏదెన్నా కావాలంటే ఎదటబడి అడగడు. తనే కనిపెట్టి అందియ్యాల .

''ఏం నాయినా?'' పలుకరించింది.

'' ఏం లేదమ్మా! '' నసిగాడు

'' పనిబడే వచ్చినట్టుండవ్. సెప్పు నాయినా. ''

కొద్దిసేపు మౌనం తర్వాత గొంతు విప్పాడు.

'' కేసు మనమే గెలుస్తమంట అమ్మా! ''

నిశ్శబ్దంగా వుండిపోయింది ఆమె.

ఆ విషయం తల్చుకొంటేనే గుండెల్లో బాధ సుడులు దిరుగుతోంది.

'' లాయరుకు ఫీజు గట్టాల. '' గొణిగినట్లుగా అన్నాడు.

తలెత్తి అతనికేసి చూసింది.

'' సేతిలో లెక్కలేదమ్మా! యాడ దిరిగినా దొరకలే. ''

ఆమె కర్థం కాలేదు.

తనేం చేయగలదు?

'' నీసేతి కడేలిస్తే---- '' గొంతుకేదో అడ్డుపడ్డట్లుగా ఆగిపోయాడు.

అర్థమైంది ఆమెకు

తలొంచుకొని మౌనంగా వుండిపోయింది.

కొద్దిసేపటి తర్వాత మళ్లీ కదిపాడు - '' ఏమ్మా? '' అంటూ.

ఆమె తలెత్తలేదు.

మౌనాన్ని వీడలేదు.

గడ్డి పరకల్ని పీకటం ఆపలేదు.

తల్లి ఉద్దేశ్యం అర్థమై మరేమీ మాట్లాడకుండా వెనుదిరిగి ఇంటికి నడిచాడు.

ఆలోచనలు ఒక్కసారిగా యీగల్లా ముసురుకున్నాయి ఆమె తలనిండా. కళ్లలో తడి కదిలింది. మెల్లిగా చెంపలమీదకు జారింది.





రాత్రి తిండి తినలేదు ఆమె ఆకలి కాలే' దంటూ.

నగం రాత్రిదాకా కంటిమీద కునుకులేదు.

ఈ ఏడాదంతా యిట్లాంటి రాత్రుల్ని చాలా గడిపింది ఆమె.

మొదటిసారి అక్కా, తను ఆసుపత్రి వరండాలో చెరోవైపు కూచుని తెల్లార్లూ ఏడుస్తూ గడపటం బాగా గుర్తుంది.

అనుకోకుండా వచ్చింది అక్క కుటుంబానికి, తన కుటుంబానికి మధ్య కొట్లాట.

నిరుడు శెనక్కాయ నెల రోజుల పైరప్పుడు మొదలైంది గొడవకు మూలం.

తువ్వ చేలల్లో నెల రోజుల పైరయ్యేదాకా నీటి అవసరం వుండదు. వాతావరణంలో తేమ వుండే కాలం కాబట్టే యీమిరి పట్టుకొని వుంటుంది నేల. తవ్వకాలయింత ర్వాత పైరు దొంగపూత పూసే సమయంలో ఒక పదునయితే చాలు.

అశ్లేష కార్తెలో కూడా వాన వంగలేదు. బెట్ట చేలల్లో అకడక్కడా పైరు వాడు బట్టింది.

మఖ వరకు చూసి చెరువు తూమెత్తుదా మనుకొన్నారు రైతులంతా. ఎందుకంటే చెరువులో నీళ్లన్నీ రెండుదళ్లకే సరిపోతాయి కాబట్టే. భూమి విస్తారానికి తగిన చెరువు కాదుగాబట్టే. ఇప్పుడొక తడివాడు కొన్నా, వర్షం రాకుంటే చెనక్కాయ పీకేటప్పుడు ఖచ్చితంగా ఓ తడి అవసరం కాబట్టే.

వారి పథకాలకు గండికొడుతూ అనుకోకుండా అశ్లేష వెళ్లుదలలో ఒకనాటి ఉదయం చెరువుకింద కలకలం రేగింది.

పార భుజానేసుకొని నేనంటే నేనని పోటీలుపడి చేలకేసి వెళ్తోన్న జనంతోబాటు తనూ బైటకు నడుస్తోన్న పెద్ద మనవడు శీనును ఆపింది.



''యేందొరే యిదెంతా?'' అడిగింది.

'' ఏముందీ? శెనక్కాయ సేనికి తడేసి వస్తా!'' చెప్పాడు.

'' అప్పుడే ఏం తడిరా?'' ఆశ్చర్యంగా అడిగింది తను.

'' అందరేస్నాన్లే!'' చెబుతూ ఇల్లుదాటాడు.

తర్వాత విచారిస్తే తెలిసింది విషయం.

ఎవడెత్తాడో మరి గత రాత్రి తూమెత్తాడుట. నాలుగు చేలు పారాయి. వాడుతడేశాడని వీడూ----వీణ్నిచూసిఇంకొకడూ---- మరొకడూ---- వేరొకడూ---- వూరంతా---

తడి మరిగిన పైరు పదిరోజులు తిరక్కుండానే మరో తడికోసం ఎదురు చూస్తుంది.

చివరి తడి లేకుండా శెనక్కాయ ఎట్లా పీకాలి?

వానొస్తుందని నమ్మకమేమిటి?

ఆ విషయాన్ని ఆలోచించి చాలా బాధపడింది తను.

కాలువ దారులన్నీ తిరునాళ్లయినాయి.

జనమంతా తొక్కులాడారు. చేలగెట్లెంట పరువెత్తారు. ఎండు కాలువల్ని బురదమయం చేసేందుకు నీళ్ల కాలువల్లో పడి పొర్లాడారు.

చివరి భూముల వాళ్లు తడివ్వలేదంటూ ఆక్రోశించారు.

చిన్న చిన్న ఘర్షణలతో ఎలాగో లాగు మొదటి తడి ఐపోయింది.

ఊడల చివర్లు పిందెలుగా రూపు దిద్దికొంటున్నాయి.

మరో పది రోజులకు రెండవ తడి మొదలైంది.

సగం నేల తడిసే సరికి తూముకు అందకుండా పోయాయి నీళ్లు.

ఆయిల్ ఇంజన్లు తెచ్చి చెరువులోకి దించారు, పైపుల హస్తాల్ని గుంటల గర్భాల్లోకి జొనిపారు.

పాలకోసం వెంపర్లాడే పసిపాపల్లా ఆరాటపడ్డారు జనమంతా. ఇంజన్లున్న వాళ్లను బంగపడ్డారు. ఎండిపోయే పైరును చూసి లబలబలాడారు.

మొదటిసారిగా తూమెత్తిన వాణ్ని ఎలుగెత్తి తిట్టారు.

తనప్పుడు బాగా తిరుగుతగాందేది.

చేసికాడికెళ్లి వాళ్ల అవస్థను చూసి బాధపడేది.

ఇంజన్ల గొంతెత్తి వారం రోజులు భోరుమంటూ ఏడ్చింది చెరువు. పైరు రెండవసారిగా చెరువు గుండెల్లో రక్తాన్ని కూడా పీల్చి పొట్టదాన్ని చేసింది.

మరో వారానికే రైతులంతా ఆలోచనల్లో పడ్డారు. పైకెగజూసే

> 1950 - 65 మధ్యయుగం, సువర్ణయుగం, మూడు తరాల రచయితలు - త్రివేణీ సంగమం లాంటి యుగం. కళ్యాణ సుందరి జగన్నాథం - గొప్ప కథారచయిత్రి. అనుభూతి అంటే ఏమిటో - ఆమె కథల్లో ప్రస్ఫుటంగా చూడవచ్చు. — మధురాంతకం రాజారాం

కొర్డీ ఆకాశం ఖాళీ చేతుల్తో వెక్కిరించటం ఎక్కువైంది. మనస్సంతా ఆరాటంగా వుంది. కాయలు ముదరొచ్చాయి. నోటికాడి కొచ్చిన పైరు.

'పీక్కునేందుకయినా గొర్రుసాలు చినుకులు పడితే' ఆశగా ఎదురు చూస్తున్నారు.

వానొచ్చేట్టు లేదు. నీళ్లుదారి కనబడేట్టు లేదు.

భూమిలోని కాయలు బైటకెట్లా రావాలి?

చుట్టుపట్ల నీటి ఆధారం లేదు. ఉన్న ఒక్క బోరు బావి నర్సింహారెడ్డిది. దానికి బాగా గిరాకీ పెరిగింది. రైతులంతా అక్కడ తేనెటీగల్లా మూగి వున్నారు.

ఎకరాకు మూడొందల వంతున బేరం కుదిరింది.

చాలామంది రైతులు పూరట చెందారు.

తమ చేను జ్యోతి వాగు గట్టునే వుంది. వాగులో పెద్ద గుండం వుంది. మొన్నటిదాకా చెరువులో నీళ్లుండటం వల్ల ఆ గుండం ఎండిపోలేదు.

తన కొడుకు, మనవళ్లు గుండానికి ఇంజన్ బిగించి నీళ్ళేస్తున్నారు.

మాపటేల అక్క కొడుకు రంగన్న వచ్చాడు.

'' చేనెండిపోతాంది. మీగుండంలో రవ్వన్ని నీళ్లియ్యరాదంటరా!'' అడిగాడు సుబ్బన్నను.

'' మాకు సరిపోను మిగుల్తే దానికేం బాగ్గెం? అట్టనే యేసుకొందూతే.'' చెప్పాడు సుబ్బన్న.

మర్నాడు పొద్దున్నే మళ్లీ వచ్చాడు రంగన్న.

'' గుండంలో నీళ్లయిపోతాండయి. ఒక కయ్యాన్నా తడుపుకోనీరాదూ!'' అడిగాడు.

'' మా సేను ఎండబెట్టుకోవాల.'' మొహమాటం లేకుండా చెప్పాడు సుబ్బన్న.

'' ఒక్కింతు నీళ్లియ్. యిత్తనాలన్నా దక్కుతాయ్.'' బంగపడ్డాడు.

సుబ్బన్న ఒప్పుకోలేదు.

రంగన్నకు ఓపిక చచ్చినట్లుంది 'గుండం ఒకరి సొత్తేమీకాదంటూ' వినవిసా వెళ్లాడు.

తనకేమీ చెప్పేందుకు పాలుపోలేదు.

పూర్వం నించీ ఆ గుండాన్ని వాడుకొనేది తమవాళ్లే. ఇసుక మేట వేస్తే పూడిక తీసేవాళ్లు. జంబు కోసేవాళ్లు. ఎవరయినా చేపలు పట్టుకొంటే సగ భాగం తీసికొనే వాళ్లు.

అవతల అక్క కొడుకు.

ఇవతల తన కొడుకు.

పాపిష్టి కరువు గాలం. గలభా పెట్టుకొంటారేమో? సమయానికి తన పెద్ద మనవడు శీను ఇంటివద్ద లేనిది కూడా ఒకందుకు మంచిదే. వాడొట్టి ముక్కోపి.

పొద్దు వాటాలు తుండగా చేనికాన్నించి చిన్న మనవడు చంద్ర వగరిస్తూ పరుగెత్తుకొచ్చాడు.

అప్పుడే బస్సుదిగి కాళ్లు మొగం కడుక్కొని పళ్లెం ముందు కూచుని వున్నాడు శీను.

'' అన్నా!--- నాయన్ను పెదనాయినోల్లు కొట్టిన్రు. తలకాయ పగిలింది. నేలబడిండు----'' ఇంకా ఏదో చెప్పబోతున్నాడువాడు.

పళ్లెం ముందునించి చివాలున లేచాడు శీను. చెప్పులేసుకొని మూల నున్న కర్ర అందుకొని గడప దాటాడు.

తను '' ఒరే-- ఒరే--'' అంటూ ఆందోళనగా అరుస్తోంది.

తన పిలుపు విన్పించుకోలేదు.

అటో ఇటో తేలంది వాడు వెనక్కి రాడు. ఖాయంగా కొట్టుకుచస్తారు.

తనకేమీ పాలుపోలేదు. కాళ్లు చేతులు ఆడలేదు. మెల్లగా ఓపిక తెచ్చుకొని బైటకు నడిచి వాళ్లను వీళ్లను కేకేసింది. బావురుమంటూ విషయం చెప్పింది.

చాలామంది ఆడ మగ జ్యోతివాగు కేసి పరువెత్తారు.

పదిరే శరీరంతో తనూ కదిలింది.

పోలేరమ్మ చేను దాటబోయే సరికి జనం వెనక్కి వస్తూ కన్పించారు.

అందరూ ఆందోళనగా వున్నారు.

ఆత్రుత పడుతున్నారు.

'' ఏం జరిగింది నాయినా?'' అడిగింది.

ఇద్దరు ముగ్గురు పలుకలేదు.

ముత్రాను పిచ్చన్న చెప్పాడు'' మీ అక్క కొడుకు రంగన్ననూ్న ఆయన కొడుకునూ మీ శీనయ్య తలకాయలు పగలగొట్టిండు'' అంటూ.

'' మా సుబ్బన్న--- ?''

'' పలకడం లే.''

కుప్ప కూలపోయింది తను.

ఎవరో భుజానేసుకెళ్లారు. ఇంటి కాడ మంచంమీద పడేశారు.

మాపటేలకు ఎలాగో తంటాలు పడి నర్సాపురం ఆసుపత్రి చేరుకొంది.

అప్పటికే తెలిసింది ఇరుపక్కలా కేసులు పెట్టుకొన్నారని.

చిన్న మనవణ్ని అడిగింది'' కేసెందుకు పెట్టిన్రూరా?'' అని.

'' పెట్టకుంటే?--- వాళ్లు ముందు కేసుబెడ్తే మన కిబ్బంది గాదూ!'' చెప్పాడు వాడు.

'' ఎవురు సెప్పిన్రారే యీ కూలిపొయ్యే ఉపాయం?''

'' పెద్దిరెడ్డి మామ. ఆయనే దగ్గెరుండి కేసుబెట్టిచ్చిండు.''



దీర్ఘంగా నిట్టూర్చింది తను. బాధేసింది. 'ఈ పక్క పెద్దిరెడ్డి నిలబడిండంటే ఆ పక్క రామిరెడ్డి కొమ్ము కాసుంటాడు. ఈ ఉపాయమే వాళ్లకూ సెప్పుంటాడు. ఇద్దరికీ బాగా ఎగదోసుంటారు. నిప్పుల్లేకుండానే కొంపలు కాల్చుతరు.''

ఇద్దరి మధ్యనా చిచ్చుబెట్టేందుకు ఇన్ని యేండ్లకు వాళ్లకు అవకాశం చిక్కింది.

ఈ కేసులు ఇప్పుడిప్పుడే వొగ దెగవు.

రాత్రయింది.

ఆసుపత్రి వరండాలో ఒక మూల ఏడుస్తూ కూచుని వుంది అక్క. తనూ రెండో వైపు కూచుంది.

గుండెల్లో తుమ్మముల్లు గుచ్చుకొన్నట్లుగా వుంది.

అక్కా చెల్లెల్లుగా ఇన్నిరోజులూ ఎంతో అన్యోన్యంగా సంసారాల్ని గడుపు కొచ్చారు తాము. తమ కొడుకులూ, మనవళ్లూ ఒకరిమీద మరొకరు చూపించుకొనే ఆప్యాయతలకు, అనురాగాలకు మురిసిపోయారు.

కాటికి కాళ్లు చాచిన సమయంలో ఎదురైన యీ కష్టాన్ని భరించాలంటే సాధ్యం కాకుండా వుంది.

తెల్లార్లూ మౌనంగా రోదిస్తూనే గడిపారు తాము.

ఒకర్నొకరు ఓదార్చుకోలేని పరిస్థితి.

రోజులు గడిచే కొద్దీ ఒంటిమీది గాయాలు మానాయి, నీళ్ల తడిలేక పైర్లు ఎండాయి, నీటి గుండాలు వొట్టి పోయాయిగాని ద్వేషాలు యింకిపోలేదు.

చెరొక నాయకుణ్ని వెంటేసుకొని లాయర్ల చుట్టూ తెగతిరిగారు - రంగన్న సుబ్బన్నలు. లాయర్ల చేతులు తడిపేందుకు తమచేతుల్లో తడారి మరొకరి వద్ద చేతులు చాచారు.

కూతురి పెళ్లికని కొనిపెట్టిన బంగారాన్ని తృణప్రాయంగా అమ్మేశాడు రంగన్న.

నిరుటి సంవత్సరం పెద్దిరెడ్డితో పోటీ పడి కొన్న అర్ధెకరం మడి కయ్యను అనలుకు తగ్గించి అతనికే వదిలాడు సుబ్బన్న.

ఇరువైపులా పౌరుషాలు నింపుతున్నారు యింకా.

తొలకరింపు లొచ్చాయి.

సేద్యాలు మొదలయినాయి.

కేసులు వాగదెగలేదు. కోర్టుకు తిరుగుతూనే వున్నారు.

మృగశిర కార్తెలో పెద్ద ఆవడి గాలులొచ్చి మహావృక్షాల్ని సైతం వేర్లతో సహా లేపేశాయి.

రంగన్న సుబ్బన్నల పరిస్థితి కూడా అలాగే వుంది.

పునర్వసు వెళ్లుదలకు మళ్లీ ఒక వర్షం కురవటంతో గొర్రుతోలి గుంటిక పాసి పెట్టుకొన్నారు రైతులు.

చెనక్కాయల్ని చేటల్లో పోసికొని కసాలుగా వొల్చుకొంటున్నారు. రాత్రిళ్లు సైతం రచ్చ బండలమీద చెనక్కాయల బుట్టల్తో కూచునే యవ్వారం చేస్తున్నారు.

పెట్టుబడులకు బరువై పాస్పేటు వగైరాలు అప్పుదెచ్చాడు సుబ్బన్న.

ఎలాగయితే నేం నేలలో విత్తనాలు పడ్డాయి.

ఏదొక వానను చూసి విత్తటం---పెట్టుబడినంతా మట్టిలో వొలకబోయించి మేఘాలు తమాషా చూడటం మామూలైంది.

తన కొడుకు సుబ్బన్న పరిస్థితి బాగా దిగజారింది. రంగన్నక్కు ఇంతకంటే అధ్వాన్నంగా వుందట. వాయిదా వాయిదాకు తమ జేబుల్ని లోతుగా తడిమే లాయర్ల చూపులకు వొణక్కి పోతున్నారుట యిద్దరూ.

అన్నదమ్ము లిద్దరూ కలసి మెలసి సుఖంగా బతకటం కన్ను కుట్టిన గ్రామ పెద్దలకు ఇప్పుడు ఆనందంగా వుంది.

కొడుకును చూస్తేంటే తనకు బాధగావుంది.

ఒక్క పూట సిల్లాదిలుంటే ఇంత గొడవ ఉండకపోను. రంగన్నేం పరాయివాడు కాకపోయే. తన స్వంత అక్కకొడుకే.

'' ఏమ్మా కూకోనుండవ్ ? ''

ఆలోచనల్లోంచి తేరుకొని ఉలిక్కిపడి చూసింది చెన్నమ్మ.

ఎదురుగా కొడుకు.

'' ఏం లేదు నాయినా! నిద్రబట్టలే '' చెప్పింది.

'' సేతి కడేలడిగినానని సింత బడ్తాండవా అమ్మా! వొద్దులే. నేనే యాన్నోసోట తంటాలుబడ్తా.'' చెప్పాడు.

'' ఎందుకొరే యీ అగసాట్లన్నీ ? '' బాధగా అంది.

'' మనం కేసు గెల్సొద్దూ ? ''

'' గెల్సకుంటేం ? ''

'' వాళ్లు గెలుస్సే నలుగుర్లో మనం తలెత్తుకొని తిరుగుతామా '' అంటూ తన మంచం కేసి నడిచాడు.

ఆవేదనగా నిట్టూర్చింది ఆమె.

మెల్లగా మంచం మీద వొరిగింది. చీకటి ఆకాశంలోకి చాలాసేపు అలాగే చూస్తూ గడిపింది. కంటిమీదకు నిద్ర రాలేదు. ముంజేతి కడియాలు తలకింద వొత్తుకొంటున్నాయి.

ఆకాశంలో స్వర్గంబాట అస్పష్టంగా కనిపిస్తోంది.

తలకింది చేతుల్ని ఎదలపైకి తెచ్చుకొని కడియాల్ని తడువుకొంది. అవి రెండూ రెండు బండి చక్రాలై స్వర్గం బాట మీద ఏవో ఆలోచనల్ని యీడ్చుకెళ్తున్నట్లుగా అనిపించి మెల్లగా లేచి కూచుంది.

కొడుకు మంచం మీంచి గురక వినిపిస్తోంది.

చేతులకున్న కడియాల్ని బైటకు లాగింది. పైట కొంగులో ముడేసు కొని భద్రపరచుకొంది. మంచం మీంచి లేచి ఊతకర్ర అందుకొంది. కళ్లు తిరిగినట్లనిపించి కొద్దిసేపు అలాగే నిల్చుని తర్వాత కదిలింది.

చిమ్మ చీకటిగా వుంది. ఏమీ కనిపించటం లేదు. అలవాటు వద్ద దారిగాబట్టి కొంత దూరం ముందు కెళ్లి దక్షిణపు వీధిలోకి తిరిగింది.

నక్షత్రాల కాంతి పల్చగా జారుతోంది. రంగు మిద్దెలు అస్పష్టంగా కనిపిస్తున్నాయి. నడక వూత కర్రమీద సైతం భారంగా వుంది. ఆయాసంగా వుంది.

నర్సిహ్మారెడ్డి ఇంటిముందు కొచ్చింది. వీధికి మరోవైపున్న పిచ్చన్న కొట్టం ముందటి అరుగుమీద ఉస్సూరు మంటూ కూలబడింది.

నర్సిహ్మారెడ్డి ఇంటికి బలమైన ప్రహరీ వుంది. గొడ్లు గోదా అంతా లోపలే.

'' యాడే - యాడు జేసిన తిరగడే యిదెంతా. '' కసిగా అనుకొంది ఆ యింటి కేసి చూస్తూ.

బొడ్లోని అడపం తీసి ముడి విప్పింది. ఒక అరలోంచి దంచిపెట్టుకొన్న వక్కాకు తీసి నోటబెట్టుకొంది. మరో అరలోంచి సున్నపు పొడిని రెండు వేళ్లతో పట్టి నోట రాల్చుకొంది. అడపం చుట్టి మళ్లీ బొడ్లో దోపుకుంది. ఊత కర్ర అందుకొని లేచి మెల్లిగా నడక సాగించింది.

వెళ్తూ వెళ్తూ వెనక్కి తిరిగి నర్సిహ్మారెడ్డి మిద్దెకేసి చూస్తూ మెటికలు విరిచింది. '' నీ వంశంగూల '' అంటూ తిట్టింది.

దీనికంతటికీ కారణం వాడే.

ఈ యేడుకూడా నిరుటిలాగే వుంటుందని రైతులు భయపడ్డారు.

రంగన్న సుబ్బన్నల పరిస్థితి చూస్తున్నారు. కాబట్టి ఎవరూ తొందర పడ కూడదని నిర్ణయించుకొన్నారు. దొంగ వూత పూసేదాకా ఎవరు ఏమైనా అపరాధం కట్టటాని కూడా తీర్మానించుకొన్నారు.

కొన్ని కట్టుదిట్టాల్లో కూడా

ఒకనాటి ఉదయం చెరువుకింద కలకలం చెలరేగింది.

తూమెత్తేరుట, చేనికి నీళ్లేసేరుట.

ఆ చేను బాలయ్యది.

అందరూ అతని మీదకు దండెత్తారు.

బిత్తర పోయాడు బాలయ్య. కుయ్యో మొర్రో అంటూ ఏడ్చాడు తనకేమీ తెలీదన్నాడు.

అతనికి తెలీకుండా అతని చేనికి ఎవరో వచ్చి నీళ్లెందుకు వేస్తారో తలబద్దలు కొట్టుకొన్నా అర్థం కాలేదు ఎవరికీ.

బాలయ్య ఏడుపులు పెడబొబ్బలు చూసి అతన్ని దోషిగా నిలబెట్టలేక పోతున్నారు. తొందరపడి మరొకడు, ఇంకొకడు నీళ్లేయనందుకు ఓ వైపు సంతోషిస్తున్నారు.

వివరాల కోసం ప్రయత్నించారు.

గొడ్ల కాపర్లు ఓ విషయం చెప్పారు. తాము గతరాత్రి గొడ్ల వద్ద కెళ్తోంటే ఒక మనిషి కంగారుగా బాలయ్య చేలో కన్పించాడనీ, కాలువలో నీళ్లు పారుతున్నాయనీ, ఆ మనిషి నర్సిహ్మారెడ్డి కూలోడనీ.'

రైతులకు మొదట అర్థం కాలేదు.

నర్సిహ్మారెడ్డి తూమెత్తించి బాలయ్య చేనికి నీళ్లేయించటంలోని చిదంబర రహస్య మేమిటో ఎవరికీ బోధ పళ్లేదు.

నిదానంగా ఆలోచించిన మీదట అతని కుట్ర అర్థమైంది.

నిరుడి సంవత్సరం చెరువు నీళ్లు అయిపోయి చివరి తడికి నర్సిహ్మారెడ్డి బోరుబావి మీదనే రైతులంతా ఆధార పడట్టం వల్ల అతనికి దగ్గర దగ్గర యాభైవేల రూపాయల్దాకా ఆదాయ మొచ్చింది.

ఈ సంవత్సరం కూడా అదే ఉపాయాన్ని ప్రదర్శించాలనుకొన్నాడు.

రైతులంతా ఆగ్రహంతో ఊగిపోయారు గాని ఏమీ చేయలేక పోయారు. మిట్టపల్లి రంగన్నవాళ్లి పల్లె



రెండు ముక్కలుగా విడిపోయిన రైతు కుటుంబాల అనైక్యత నర్సిహ్మారెడ్డికి లాభించింది.

'వాని మూలంగానే తామింత ఇబ్బందుల పాలయింది.

దీర్ఘంగా నిట్టూర్చింది చెన్నమ్మ.

వీధి మలుపులోని నాలుగంకణాల కొట్టం ముందాగింది.

వరుసగా మంచాలున్నాయి.

తడువుకొంటూ వందిరికింది మంచం వద్ద కెళ్లింది.

అక్కడ మరీ చీకటిగా వుంది.

కర్ర మీద వొంగి మంచం మీద మనిషిని చేత్తో తట్టి లేపింది.

"ఎవురూ ?" అంటూ లేచిందామె.

"నేనేలే!' చెప్పింది చెన్నమ్మ.

స్వరాన్ని గుర్తుపటింది ఆమె 'నువ్వంటనే అమ్మీ!" అంటూ లేచి కూచుంది. "యియ్యాల కాడొచ్చి నవ్. రాయీరప్పా తట్టుకొని కింద బడ్తే ఏం గావాల!" అంది.

"కాలో సెయ్యో యిరిగితే మంచంలో బడ్తా. నాక్రోజులు కూడు నీల్లుగ్గబడ్తే పినాలు బోతయ్. యీ పాడులోకం సూసేదాద తప్పుద్ది." చెప్పింది.

"సాల్సాల్లే." మందలించింది ఆమె. "కూకో." అంది.

"ఏమొంద్దో. ఇంటికి పోదాంర్రా!"

మెల్లిగా లేచి వెల్తోంది ఆమె.

ఈ గుసగుసలకి నిద్దరలేచిన రంగన్నకు మెలకువ వచ్చింది. ఇంట్లో

కెళ్తోన్న ఇద్దరు తల్లుల్ని చూసి ఆశ్చర్యపోయాడు. బుడ్డి ముట్టించి అరుగ్గోడమీద పెట్టి దాని ముందు నిల్చుని వున్న ముసలాళ్ళద్దర్ని అబ్బురంగా చూస్తూ లేచి కూచున్నాడు. మెల్లిగా : కట్టెకి నడిచాడు.

"అక్కా! యియిగో — యియ్యాల యిదిస్తో ---' కొంగు ముడి విప్పి ఆమె ముందుకు చాస్తూ అంటోంది చెన్నమ్మ.

"యేంటియ్యే..?"

"నాసేతి కడేయలే."

"ఎందుకూ ?" విస్తుబోతూ అడిగింది.

"యియిదీనుకోని రంగన్నకు జెప్పి కేను కొట్టేయించమను.".

"యాందమ్మే నువు జెప్పేది ?"

"యీ కడేలమ్మి లాయరుకిస్సే రంగన్నోళ్లకు సిచ్చేయిన్నడంట. లాయరు జెప్పిండని మా నబ్బిగాడన్నెడు. నా సేతి కడేలమ్మి ఏనాబట్టల బొక్కన్నో కొట్టి రంగన్నకు సెర్ల జేసేది నాకు నచ్చులే. ఆ కడేలు మీకిస్సే 'అసలు కేసే లేకుండా కొట్టేయించరా' అని వచ్చినా. ఇద్దర్లో ఎవురికి సిచ్చె బడినా నేన్దట్టుకోలే నక్కా! ఎవురూ ఓడొద్దు. ఎవురూ గెల్సొద్దు. ఓడినా గెల్సినా 'పగ'లు కలకాలముంటయ్. యాడికే సంసారాలు నాశినమైనయ్." అక్కా! నీకు దండంబెడ్తా. యీ కడేల్దీనుకొని కేను కొట్టేయించమను." అంది కడియాలను అక్కచేతిలో పెడుతూ గద్గదంగా.

ఆమె నిలువునా కరిగిపోయింది. "అమ్మో! ఎన్ని కష్టాలొచ్చినయే తల్లీ!" అంటూ చెల్లెల్ని వాటేసుకొని బావురుమంది.

చూస్తోన్న రంగన్న గుండె కూడా చెమ్మగిల్లింది. ఎండిపోతోన్న తమ బతుకుల మీదికి చివరితడిలా ఆమె వచ్చినట్లనిపించింది.

కడియాలను అందుకొని చెల్లెలి చేతులకు తొడుగుతోన్న అమ్మకేసి తడికళ్లతో చూశాడు రంగన్న ●

# రహస్యాన్ని అన్వేషిస్తూ

– సౌభాగ్య



కిటికీ తో దృశ్యం మాట్లాడుతుంది.
పాటల నదుల్లో మునకలేస్తున్న వాళ్ళు ఏ వంలకూ లొంగరు
అన్ని ఋతువుల్లో చిగురించే చెట్టు అందరిదీ
పట్టుకుందామన్నా దొరకని పిట్ట తలపైనే గూడు కట్టుకుంటుంది.
మంత్ర జలంతో రాళ్ళకి చలనం కలగడమూ,
విద్యుద్ఘాతంతో వచ్చని చెట్టు పాలిపోవడమూ
ఒకే పెట్టెలో దాచుకున్న రహస్యాలు
రహస్యం పొత్తిళ్లలో పాట కేరింతలాడుతూనే వుంటుంది.
మూసిన కళ్ళ వెనక వెలుగు నీడలు నిశ్చల దీపం చుట్టూ నిర్మల
ప్రదక్షిణం చేస్తాయి.
దృశ్యాల్ని మోస్తున్న వాళ్ళకు ద్వారాలు తెరుచుకోవు
అజ్ఞాత నిక్షేపాలకు రహస్యాలు పహారా కాస్తాయి
నిద్రని అల్లుకున్న పట్టు పురుగు పారవశ్యం నీకూ నాకూ తెలుస్తుందా?
తమస్సు వెనకున్న తపస్సు నిష్కామ నిసర్గమే!
కళ్ళు మూసినప్పుడే స్వప్న ద్వారాలు తెరుచుకుంటాయి
పర్వతాలకి నదులు బిగించి పాటని మీటుకునే వాడి ప్రయత్నాల్ని
పసికట్టడం సాధ్యమా?
ఆకాశాన్ని డప్పు మోగించి కాంతిని శబ్దించే వాళ్లే కనిపెట్టడం సాధ్యమా?
నిర్మల సరస్సుని రాయితో గాయపరచొద్దు!
వాడి బాణాలు కలువలై వికసిస్తున్న ప్రక్రియకి విఘాతం కలిగించొద్దు!
దీపాల్ని ఆర్పుకుంటూపోతే నువ్వూ ఆరిపోతావు సుమా!
మూసిన కళ్ళపై నిశ్శబ్దాన్ని మేలిముసుగులా కప్పు

కిటికీ లోంచి ఒక్క నక్షత్ర కిరణాన్ని అనుమతించు
ఒకే ఒక్క వెన్నెల గీతాన్ని అనుమతించు
ప్రపంచాన్ని ఓదార్చడానికి, ప్రతిరోజూ వొచ్చే రాత్రిని ఓదార్చడానికి
ఒకే ఒక్క నిట్టూర్పుని అనుమతించు ●

# నైరాశ్యం

– ఉప్పల నరసింహం

చాలాకాలం తరువాత కథ వ్రాయాలని కలం అందుకొని, కాగితాలు ముందు పెట్టుకొని, అలవోకగా కళ్ళుమూసుకున్నాను... ఈసారి నా '' కంఠస్వరం'' కొంత మారగలదని నాకే తెలుస్తోంది. కంఠస్వరం మారడం ఓ రకంగా మంచిదేనని కూడ మనసు చెబుతోంది. ఈ కంఠస్వరం ఎలా ఉంటుందో మాత్రం స్పష్టంగా తెలియదు... కాని చాలాకాలంగా ఈస్వరం బయటకు రావడానికి ప్రయత్నిస్తోంది. అయితే నేనే అంతగా అవకాశం ఇవ్వలేదు. ఈ కంఠస్వరానికి అసలు గుర్తింపు ఉంటుందో, ఉండదో అన్న మీమాంస చాలాకాలంగా ఉంది. ఆ తర్జన భర్జన నాలో నేనే పడుతున్నాను. ఇప్పుడు ఆ కంఠస్వరానికి స్వేచ్ఛ నివ్వకపోతే ఊపిరి ఆడటం కష్టంగా మారింది. అందుకే ఆ కంఠస్వరం వెలువడటానికి అవకాశ మివ్వాలని సంకల్పించి కలం పట్టుకున్నాను. కళ్ళుమూసుకుని తలను అలా వెనక్కి వాల్చాను.

మనసు తెరపై అనేక ఆకృతులు కదలాడసాగాయి. ఆ ఆకృతుల్లో గాఢత ఎక్కువగా ఉంది. ఆ ఆకృతులు కదలాడగానే వింత అనుభూతి చోటు చేసుకుంది. ఆ గాఢత ఉత్తేజాన్ని ఇవ్వసాగింది. నరాల్లో బలాన్ని నింప సాగింది. ఊహాపథంలోని ఆ ఆకృతులు నన్ను ఆవహించగా కొన్ని క్షణాల సమయానికైనా ధైర్యం సాహసంతో నిండిన భావం గుండె నిండా నిండిపోయింది. ఉత్ప్రేరకంలా పనిచేసింది.



ఆ ఆకృతులలో ఒక దానికొకటి సంబంధం లేదు. భిన్నత్వంలో ఏకత్వంలా అవి ఒక విషయాన్ని అంతసూత్రంగా తెలియజేస్తు న్నాయి. అవి నైరూప్య చిత్రాలు, అంతేకాక ఆధునిక జీవన శకలాలు. రక్తమాంసాలతో సజీవంగా ఉన్న రూపాలు. వాటి హావభావాలు, చేష్టలు నిండుగా కదులుతున్నాయి.. మెదడు నిండా ఓ క్రొత్త ఉత్ప్రేరకం, కొత్త ఉత్తేజం ఓక్షణం మెరిసింది.

ఈ మనను తెరపై ఎన్నెన్ని ఇంద్ర ధనస్సులు వెలగగలవు. మరెన్ని విస్ఫోటాలు జరగగలవు. అని నా ఆరవ జ్ఞానేంద్రియం త్రుటికాలం మూర్ఛనలు పోయింది. మరుక్షణం మనను తెరపై అంతర్ దృష్టిని సారించాను....

ప్రొద్దుతిరుగుడు పువ్వు వయ్యారంగా తలవూపుతోంది. పువ్వు పసుపుపచ్చని రేకులకన్నా పుప్పొడి ఉండే భాగం నల్లగా, మరీ కారునలుపుగా కనిపిస్తోంది. ఆ పుప్పొడి పైనే కెమరాను 'జూమ్' చేస్తే కనిపించే స్పష్టత, గాఢత కనిపించ సాగింది. అదేమిటోగాని చలన చిత్రంలోని ప్రేముల మాదిరి ఆ దృశ్యం కదులుతూ ఉంది. ఆ అనుభూతే కలుగుతోంది. అక్కడ కీటకాలు, ఆ గాలి, వాతావరణం నా పంచేంద్రియాలపై పనిచేస్తోంది. ఆ వాసన, ఆ తేమ, ఆగాధత.... సుషుప్తిలోకి వెళుతున్నానా అన్న స్పృహ కలగగానే సంభ్రమాశ్చర్యా లతో క్షణంసేపు కళ్ళు తెరిచాను.

ఫిలిం 'కట్' అయినట్టు, ఆకృతులు తెగిపోయినట్టు అయింది. బాహ్య ప్రపంచం కళ్ళముందు..... ఎదురుగా బల్ల, పుస్తకాలు, కాగితాలు, గోడకు దుస్తులు, క్యాలండర్ అతికిం చిన అందమైన గ్రీటింగ్‌కార్డు, పాయ్యింట్స్లో నుంచి ప్రాత్రల చప్పుడ్లు, టి.వి.లో సీరియల్, బయట ఎవరో మాట్లాడుతున్న చప్పుడు, రోడ్డుపై స్కూటర్ వెళుతున్న శబ్దం. ఎవరిం ట్లోనో టేప్‌రికార్డర్‌లో పాతపాటలు, చంటిపిల్ల ఏడుపు, పిల్లల కేరింతలు, కూరగాయలు అమ్మే వ్యక్తి అరు పులు..... ఇలా ఏవేవో ధ్వనులు, దృశ్యాలు....

ఈ క్షణంలో 'కథ' ముఖ్యం కాబట్టి మనసును బాహ్యప్రపంచం రణగొణ ధ్వనులపై కేంద్రీకరించ కుండా రచన నిమిత్తం తిరిగి కళ్ళు మూసుకున్నాను.

ఫోకస్‌లోకి రెండవ దృశ్యం వచ్చింది. ఓ లేగదూడ తల - చెవులు రిక్కించి నా కళ్ళలోకే తీక్షణంగా చూస్తోంది. దాని కళ్ళు ఎంతో తేజంతో నిండి ఉన్నాయి. నల్లగా ఆకర్షణీయంగా గుండ్రంగా ఉన్నాయి దానికళ్ళు. అంతటి తీక్షణ చూపులుగల ఆ కళ్ళల్లో తేమ కనిపిస్తోంది. దాంతో చూపుల గాఢత పెరిగిందని పిస్తోంది. ఆ లేగదూడ అలాగే చూస్తూ ఉంది. విస్తుపోయి చూస్తోంది. ఆవెంటనే నా మనసు తెరపై నల్లటి ఆవుతల అగుపించింది. అది దీనంగా నాకేసి చూస్తోంది. ఆ చూపుల్లో తనపట్ల తనకే జాలికలుగుతోందన్న భావన

> కథానికకు వస్తువెంత ముఖ్యమో, శిల్పం అంతే ముఖ్యం. మానవ జీవితాన్ని ఎంత సునిశితంగా పరిశీలిస్తాడో, అంత మంచి వస్తువు వస్తుంది. గొప్ప సాహిత్యాన్ని ఎంత శ్రద్ధగా భక్తితో చదివితే, కథకి అంత గొప్పగా శిల్పం అవగాహన వస్తుంది. శిల్పమనగా కథ చెప్పేటటు వంటి విధానం
>
> — మధురాంతకం రాజారాం

కళ్ళు మూసుకున్న తడవుగానే పొడవైన కురులు... అది నల్లటి జుట్టు - ఓ స్త్రీ తల కదుపుతూ ఉంది. స్లోమోషన్‌లో కనిపిస్తోంది. ఆమె ప్రౌఢస్త్రీయా ? బాలికా ? యువతా ? తెలియదు. కేవలం జుత్తుమాత్రమే నల్లటి అలలు మాదిరి కదులుతూ ఉంది. ఆ కదలికలోని లయ, విన్యాసం, తీరు హృదయానికి హాయి గొల్పుతూ ఉంది. ఒక కోణం నుంచి గాక పలుకోణాలనుంచి స్లోమోషన్‌లో అతల మనను తెరపై కదులుతూ ఉంది. కన్నుల పండువగా ఆజుత్తు కదలాడుతోంది. నాట్యమాడుతోంది. సోయగాలు పోతోంది.

అలా కొన్ని ఘడియలు గడిచాయి.

మనను తెరపైకి మరో దృశ్యం ఫేడ్ ఇన్ కాసాగింది. నల్లటి జుట్టు ఫేడ్ ఔట్ కాసాగింది. క్రమంగా కదులుతోంది. కళ్ళు ఊసులకోసం వాలుతున్న దోమల్ని చెవులతో తోలుకుంటూ దీనంగా ఆవు..... అంతలోనే ఆఫ్రికా బాలుడి దీనాతి దీనమైన మొఖం తక్కువ వెలుతు రులో చిత్రీకరించినప్పటి ఛాయా చిత్రం కనిపించింది. ఆబాలుడి కనుపాపలు, పళ్ళు మాత్రమే తెల్లగా, జుట్టు, శరీర ఛాయనల్లగా నిగనిగలా డుతోంది. తక్కువ వెలుతురువల్ల మరింత నల్లగా పోతపోసినట్టు అగుపి స్తున్నాడు. ఆ చూపులనిండా బాని సత్వ ఛాయలు, వారసత్వంగా వచ్చిన పేదరికం ఎదిరించలేని గుణం ఆముఖ కవళికల్లో స్పష్టంగా కనిపిస్తోంది. తరతరాల వెట్టిచాకిరికి తాజా ఉదాహ రణంగా నిలిచాడు....

అనంతరం కాటుకతో ఓస్త్రీ కళ్ళు. కొన్ని క్షణాలు రెప్పలు టపటపలా డించి కనుమరగయ్యాయి. ఆ వెంటనే

నల్లటి సీతాకోకచిలుక గడ్డిపూలపై ఎగురుతూ ఉంది. ఓ పువ్వుపై వాలివాలకుండా అక్కడే తిరుగుతూ ఉంది. నల్లటి రెక్కలపై అక్కడక్కడ ముక్కలు.... అందంగా కత్తిరించిన ట్లున్న ఆరెక్కలు నల్లగా నిగనిగలాడు తున్నాయి. ఆ తరువాత కామెల్ ఇంక్‌తో ఓ చిత్రకారుడు గీసిన 'ఊబి' గుంట.... ఆ నల్లటి ఊబిలోకి ఏదో ప్రాణి కూరుకు పోతోంది....

ఇదంతా 'మాంటాజ్'లా మనసు తెరపై కదులుతూనే ఉంది. ఆ కదలికలో లయ ఉంది. సమన్వయం ఉంది. సమగ్రత ఉంది. దృష్టికోణం ఉంది. కళాత్మకత ఉంది. ఏ ఫ్రేమ్ ఎంత గాఢతగా కనిపించాలో అంతే గాఢతలో కనిపించసాగింది. ఆ సమతూకం అబ్బుర పరిచేలా ఉంది... ఈస్తటిక్స్, అలంకార శాస్త్రాలు, అనుభవంగల కళాకారులు, సౌందర్యోపాసకులు సాధికారికంగా చెప్పే కళాత్మకత, అల్లిక, ఆంతరంగిక సౌందర్యం, సమతౌల్యం, సంపన్నత దిగ్వీణీకృతంగా కనిపించ సాగింది.

ఎంత విచిత్రమైనది మనసు తెర. ఎన్నెన్ని చిత్రాలు ఈ తెరపై కదలాడుతూ ఉంటాయి. బాహ్య ప్రపంచానికి, ఆంతరంగిక ప్రపంచానికి ఎంత తేడా. కళ్ళు తెరిస్తే కనిపించే దృశ్యాలకు, కళ్ళుమూసుకుంటే కనిపించే చిత్రాలకు ఎంత వ్యత్యాసం. ఈ 'కాంట్రాస్ట్' దృశ్యాలకు, భావనలకు పునాది ఈ సమాజమేగా?... ఎన్నిపొరల ఆలోచనా శక్తితో మనిషి జీవిస్తున్నాడు? ఆ పొరలలోతు తెలుసుకోవడం సాధ్యమేనా? నా ఆరవ జ్ఞానేంద్రియం అప్పుడే ప్రశ్నించ సాగింది.

కాని ఎన్ని నైరూప్య ఆకృతులు నిన్ను వెంటాడినా, ఎన్ని రూపాలు మనసు తెరపై నాట్యమాడినా, ఎన్నడూ అగుపించని ఆకారాలు అగుపించినా, ఉత్ప్రేరకంలా నిన్ను ఉత్తేజపరిచే సన్నివేశం తళుక్కున మెరిసినా, మెదడు వ్యాకోచింపజేసి, నింగికి ఎగిసేలా చేసినా నీవెవరు? నీ కర్తవ్యమేమిటి? నీ లక్ష్యమేమిటి? బాల్యందాటి యవ్వనంలోకి అడుగిడి నప్పటి నుంచి ఏ అభిప్రాయాలు నిన్ను నడిపిస్తున్నాయి. ఏ విలువలకు నువ్వుకట్టుబడి ఉన్నావు? ఏ ఆశయం కోసం పాతికేళ్ళు నీ పరిధిలో నీవు కృషిచేశావు - అజ్ఞాతవాసం చేశావు. త్యాగమే తంమాణికమని తలచి అన్నింటిని బేఖాతరు చేశావు. కన్నవారు, కట్టుకున్నవారు, కష్టాలు పడుతున్నా లోకకళ్యాణం కోసం కాలుదువ్వావు. ఏ క్రమశిక్షణలో నిన్ను నువ్వు మలచుకున్నావు? ఏ ధైర్యం నిన్ను పర్వతంలాంటి అడ్డం కుల్ని అధికమింపజేసింది, ఏభావం నిన్ను జ్వ౹ంవ చేస్తోంది? సమాజంలో న్యాయం, ధర్మం, మంచితనం, మానవత్వం, సమభావం, సౌహార్ధం, త్యాగగుణం, ఔదార్యం ఏర్పడేందుకు నీవెత్తిన విలువల జండా రెపరెపలాడేందుకు మరింత గట్టిగా పట్టుకుని ముందుకు అడుగేయమని నాలోని ఆరవ జ్ఞానేంద్రియం సమాధాన మిచ్చింది.

కళ్ళు తెరిచాను... ●

# నా రాత్రి వెళ్ళిపోయింది

— మహమూద్

కుక్కల నక్కల అరుపుల్లో
నారాత్రి దాటి పోయింది.
కుతంత్రాల స్వార్థపొగల్లో
నా రాత్రి ఎగిరిపోయింది.
శాంతిపవనాలకై ఎదురుచూసి
బలహీనపడి, సిగ్గుపడి, కలతపడి
నా రాత్రి కదలిపోయింది.
వెలుతురుకై తపించి తపించి
వెన్నెల లేని గాడాంధ కారంలో
నా రాత్రి నమసిపోయింది.
కుళ్లిపడ్డ శవాల మధ్య, నలగబడ్డ శరీరాల మధ్య
కన్నీటిస్నానం చేసి
నా రాత్రి మరలిపోయింది
అసహనం మధ్య, అవగాహన లేని మతాల మధ్య
బీడు, పడ్డ మనసుల మధ్య నేనుండనని
కలతను వదిలి పాత త్యాగాల సమాధుల్లోకి
నా రాత్రి వెళ్ళిపోయింది ●

# రాత

**సడ్లపల్లి చిదంబరరెడ్డి**

సంగటి తిన్నొచ్చి వసారాలో కూకొన్న తిమ్మప్ప వక్కానోట్లో ఏస్కొని తమలపాకు తొటిమ్మ ఇరుస్తావుండాడో లేదో - నంజయ్యొచ్చె.

'' రా! నంజయ్య బావా! '' అంటాని ఆయప్పని కమ్మడి మీదికి పిలిసి,

'' ఏమేయ్! మీ అయ్యొచ్చిండాడు చెంబుతో నీళ్లిచ్చి బువ్వాపెట్టు '' అంటాని పొయ్యింట్లో పనుల్జేస్తావుండె పెండ్లామును పిలిశ తిమ్మప్ప.

'' ఏం బువ్వలే బావా! పొద్దున్నె ఏడుగంటలకి సద్దన్నం తిని యల్లబారొన్నాడు సౌలూరు, సంతేబిదనూరు తిరుక్కొని కిరికేర్లో మూవింటి కొండ్రెడ్డింట్లో కడుపు నిండ అన్నం దిని ఒస్తావుండా '' అంటాని కమ్మడి మీద కూకొనె నంజయ్య.

'' అన్నెళ్లు, ఏమప్పా శాన నల్లపూసైపోతివి! ఇంట్లో అంతా బాగుండారో? కొత్తగా బోరింగు ఏపిస్తవంట నీళ్లేమైనా పడిండివో? '' అనె తిమ్మప్ప.

'' ఏటి నీళ్లో! ఏం బాగో! తియ్ బావా? రైతులు బాగుపడేది నేతి బీరకాయ్ లేకి నెయ్యొచ్చేది అంతా ఒగిటే అనిపిస్తుంది.

అప్పుల్జేసి, పాతాళానికి బోరింగులు దింపితే ' తుబుకు ' ' తుబుకు ' అంటాని పైపులు ఉమిసినట్లు ఉదిరే నీళ్ళకి ఏం పంట్లొత్తాయి?

రేషం పులుగులు ఏమి రోగమూ లేకుండ నాలుగోజరం లేసిండివి. నీళ్లు సాలక ఆకు తక్కువ బడింది. అందుకే ఊరూరూ కాలికి బలపం గట్టుకోని తిరుగుతా ఉండా.

నా కంటే నీ బతుకే మేలనిపిస్తుంది. బాగా సదువుకో నుండే కొడుకు. కోళ్ళఫార మొగుపక్క, సేద్ది మొగుపక్క అంటాని జోబీలో నుంచి బీడీదీసి అంటిచ్చుకొనె నంజయ్య.

'' అయ్యో! నాబాగు నువ్వు గనక మెచ్చుకొంటివి. నాకేమి శని మూసుకోని కొడుకును సదివిస్తినో! వాడు ఇల్లు అనుకోడు, సేద్దిం అనుకోడు. అంతా సేద్దిగాళ్లమీద ఇడిసి పెట్టి - అదేడిదో ' అనంత అచ్చర ఇజియం ' అంట దానిపేరు జెప్పుకోని ' అయ్యా సదువుకొండి ' అమ్మా సదువుకొండి ' అంటాని ఊరూరు



సందు సందు ఎర్రోని మాదిరి తిరుగుతా ఉంటాడు'' అంటాని అంగలార్పె తిమ్మప్ప.

''మనోడు అంజప్ప శానా మంచిపిల్లోడు గదా వీడూ అట్లే తయారయ్యిండాడా?? 'కూసేగాడి దొచ్చి మేసే గాడిదను సెడిపె' అన్నట్లు - ఈ సదివిండే ఒళ్లకి సనుల్సేసేకి నదుమొంగెల్లేదు. వాళ్లు సెడింది సాలక అందర్నీ సెడిపే దానికిసూస్తారు. మనం సదవలె! మన తాతలు సదవలె! సదువులేక బువ్వ ల్లిన కుండ నచ్చిండామా యాడ న్నాను?? ఆడోళ్లు, మగోళ్ళు, నన్న జనాలు అందరూ సదువుకోవల్లంట! ఏమి కంతకు, కాళ్ళు ముంతకు, సెవులు వచ్చె కాలమప్ప ఇది' అంటాని బేజారు జేసుకొనే నంజయ్య.

పెండ్లి జేసుకోనె పాయం వచ్చింది అదేడిదో బియ్యేనో, యమ్మేనో సదివిండాడో!! ఏడిదన్నా ఉద్యోగం ఎదుక్కోరా అంటే - సేస్తావుండే సేద్దిం సాల్దా? అంటాడు. కొట్టంలో కోళ్ళుమేపేది ఉద్యోగం కాదా? అంటాడు.

కోడికూసినవుడు లేస్తాడు. దూళి దూళి మబ్బున్నట్లే సేన్లనీ సుట్టుకో నొస్తాడు. జీతగాళ్లని పిలిసి- ఒరే ఆ సేనికి నీళ్ళుగట్టు, ఈ సేనికి మందులు గొట్టు, ఆవుల్ను ఆన్నత్రికి తోలుకుపో, కోళ్ళకి నీళ్ళుపెట్టే తవడ మందులు కలుపు, ఇందూ పురం నుండి యాన్ వంపిస్తాను. తూకమేసి కోళ్ళని బెంగుళూరుకి పంపియండి. అంటాని కలెక్ట్రాకట్ల రూల్సులుజేసి పోతాడు. మాట మునిగి నవుడొస్తాడు.

పోసీ ఏడ్డయినా సంపాదిచ్చుకోని వొస్తాడా అంటే అదీలేదు!! సదివిండే ఒళ్లందర్నీ యంటేసుకోని 'మనం దుడ్లు సంపాదిచ్చే దానికే పుట్టిండేది, అన్నట్లు బతుగ్గూడదు. సూర్యే బగమంతుడు ఎవుర్నీ ఏమీ అడక్కుండానే బూపెంపచకానికి ఎలుగిస్తా వుండాడు. ఏమి ఆదాయమూ కోరకుండానే సెట్లు జనాలకి పూలు, కాయలు ఇస్తావుండాయి. జీవాలు ఇచ్చే పాలు పిండుకోని తాగతాము, అమ్ము కొంటాము అవిటికి ఏంమ్మోసి స్తాము?? - అట్లే సదువుకోనుండే మనమంతా సదువు రానోళ్లకి ఇద్యాదా నం సేయల్ల సదివిండే పెతిఒగుడూ రాతిరిపొద్దు పది మందికి సదువు సెప్పియ్యల్ల. మనూర్ని మనమే బాగు సేసుకోవల్ల'' అంటాని మీటింగులు పెడతాడు'' —

అంటావున్నట్లె ఆయప్ప పెండ్లాము సాకమ్మ లోపల్నుంచి ఒగు సేత్తో కాపీలు, ఇంగొగుసేత్తో నీళ్లు తెచ్చి — ''నోరు కదుక్కోపో అన్నయ్యా కాపీతాగుదువు'' అంటాని నంజయ్యతో అనె.

ఇద్దరూలేసి నోర్లు కదుక్కోనొచ్చి కాపీలందు కొని.

అవుదు సాకమ్మ ''పిల్లోడు ఏమి తప్పుడు పనులు సేస్తావుండాడని ఒచ్చినోళ్ల అందరి ముందర వాన్ని పల్సన జేస్తావు. పొద్దున్నే లేస్తావు ఈడపుల్లదీసి ఆడయేయవు. వాడు బుద్ధిమంతుడు గనక జీతగాళ్లని, కూలోళ్లని ఒట్టుకోని యా టయానికి ఏంపన్లు కావల్నో సేయిస్తాడు. సదువు రాకపోతే ఏమి కష్టాలొస్తాయో అందరికీ సెప్తా ఉండాడు ఇవుడు నష్టమే మొచ్చింది అంట??

బ్యాంకులో అప్పు జేసేదానికి సంతకం జేయమంటే నాకిరాదప్పా అంటా గుద్దేనా కట్ల బట్నేలు ఒప్పిత మేస్తావు. ఊర్నుండి అల్లుడు జాబురాస్తే సదువుకొనేది శాతగాక దాంట్లో ఏముందో అంటాని పిల్లోడు ఒచ్చేదంక తనకాలాడతావు. టి.బి. లో ఒచ్చే ఒగు బొమ్మిడి కుండ సూస్తావుగాని పేర్లు సదివేదిరాదు. 'ఒరే దాని పేరేమిరా?' పాపా దీని పేరు సెప్పమ్మా అంటా అందిర్నీ దేబిరిస్తావు. అంత శాతగాని బతుకులు బతికే బదులు నాలుగచ్చరాలు నేర్సుకొంటె కులానికేమన్న శెడ్డసేరొస్తుందా??'' అంటాని నన్ననన్నగ )ప్పారేశ.

ఆ మాటలకి నంజయ్య తలకాయ గిరుకోనె.

తిమ్మప్ప పండ్లిగలిచ్చి ''సూడు నంజయ్య బావా ఇదీసి సెల్లిలి వరస!! అన్నిటికీ కొదుకును యనక్కేసుకొచ్చేదే. నలభైఏండ్లు దాటిండే మనకు సదులేమిటికి? ఆ బగమంతుడు రాసిండే రాత బాగుండల్లగాని ఈ రాతలు నేర్సుకోకపోతే ఏమి? సంసారాలు సల్లగ సాగించల్ల గాని!!

ఇవుడు సూడు సెడ్ లో కోళ్లు సరిగా మేత మేయవంట. వంకసేన్లో బంగారా కట్లుండే వంకాయి సెట్లుకి పులుగులు పడిండాయి. ఇదిగో ఇందూపురం నుండి మందులు

భాషా ప్రయోగంలో చెప్పుకోదగిన మార్పు వచ్చింది. మాండలి భాషా ప్రయోగానికి ఎవరూ సిగ్గుపడటం లేదు. మాండలికాల పరస్పర అవగాహనకు విప్లవవాద సాహిత్యం చాలా తోడ్పడుతుంది.

— చేకూరి రామారా

★ మిత్రజ్యోతి సాహితీ సంస్థ, 6/24, గాంధీం ట్లు, ప్రొద్దుటూరు-516 360, కడప జిల్లా. ఫోన్ : 41630 P.P.

పంపిస్తా అంటాని పొద్దున పోయి నోడు - ఇంత పొద్దయ్యింది అతీలేదు గతీలేదు'' అంటావున్నట్లె ఒగ ఆసామి రెండు పాకీట్లుతెచ్చి ''పెద్దయ్యా ఇవి ఇందూపురం నుంచి అంజప్ప పంపిచ్చిండాడు'' అంటాని ఆయప్ప సేతికిచ్చిపాయ.

జీతగాళ్లు యాడుండారో పిలిసి మందేసి కోళ్లకి నీళ్లు పెట్టేచ్చి। అదేసేత్తో ఒగకోడికోసి బిరీన పంపియ్య శాన్నాళ్లయ్యింది అన్న యొచ్చి - నేను గక్కున (గ్రక్కున) మసాలు నూరతాను'' అంటాని సాకమ్మ కొంగు నడుములో సిక్కించుకోని ఇంట్లోకి పాయ.

''రా। బావా। అట్ల కోళ్ళ సెడ్డు దంక పొయ్యొస్తాము'' అంటాని లేసి నిలబడిన తిమ్మప్ప పంచెగ్గట్టుకోని రెండు పాకీట్లు తిప్పి తిప్పి సూసి ఒగటి సేతిలో పట్టుకోని పాయ.

కోళ్ల సెడ్డుతావుండె మనుషులు ఒగురూ పత్తాలేరు. సుట్టూరా జూశ. పేర్లుపెట్టి కూశ ఎవుడూ రాలేదు.

''సూస్తివా బావా। ఇదీయవ్వారము. అవసరానికి ఒగనా కొడుకన్నా ఉండాడేమో'' అంటాని తిట్టుకొంట వాకిల్దీసి బకీటు తీసుకోని, తొట్లో ఉండేనీళ్లు దెచ్చె. పాకీటు సింపి తెల్లగ వుండె పౌద్రు నీళ్లో కలిపె.

అది గుప్పున వాసనొచ్చె.

''ఏం బావా ఇది పులుగులు మందా కట్ల వాసన నొస్తావుంది'' అనె నంజయ్య.

''ఊను బావా ఏమి కాలమో ఇది మంచి మందులూ గబ్బు వాసన। శెడ్డ మందులూ గబ్బు వాసన అదట్లున్ని; ఈ కోళ్లు మేసే మేత జాడుపో వానెమ్మ ముక్కులో ఉండె యంటికిలుదిరిపోయే అంత శడ్డ వాసన'' అని ముకము సిట్లించు కొంట గిన్నెలోకి నీళ్లుపోసి, అవిటి మింద సిలావరి తట్లుమూసి కోళ్ల ముందర బాట్లిచ్చి పెట్టె.

కోళ్లు గొట్టగొట్న తాగబట్టె.

అంత దూరంలో కామగ సెట్టుంటె బావ బామ్మర్ది ఆసెట్టు కింద కూకొన్రి.

''ఏం బావా। ఈ కోళ్లలో ఏమన్నా లాబముందో'' అనె నంజయ్య.

'నీ అల్లుదు ఉంది అంటాడప్ప। అంతా బ్యాంకులో అప్పుల్జేసి పెట్టేందేది. ఇవుదుండే కోళ్లన్నీ అమ్మితే యాబైయ్యేలు ఒస్తుందని రాతిరి లెక్కలు గడతా ఉండె''. అంటా వున్నట్లె కోళ్లు సూసుకోనే కుంటి నరిసిగాదు ఒచ్చె.

''సెడ్డు తావిడిసి పెట్టే ఏం కాపురానికి పొయ్యింటివిరా మాదుర్ చోద్'' అంట వాన్ని గదురుకోని — బాగ బలిసిండే కోడాగిటి కోసి ఇంటికి తీసుకొని పద'' అంట పురమాయించె.

కుంటి నరిసిగాదు బిరబిర్న సెడ్డు వాకిలిదీసి లోనికిపాయ. ''అయ్యో। పెద్దయ్యా మనకోళ్లన్నీ సచ్చిపోయ్యిండాయి గదప్పా'' అంట అరుసు కొంట బయటికొచ్చె.

వానిమాట్లని తిమ్మప్ప అదిరి పాయ.

''ఒరే సరిగ్గా సూడ్రా అంజప్పన్న ఇందూపురం నుంచి పంపిచ్చిండే మందు, నీళ్లో కలిపి నేనే కోళ్లకి పెట్టింది'' ఆత్రముగా చెప్పె తిమ్మప్ప.

నంజయ్య నేలపడిండే కాలీ పాకీటుతీసి కుంటి నరిసిగానికిచ్చె.

వాదు పాకీటు మింద రాసిండే అచ్చరాలు సదివి'' యంత పరపాటయ్యింది పెద్దయ్యా వంకాయ సెట్లకేసే ఇసం మందు కోళ్లకేసిండావు'' అనె.

అవుదు తిమ్మప్ప రెండు సేతుల్తో యదయదే కొట్టుకొంట'' యంత న్యాయం సేస్తివిరా దేవుడా ? రైతులికి సదువేమిటికి ? కూల్లనాలకి సదువేమిటికి ? అంటాని ఆడిపోసు కొంటావుండే నాసేతుల్తో నా కండ్లే పొడిపిస్తివి. పిల్లోడూ పెండ్లామ్ముందర తలకాయట్ల ఎత్తుదురా స్వామీ'' అంటాని మొదులు నరికేసిన సెట్మాకట్ల నేలపడి పొర్లిపొర్లి ఏడిశ.

నంజయ్య తిమ్మప్పని ఓదారుస్తా ఉన్నట్లే ఇట్నుంచి అంజప్ప సేతిలో కోళ్లమందు తీసుకొని పారిపారి ఒచ్చె.

''మందంతా కోళ్లకేయా లేస్తివప్పా ? రవ్వంత మిగిలిచ్చి అదే సేతుల్లో నాకూ ఇంత ఇచ్చింటే తాగి సస్తావుంటి. నాలుగచ్చరాలు సదివేది నేర్చుకోక సేతి కొచ్చిండే యాబై ఏల్రూపాయల కోళ్లు తిప్పుల పాల్జేస్తివి, ఇవుదు బ్యాంకొళ్లకి ఏమని సమాదానం సెప్పల్ల'' అంటాని పొంగుకో నొస్తావుండె సంగటాన్ని బిగబట్టుకోలేక అంజప్ప 'గొళో' అంట ఏడిశ.

ఊర్లో జనాలంత ఆడ సేర్రి.

''ఇదొగిటేగాదు, సదివేది రాసేది రాక మన మెన్నో అగ్నానం పన్లు సేస్తావుండాము. యాపారస్తులు సేసే మోసాల్లో నాశనమై పోతావుండాము ఇంకన్నా బుద్ధి తెచ్చుకోని రాతనేర్చుకొని తలరాతలు మార్చు కొందాము.

తనకోసరమే కాకుండా అందరి కోసరమూ పాటుబడి ఆపత్తుల పాలయ్యిండే అంజప్పను సేత నైనంత ఆదు కొందాము'' అంట తీర్మానం సేసుకొన్రి.

అవుదు కన్నీళ్లు కారుస్తావుండే అంజప్ప కండుల్లో నల్లపలక మింద తెల్ల అచ్చరాలు మెరిసినట్ల కావంత ఎలుగు మెరిసినట్లాయ।। ●

# -జ్వాలాముఖితో ముఖాముఖి-

# రచనకు లింగభేదం లేదు...

*(ప్రముఖ కవి, 'జ్వాలాముఖి'తో యిటీవల శశిశ్రీ జరిపిన యింటర్వ్యూ. వర్తమాన సాహిత్యం, కవులలో వారి ఆలోచనలలో వచ్చిన, వస్తున్న మార్పులు, వివిధ సాహితీ అంశాల గురించి జ్వాలాముఖి తెలియజేసిన అభిప్రాయాలు.... వ్యాఖ్యలు.)*

ప్ర: కవులు, కళాకారులు, ఒకవైపు అభ్యుదయ భావాలతో రచనా వ్యాసంగం చేస్తున్నారు. మరో వైపు మతోన్మాదం సమాజంలో రోజురోజుకు పెరిగిపోతోంది. నిబద్ధత కలిగిన ఒక కవిగా, సాహిత్యకారునిగా ప్రస్తుత సామాజిక పరిస్థితిపై మీ అభిప్రాయం ఏమిటి?

జ: అభ్యుదయ భావాలు 'ఆర్గనైజ్‌గా' ఒక చోటికి రాకపోవడంతోనే మతోన్మాదం రెచ్చిపోయింది. అన్ని మతాలను గౌరవించడం భారతదేశ సాంప్రదాయం! అభివృద్ధి చెందుచున్న సమాజం ఏదీ పాత భావాలతో కొనసాగదు!! పాత సమాజాన్ని తేవాలనుకుంటే, మళ్ళీ కుల, మత పోరాటాలు వస్తాయ్. మనకు యిష్టంవున్నా లేకపోయినా అనేక మతాలున్నాయి. కలిసి సహజీవనం చేయడం తప్పదు! సర్వమత సమభావన, ప్రజాస్వామిక వ్యవస్థ బలపడితేనే సాధ్యం! గ్రామీణ ప్రాంతాల్లో భూసంస్కరణలు, పట్టణాలలో పరిశ్రమల యేర్పాటు సరిగా జరిగివుంటే, నిరుద్యోగసమస్య యింతగా పెరిగివుండేది కాదు. నిరుద్యోగులైన యువతరానికి తగినపని కల్పించి నిమగ్నంగా వుంచడం చాలా అవసరం. ఆ కొరతలోకి మతోన్మాదులు ప్రవేశించి రెచ్చగొట్టి రాజకీయంగా లబ్ధిపొందుతున్నారు.

ప్ర: 'ఫెమినిజం' కవితా రచనల గురించి ....? (ప్రశ్న పూర్తి చేసేలోగానే)

జ: నిజానికి రచనకు లింగభేదం లేదు. కులభేదం అంతకన్నా లేదు. రచన ఎవరు చేశారన్నది ప్రధానం కాదు! రచనలో ఏం చెప్పారన్నదే ప్రధానం. ఏ సమాజాన్ని లక్ష్యం చేశారన్నదే ప్రధానం! రచనకు లింగభేదం వుండాలనడం ప్రజానుకూల చింతనని చీలదీసే దుర్మార్గం!! ఫెమినిజం సామ్రాజ్యవాద దేశాల కుట్ర! శారీరకంగా బాధపడే స్త్రీలు, శరీర శ్రమతో పాటూ సామాజిక స్పృహ కూడా జోడించి, సామ్రాజ్యవాద వ్యతిరేక ధోరణిని ఆర్థిక దృక్పథంతో అన్వయించి రచనలు చేస్తే మారుతున్న సమాజానికి దోహదపడిన వారు కాగలరు. అందుకు భిన్నంగా కేవలం BODY POEMS (అవయవాల కవితలు) ఆడవారు రాసినా మగవారు రాసినా సామాజిక భూమిక నుండి వేరుచేసి రాసినట్లయితే ఫలితం శూన్యం. ఆ విధంగా భిన్నమైన ధోరణి, అది యెంత సహజమైనా అది ప్రజల దృష్టిని ప్రధాన సమస్యల్నించి మళ్ళించే వక్ర దృష్టి మాత్రమే కాగలదు! అన్యాయం చేసే పురుషులతో పోరాడాల్సిందే! వివాహ వ్యవస్థలోని అక్రమాల్ని, దుర్మార్గాల్ని, వివాహ వ్యవస్థను నిరాదరించే వివాహేతర సంబంధాల్ని ప్రోత్సహిస్తే, కుటుంబ వ్యవస్థే కుప్పకూలుతుంది! కుటుంబ వ్యవస్థ కూలిన సమాజంలో భవిష్యత్తు "దిశాహీనం" అవుతుంది! ఎవరి సుఖం వారు చూసుకునే ధోరణి అంతిమంగా మగవారికే లాభం కూర్చి, పిల్లల్ని తల్లిదండ్రులు బ్రతికి వుండగానే అనాధలుగా చేస్తుంది! కాబట్టి ఉన్నత లక్ష్యంతో సమసమాజ స్థాపనకు సమిష్టి భావాన్ని ప్రతిబింబిస్తూ కష్టజీవులతో సంఘీభావాన్ని ప్రకటిస్తూ వుద్యమించినప్పుడు "రాచిరంపాన పెట్టే వ్యక్తిగత శారీరక సమస్యలు సామాజీకరింపబడి నిష్కృతిని సాధిస్తాయి." సామాజిక విముక్తితోనే - వ్యక్తిగత విముక్తి అంతర్గతమై వుందనే సత్యాన్ని విస్మరించే ఏ సృజనాత్మక రచయిత కూడా, ఆధునిక రచయిత కాలేరు!

ప్ర: కవిత్వంలో అస్పష్టతకు కారణం యేమిటంటారు?

జ: కమిట్‌మెంట్ (నిబద్ధత) నించి తప్పించుకొని తిరగడానికి వస్తువును నిర్వహించే సామాజిక దృక్పథం లోపించడం వల్ల శిల్పమే వస్తువుగా మారడం వల్ల అస్పష్టత ఈనాటి వచన కవిత్వంలో రాజ్యం చేస్తోంది. అయితే ఈ అస్పష్టతను బ్రద్దలు కొట్టిన ఘనత కవయిత్రులకే దక్కుతుంది. ఐతే, స్పష్టతను సాధించిన ఈ కవయిత్రులు సామాజిక నిర్దుష్టతను కోల్పోయి సామ్రాజ్యవాదుల కుట్రలకు బలై, వేర్పాటువాదాన్నితల కెక్కించుకున్నారు.

ప్ర: "కవి" అంటే మీరు చెప్పే వ్యాఖ్య యేమిటి?

జ: కవి అంటే - "క" అంటే "క"న్నీళ్ళు నుండి "వి"

అంటే '' వి ''ముక్తి కల్పించేవాడే కవి। కవి క్రాంత దర్శి। అటువంటి హామీ యిచ్చే సంస్కారం కలవాడు కవి।। వాల్మీకివి ఉదాహరణకు తీసుకుందాం. ఒక కిరాతకుడు - జంటపక్షులలో ఒక పక్షిని పడగొట్టాడు. ఆ దృశ్యం చూచిన వాల్మీకి తీవ్రంగా స్పందించాడు. ఆ వెంటనే '' మానిషాద '' అనే శ్లోకం వెలువడింది। పిండితార్థం ఒక ప్రాణం తీయకు, పీడించకు అనిఅర్థం। అదే కవి సంస్కారం. కవి - తన చుట్టూ జరిగే వాటిని చూచి స్పందించాలి. శ్రీనాధుడు తనకు పరిమితంగా భావాలు చెప్పాడు. పోతన తాను నమ్మిన సిద్ధాంతాలకు అంకితంగా రచనలు చేశాడు. తాళ్ళపాక అన్నమాచార్యుడు - రాజులు రాణుల గురించి రాయక చెరసాల పాలయ్యాడు. తర్వాత 20వ శతాబ్దంలో పారిశ్రామిక విప్లవం వచ్చింది. దీనితో అనేక మార్పులు జరిగాయి. ఆ మార్పులలో వైరుధ్యాలు వచ్చాయి. స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం, పేదలు, పెద్దలు, మధ్య పోరాటం మొదలైంది. అక్టోబర్ మహావిప్లవం - మానవ దృక్పథాన్నే మార్చేసింది। ART FOR PEOPLE (కళ - ప్రజల కోసం) అని ప్రపంచ కవులు గుర్తించారు. భావాలు - భౌతిక జగత్తునించి వస్తున్నాయ్. రష్యన్ విప్లవం - రష్యన్ రచయితలు, కవులు అభ్యుదయ సాహిత్యాన్ని అందించారు. ఫ్రెంచి నించి మనకు 'కథా' ప్రక్రియ వచ్చింది. అంతకు ముందు - బంకించంద్ర ఛటర్జీ పాత సమాజాన్ని, వర్ణాశ్రమ ధర్మాన్ని తమ రచనల్లో కోరారు. రవీంద్రనాధ ఠాగూర్ - పాత సమాజాన్ని అలానే వుంచి మార్పు జరగాలని తమ రచనల్లో కోరారు. కవి - నిజం చెప్పేటప్పుడు జనం కొట్టే చప్పట్లు (కరతాళ ధ్వనులు) కోసమేకాక, తిట్లకోసం కూడా సిద్ధపడాలి। అరబిందో యావజ్జీవ శిక్షకు గురయ్యాడు - 'భారతి' నవల రాశాడు. శరత్ - వేశ్యల గురించి రాశాడు. తప్పులెందుకు చేస్తారో రాశాడు. నజురిస్లాం - ''విద్రోహి'' రాసి, మొత్తం మార్పు కావాలన్నాడు. పాత విలువలు నాశనం కావాల్సిందే అన్నాడు. అప్పట్లో ఆయన పుస్తకాన్ని నిషేధించారు. చెరసాల పాలు చేశాను. తెలుగులో ఉన్నవ లక్ష్మి నారాయణ పంతులు 'మాలపల్లి' నవల - పాత విలువలతో కొత్త సమాజాన్ని నిర్మించ లేమన్నారు. 1935లో మున్షి ప్రేమ్‌చంద్ అభ్యుదయ సాహిత్యాన్ని ప్రారంభించారు. ''నమ్మక్-క-ఘర్' (ఉప్పుటిల్లు) రాశారు. మేధావులు - పెట్టుబడి దారుల దోపిడీదారుల గుమాస్తలుగా వుంటున్నార ని చెప్పారు. అయితే యిప్పుడు USA నించి మనకు అసంబద్ధ ఆలోచనలు వాదనలు దిగుమతి అవుతున్నాయ్. కవికి ఏ సిద్ధాంతము అక్కరలేదు అంటున్నారు. POET IS POET - నిబద్ధత అక్కరలేదని అంటున్నారు. స్వభావానికి సంబంధించి కాక, స్వరూపానికి సంబంధించి మార్పులు తెచ్చారు. దీనినే NEOMODER NISATION అంటున్నారు. అసంబద్ధ ఆలోచనా సరళులు మనిషిని మనిషితో దూరం చేస్తాయ్। మనిషినుంచి మనిషిని దూరం చేసే వాదం సరికాదు ●

# అణగారిన బ్రతుకులకు ఆశాజ్యోతి

## షెడ్యూల్డు కులాల సేవా సహకార సంస్థ, కడప జిల్లా

*1994-95 సంవత్సరములో 10665 షెడ్యూల్డు కులాల వారికి ఆర్థిక సహాయం అందించుటకు రూ. 1116-00 లక్షలు ఖర్చు పెట్టుటకు ఈ దిగువ కనపరచిన పథకములను రూపొందించబడినది.*

- చిన్ననీటి వనరులు :- ఉపరితల గొట్టపు బావులు-100, ఫిల్టరు పాయింట్స్-50, **సామూహిక వ్యవసాయ బావులు**-551, **విద్యుత్ మోటార్లు** -670.
- 125 మంది భూమిలేని నిరుపేదలకు 312-50 ఎకరముల భూమి కొనుట.
- 300 ఎకరములలో పండ్ల తోటల పెంపకము.
- 7 మంది లబ్ధిదారులకు పండ్ల మొక్కల నర్సరీలు పెంచుట.
- 250 ఎకరాలలో మల్బరీ తోటల పెంపకానికి ప్రోత్సాహం.
- 550 ఎకరాలలో వ్యవసాయ భూముల అభివృద్ధి.
- 691 పాడి పశువుల పంపిణీ.
- 440 మంది లబ్ధిదారులకు గ్రామీణ మరియు పట్టణ ప్రాంతాలలో స్వయం ఉపాధి పథకము క్రింద ఆర్థిక సహాయము.
- 890 మంది భూమిలేని వ్యవసాయ కూలీలకు మరియు చేతివృత్తి పనివారలకు ప్రత్యామ్నాయ పథకము ద్వారా ఆర్థిక సహాయం.
- 290 మంది పారిశుద్ధ పనివారలకు శాశ్వత విముక్తి కొరకు ఆర్థిక సహాయం.
- 2250 మంది స్త్రీలకు డ్వాక్రా పథకము ద్వారా ఆర్థిక సహాయము అందించుట.
- 336 మంది లబ్ధిదారులకు పంట రుణాల ద్వారా ఆర్థిక సహాయం.
- 130 మంది యువతకు స్వయం ఉపాధి పథకము క్రింద నైపుణ్యత అభివృద్ధి పరచుటకు వారి సంబంధిత వృత్తిలో శిక్షణ కల్పించుట.
- 75 మంది చర్మకారులకు వారి వృత్తిలో శిక్షణ కల్పించుట.

**కె. వెంకయ్య,** ఎగ్జిక్యూటివ్ డైరక్టర్
షెడ్యూల్డు కులాల సేవా సహకార సంస్థ
కడపజిల్లా.

**డా. పి. సుబ్రహ్మణ్యం** I.A.S.,
జిల్లా కలెక్టర్
కడప.

# దాహం

– జూపల్లి ప్రేంచంద్

నాయనలారా
నా దాహార్తిని తీర్చే మార్గం చెపుతారా
తరతరాలుగా దేహాన్ని ఆకాశనేత్రంగా మార్చి
అనంత దాహాన్ని దేహంతో బంధించి
ఒకే ఒక స్వప్న నేత్రాన్ని కుండలీకరిస్తూ
సర్వేంద్రియాల్ని కేంద్రీకరిస్తూ
నా చెట్టుని, నాపుట్టనీ, నా చేనునీ, నా చెలిమినీ
నా మట్టిని, హృదయంతో పెనవేసుకొన్న నా సమూహాన్ని
రక్షిస్తామని నాక్కొంచెం హామినిస్తారా!
దిక్కులేని అనాథ తల్లిని సంరక్షిస్తామని
ఎవ్వరైనా నాక్కొంచెం నమ్మకమిస్తారా!
ఎన్ని కలలు, ఎన్ని ఆకాంక్షలు, ఎన్ని ఆశయాలు
అన్నీ నిష్ఠూర సత్యాలేనని తేలిపోతుంటే
దాహంతో దేహం పిడచగట్టుకు పోతుంటే
జ్ఞాపకాల తెరల వెనుక అన్నీ యథార్థ జీవితాలే సాక్ష్యాలై నిలిస్తుంటే
ఔరా!
నా సోదరుడు ఎంత సాహసికుడు!
ఒక చేత కపాలాన్నీ, మరోచేత మిణుగురు పురుగును
ధరించి, గాఢాంధకారంలో
నడుముకు బిగించి కట్టిన పుట్టగోచీ, రెండుకాళ్ల మధ్య
జీరాడుతూంటే ఏం మిగిలిందిప్పుడు
నెత్తిమీద మెరుస్తున్న మాసిన తువ్వాలు నేరమైంది తప్ప
ఏం దక్కిందిప్పుడు
మూర్తీభవించిన దైన్యంలాగున ఉత్తచిత్తల సాగిపోతుంటే
దారిపొడుగునా లుంగలు చుట్టుకుపోతున్న దృశ్యాలే

శిలా విగ్రహాల వీక్షణాలు, వేడి నిట్టూర్పులు,
కొంచం కొంచంగా ఇసుక మేటల్లో కూరుకుపోతున్న పాదాలు
శిరస్సు మండుతున్న సూర్యగోళం
ఇప్పుడు -
నా సోదరుడు నిలువెల్లా జ్వలిస్తున్నవాడు
ఇప్పుడు -
'దాహం' అన్న పదం కేవలం సర్వనామం
వీడు 'దాహం'తో వున్నాడు అనటం అబద్ధం
నీవే ఒక దాహం అనటం మాత్రమే సత్యం
నీవు మూర్తీభవించిన దాహస్వరూపం అనటం మాత్రమే పరమసత్యం
అందుకే -
నీకు నీ దాహాన్ని గూర్చిన ఆలోచనల్లేవు
దాహంలో కూరుకుపోయిన వాడికి దాహం ఎట్లా తెలుస్తుంది
అస్థిరత్వం స్థిరత్వమైన వాడిసి అస్థిత్వం

వెనుదిరిగి చూడకుండా అంచలంచెలుగా ముందుకు
దూకుతున్నాడు ధీరుడు.
అటు చూస్తే -
మృత కళేబరాల్లా బిగుసుకుపడుకున్న ఎండిన చెరువులు
కన్నీరింకిన కళేబరం కనుగుడ్లలా ఎండిన బావులు,
చితికి పేర్చిన ఎండు పుల్లల్లా, తోటలో మోడుబారిన చెట్లు,
అరణ్యాల్ని నిలువెల్లా దహిస్తున్న దావానలం సెగలూ
దావానలాన్ని వేగంగా విస్తృతం చేస్తున్న వేడి గాడ్పులు
ఇటు చూస్తే -
ఆకాశం కేసి మోరలెత్తి సామూహిక ధ్యానం చేస్తున్న
రైతాంగం సోదరులూ, మూగజీవులు
బక్కెముకలు బైటకు పొడుచుకొచ్చిన గాడిదల మీద
మూటాముల్లెతో దూరదేశాలకు వలసవెళ్తున్న కూలీ సోదరులూ..
అందరూ అద్భుత దృశ్య సాక్షాత్కారానికై ఎదురు చూస్తున్న వారే!
అపర భగీరధుడి కోసం తపస్సు చేస్తున్నవారే!నా అమాయకుడు కూడా
నడిచి నడిచి నడిచి కొండలు దాటి కోనలు దాటి
కాళ్లు బోదకాళ్ళయి రాతి స్థంభాలుగా మారుతున్నా
అచంచల విశ్వాసంతో ముందుకేసి నడుస్తున్నాడు.
చుట్టూ పరికించి చూస్తే
అంతటా విస్తరిస్తున్న ఎడారి
పచ్చదనం పలాయనం చిత్తగించింది
పర్వతా గ్రాలమీంచీ అరణ్యాలు అదృశ్యమై మిగిలినవి
రాతి గుట్టలు.
రైతన్న కాళ్లక్రింద భూమి కొంచం కొంచంగా కదులబారింది
చాపకింద నీరులా విస్తరిస్తున్న ఇసుక దిబ్బలూ
రైతన్న గుండెను గుచుతున్న ఇసుక రేణువులు, శూలాగ్రాల్తై
భయపెడుతున్నాయి.
ఇప్పుడు ఎటుచూసినా శిలా విగ్రహాలు



ఎక్కడుంటుంది?
హింసలు తప్ప అహింసలకు తావెక్కడుంటుంది
జీవించటం తెలియని వాడికి జీవితం విలువ తెలీదు
చిగిర్చే జీవికను గోటితో కర్కశంగా
గిల్లటం మాత్రమే తెలుస్తుంది.
ఇక్కడ ఆక్రందనలు తప్ప ఆగ్రహాలు ఎల్లా తలెత్తుతాయి.
ఐనా అన్వేషణ ఆగదు

నీటి కోసం ప్రయాణించక తప్పదు
నీరు ఎక్కడుందో అటువైపు సాగుతుంది ప్రయాణం
అనంతమైన ఎడారి మధ్యకూరుకుపోతున్న బాటసారికి
కనుచూపు మేరంతా విస్తరిస్తున్న ఎడారి మాత్రమే కన్పిస్తున్నది.
ఎండమావులు మాత్రమే దర్శనమిస్తున్నాయి.
దిక్కులను సూచించేందుకు చేతిలో దిక్సూచిలేదు
పటం లేదు, తగిన సూచనల్లేవు

తూర్పు పడమరలను గుర్తించే మార్గనిర్దేశం లేదు
అంతే కాదు!
ఏ దిక్కులో వెళ్తే దాహం తీరుతుందో అర్థం కాదు
అంతా అగమ్యగోచరం, అన్నీ అర్థనత్యాలే
సాధకుడికి దాహం ఒక్కటే సత్యం
దాహం ఒక్కటే నిత్యం
ఆలోచనకిక్కడ ఆస్కారం లేదు
ఎడారిలో ఒయాసిస్సును దక్కించుకోవటం ఒక్కటే లక్ష్యం.
లక్ష్య నిర్దేశంతో ముందుకు సాగటమొక్కటే మార్గం
అచంచలంగా సాగుతున్న వాడికి
ఇప్పుడు ఒకచేతితో చెలకోలా
మరొక్క చేతితో దీపం ప్రత్యక్షమయ్యింది
తూర్పుదిక్కున సూర్యోదయం పథనిర్దేశం చేస్తోంది. ●




# బంధం

— వెంకటేశ్వర్లు యాదాటి

భాద్రపద మాసం. ఆపాటికి నేలతల్లి కాస్తో కూస్తో జలకాలాడి వుండాల్సింది. కానీ యింతవరకూ ఆకాశం మబ్బుల చీర కట్టనే లేదు. రాయలసీమ రైతులకళ్లు జలదాలై వర్షించడానికి సిద్ధంగా ఉన్నాయి.

ఉదయం ఏడుగంటలకే ఎండచురుక్కుమంటోంది. చెన్నప్పభాషలో ''అంబళ్ల'' పొద్దుకే ''సైటాల''

అయ్యింది గొడ్ల కన్నా యింతమేత వేర్దామని 'పొట్టుబిల్ల'లో చెయ్యి బెడితే వెదురు పేడు గుచ్చుకుంది తటాల్న నెత్తురు బయటకి రాకుండా నోట్లో వేలు పెట్టుకున్నాడు. ఈ అలికిడికి 'మచ్చు' (మంచె) పైన పిల్లి లేచి బద్దకంగా ఒళ్లు విదిలించుకుంటూ బయటకొచ్చింది. దాని పేగులు కూడా చెన్నప్ప పేగుల మాదిరే గుర్రుమంటున్నాయి.

" రేయ్ శెన్నప్పా! గొడ్లని రొంత డొంకలో తిప్పకరారాదూ " సోపామిద్దెలో కూచుని కేకేశాడు కొండారెడ్డి.

" ఏముందబ్బా ఆడ. కొయ్యికాల్లు గుడకాఎండిపాయె. ఐనాపోయ్యొచ్చా లేబ్బా " అన్నాడు చెన్నప్ప గొడ్లకు తలుగు విప్పుతూ. గొడ్లు తోకలు దులుపుకుంటూ ఆశగా బయటికి పోతుంటే వాటెంబడే బయటికొచ్చిన చెన్నప్ప.

" బీడీ ఒకటుంటె ఈయబ్బా " అనడిగాడు కొండారాడ్డిని.

" యాడుండాయ్‌రా ? " అంటూ జేబంతా వెదికి ఒకటిచ్చాడు రెడ్డి. బీడీ అందుకుంటూ, " అక్కకుచెప్పబ్బా అంబలి పొయ్యమని " అడిగాడు చెన్నప్ప.

" ఛత్... ఎప్పుడూ బువ్వే.. పైటాలకి సంగటి బెడ్తదికానీ పోయిరాపో " తరిమాడు రెడ్డి. తినబోయే జొన్నసంకటి, శనక్కాయ కారం తల్చుకుంటూ గొడ్లవెంబడి పోయినాడు చెన్నప్ప.

అట్లా ఉస్సూరంటూ పోతున్న గొడ్లనీ, చెన్నప్పని చూస్తూగొడ్లకి మేపూ చెన్నప్పకు అంబలి పోయలేని తన దౌర్భాగ్యానికిగుడ్లల్లోనీరు కుక్కుకున్నాడు కొండారెడ్డి.

కొండారెడ్డి భార్య ఈశ్వరమ్మ సోపాలోకివచ్చి మొగుడితో" ఇట్లా గూకుంటే ఎట్లా గయ్యా ? పైటాలకి సంగటున్న తివొద్దా. యాడి కన్నా బోయి 'తూమెడు' జొన్నలు

## ★ ఇదేం వ్యాఖ్యస్మి ! ★

కొలిపించుకురాయ్యా" అంది. కొండారెడ్డి ఉస్సూరంటూ లేచి, " నిన్నటి సద్దేమన్నా ఉంటేసూడే యాడికన్నా బోయిజొన్నలుతెచ్చా", అన్నాడు రెడ్డి ఆశగా.

ఈశ్వరమ్మ మనస్సు చివుక్కుమంది, " లేదయ్యా, రొంత మాదు చెక్క వుంటే ఎర్దల కేసినా. " అంది గద్గదికంగా.

" పోనీలే... ఆగోతం ఇట్లాతే కిట్నారెడ్డింటి కాడికి పొయ్యొచ్చా " అని భార్య ఇచ్చినగోనె సంచి పట్టుకుని వెళ్లాడు కొండారెడ్డి.

ఒకప్పుడు యాభై ఎకరాల భూస్వామి కొండారెడ్డి. ఏటావచ్చే కరువుకూ రేనాటి పౌరుషాలకు పటాయింత భూమి కరిగిపోగా ఇప్పుడు యిరవై ఎకరాల భూస్వామిగా మిగిలిపోయినాడు. సంకటికీ, అంబలికీ గతిలేని స్థితిమంతుడు కాలేజిలో ఫీజులు కట్టలేక పిల్లోడ్ని కాలేజి మానిపిస్తే వాడు పేడా, మట్టేపిసక లేక ఊరిడిచి పోయినాడు. వాణ్ణి వెదికించేందుకు లెక్క (డబ్బు) లేక ఒకదండం పెట్టి ఊరుకున్నాడు రెడ్డి.

చెన్నప్పకూడా ఒకప్పుడు పది ఎకరాల ఆసామే. పార్టీలకీ బాంబులకీ, భార్యరోగాలకీ కరువుకూ మొత్తం హారతి కర్పూరంలా కరిగిపోగా తుండు భుజాన వేసుకునిఉన్న ఊరు యిడిసేసి కొండారెడ్డి పంచలో పదేళ్ళ నించీ పడున్నాడు బిడ్డనంటెమ్మతో. ఆ తల్లి లేని పిల్లంటే ప్రాణం వాడికి.

కొండారెడ్డి భుజాన గోతం వేసుకుని కృష్ణారెడ్డి యింటికి పోతూ 'కిట్నా రెడ్డన్నఇంతకాపీ పోపిచ్చాడులే' అనుకుంటూ పోతుంటే దార్లోనే క్రిష్ణారెడ్డి ఎదురై 'రొన్ని జొన్నలుంటే యి ప్పియ్యిమామా' అనే సరికి హతాశుడైనాడు.

పైటాలయ్యింది డొంకల్లో ఎండిన వాగుల్లో దొరికినంత కాడికి గడ్డిమోపు కట్టుకుని గొడ్లను తోలుకొచ్చాడు. చెన్నప్ప చేతులూ కాళ్ళు శుభ్రంగా కడుక్కుని వచ్చి 'తెల్లె' (కంచం) దగ్గరకూచున్నాడు. యిల్లంతా నిశ్శబ్దంగా వుంది. గోడవారన గుడ్డబరుచుకుని పడుకునుంది ఈశ్వరమ్మా. చెన్నప్పకు అర్థం అయ్యింది అయినా ఆశ చావక

" అక్కా.. " పూడుకు పోయిన గొంతుకతోపిల్చాడు. ఈశ్వరమ్మ యిటు తిరక్కుండానే అంది, " లేదురా ముద్ద... చూడు చెన్నప్పా కోమటింటికి పోయి 'అబ్బ' సెప్పినాడని ఒకపడి జొన్నలు పోయించుకు రాపో.. " అని పురమాయించింది. " కోంటాయన అంగడి ఎగబెట్టి ఎన్నాళ్లాయె ?! పాపం ఆయన్న కూడా పేటకు పోయి నాలుగంగళ్లలో పద్దులు రాసుకుంటుండాడు. "

అక్కా రొన్ని మజ్జిగన్నా వుంటే పోయక్కా మాసంటి పిల్లకు పోచ్చాను, " దీనంగా అడిగాడు చెన్నప్ప. పిల్లదాని మాట గుర్తొచ్చేసరికి ఈశ్వరమ్మ కడుపు తరుక్కుపోయింది.

" ఇదిగోరా ఈముంత దీసుకుని ఆయనుముకాడ ఏమన్నా ఉండాయేమోసూడు. " అంది ఈశ్వరమ్మ .

చెన్నప్ప ఎనుముకు గడ్డి పెట్టి వీపు నిమురుతూ పిండినాడు. అరగంట కష్టపడితే అరముంతెడు కారినాయి. చెన్నప్ప పిల్లకిన్ని తీసుకుపోతే ఈశ్వరమ్మ పెనిమిటికి యిన్ని ఎత్తిపెట్టి తాను మాత్రం ఊరబావిలోని బురదనీళ్లు తాగి పడుకుంది.

యిట్లాంటి వస్తువులు ఆసీమలో యిల్లాళ్ళకు కొత్తకాదుమరి!!

ఆరోజు సాయంత్రం కొండారెడ్డి సోపాలో కూచుని యింటిముందు, కట్టేవున్న తన ఎడ్లని చూసుకుని మురిసిపోతున్నాడు. ఎప్పుడో ఆ యింటి ముంగిట్లో, ఆ యింటి ఆవు బాపత్తు సంతానం ఆ ఎద్దులు. ఆ యింటి ముంగిట్లో, ఆడుకుని పెరిగిన ఎద్దులవి. కొండారెడ్డికి కన్న కొడుక్కన్నా ఎక్కువే అవి. అందుకే పిల్లోడికి ఫీజులు కట్టలేక చదువులైనా మానిపించినాడు కానీ, ఆ ఎడ్లకు 'పుటికే మేపు' తగ్గించలేదు. ఆ ఖర్చంతా ఆవూరి మోతుబరి సుబ్బారెడ్డి భరిస్తున్నాడు. ఆ సుబ్బారెడ్డికి కొండారెడ్డి మీద అభిమానం కన్నా అతని యిరవై ఎకరాల భూమిపైన మమకారమెక్కువ। కొండారెడ్డికీ విషయం తెలియక పోలేదు. తెలిసినా చేయగలిగిందేమీ లేదు. ఇట్లా ఆలోచించుకుంటూ వుంటే ఆవూరి టీచర్ వెంకట్రావు ఒక యింగ్లీషు దొరను వెంటబెట్టుకుని వచ్చాడు.

ఆ యింగ్లీషు దొర రావడమే ఆలస్యం ఎద్దుల్ని పరీక్ష చెయ్యడం మొదలుపెట్టాడు. పశువుల డాక్టరు కాబోలనుకున్నాడు రెడ్డి.

కాస్సేపు అయ్యాక ఇంగ్లీషు దొర వెంకట్రావు ద్వారా ఎద్దులను కొంటానని చెప్పాడు.

కొండారెడ్డికి చిర్రెత్తు కొచ్చింది. నసేమిరా' వీల్లేదన్నాడు. ఇంగ్లీషు దొరకూడా పట్టుదలగా యాభైవేల నించి డబ్బై వేలకి ధర పెంచాడు ఒక్కో యెద్దుకి. కొండారెడ్డికి మతిబోయినంత పనైయింది. రెండు ఎడ్లకీ లక్షానలభైవేలు!!! పిల్లోడి చదువూ తన కరవూ, కష్టాలూ అన్నీ తీరిపోతాయ్ అనుకున్నాడు ఒక్క క్షణం. పెళ్లాం వేపు చూశాడు. ఆమె పెడమొహం చేసింది. ఆమె కళ్లల్లో కన్నీరు కొండారెడ్డి దృష్టికి తగలకపోలేదు. ఎడ్లకేసి చూశాడు. అవి దీనంగా

## నడుస్తున్న శవాలు



చూస్తున్నాయి.

ఆనాడు విశ్వామిత్రుడు బలవంతంగా తోలుకుపోతున్నప్పుడు వశిష్ఠుని చూసిన కామధేను చూపు అది!!!

చలించిపోయాడు కొండారెడ్డి. కొండారెడ్డి మెత్తబడటం చూసి వెంకట్రావ్ యిలా అన్నాడు.

'' ఏం లేదు రెడ్డిగారు! అన్ని పరీక్షలూ చేశాక మీవి మేలుజాతి ఎడ్లని దొరగారు కనుక్కున్నారు. దొరగారు వాటిని నీవద్ద నుండీ కొని తన దేశంలో యిలాంటి ఎడ్లను తయారు చేసి అమ్ముకుంటారట! మంచిధర! యింతకన్నా ఛాన్సు దొరకదు. ఏమంటారు?!'' అనడిగాడు.

ఈశ్వరమ్మ కూడా జోక్యం చేసుకుంటూ, 'మనం వాటికి మేపు పెట్టలేక వాటిని ఉసురు బెడతాండాము. ఆయనైనా సల్లగా సూసుకుంటాడు. రొంత ఆలోచించు అయ్యా! యిట్లానే ఉంటే వాటికి తిండి లేక సచ్చిపోతే....'' నోట్లో గుడ్డకుక్కుకుని యింక చెప్పలేక భోరున ఏడుపు సాగించింది.

యింగ్లీషు దొరకు భాష రాకపోయినా మనసుగలవాడు. పరిస్థితిని అర్థం చేసుకో గల మానవత్వముంది. ఈ స్థితిని అర్థం చేసుకుందుకు భాష అక్కర్లేదు! దొరకు అర్థమైతోంది. కొండారెడ్డి వేపు చూశాడు దొర. రెడ్డి మొహంలో ఇంద్రధనస్సులోని వర్ణాల్లాగా ఎన్నోభావాలు. బాధ్యతా, అప్పులూ, ఋణాలు, కరువులూ, కష్టాలు ఒక పక్కా, మూగ జీవుల మూగభాష, పెంచిన ప్రేమ, అనహాయత, మమకారం కలగాపులగంగా వుంది రెడ్డి అంతరంగం. అప్పుడు చప్పున గుర్తొచ్చింది. తానెప్పుడో పశువులాస్పత్రిలో చూసిన సంగతి. యిట్లాంటి పరిస్థితిలోనే ఎద్దుల వీర్యం సేకరిస్తూంటే యంత్రాల ఒత్తిడికి తట్టుకోలేక ఎద్దు చావడం గుర్తొచ్చింది. చలించిపోయాడు. మరోమారు తన ఎడ్లను చూశాడు. వాటి కళ్లల్లో అనంతానంతా భావాలు. వాటి కళ్ళ భాషను అర్థం చేసుకుంటే తెలుస్తుంది వాటి మూగ బాధ. అవి యాజమాని కోసం త్యాగానికి సిద్ధం. ప్రాణత్యాగానికి సిద్ధం. తమ యాజమానికి సుఖంగా చల్లగా ఉండటానికి ఏం చెయ్యడానికైనా సిద్ధం! కాకపోతే తేనిదల్లా ఒక్కటే భగవత్సం కల్పం. ఆ ఎద్దుల ముఖంలో తన అమ్మానాయనా కనబడినారు కొండారెడ్డికి. తట్టుకోలేక పోయినాడు. 'దొరలు ఎద్దుల్ని కోసుకుతింటారు' అన్న భావన ఏర్పడి బావురుమన్నాడు.

'' సార్ మేము మాఎడ్లని అమ్ముకోదలుచుకోలేదు. ఆ సంగతి దొరగారికి చెప్పండి.'' అన్నాడు టీచర్‌తో.

'' ఇంకోసారి ఆలోచించు కొండారెడ్డన్నా'' అన్నాడు టీచర్.

'' అంతేసార్! మేము సచ్చేంత వరకూ అయి మాకు బరువు కావు. యింక మీరు పోయిరండి సార్'' అన్నాడు రెడ్డి ఎడ్లని కావిలించుకుని ఏడుస్తూ.

భాషలకందని మానవత్యభావన తర్జుమా అవసరం లేకుండానే దొర గుండెలకి అర్థం అయ్యింది. భారతీయ భావాలకి ఆవేదనలకీ, పులకించిపోయింది

దొర హృదయం. వెంకట్రావు ' అనిమెల్ '' '' లవ్ '' అంటూ ఏదో చెప్పాడు. '' యస్... ఐ అండర్ స్టాండ్ ... (Yes... I understand).. ఐ లవ్ ఇండియన్ కల్చర్ అండ్ సెంటిమెంట్స్ '' (I love Indian culture and sentiments) అన్నాడు మనస్ఫూర్తిగా. అట్లా అంటూనే వెయ్యి రూపాయలు తీసి కొండారెడ్డికిచ్చాడు దొర. తాను ' పరీక్షలు జరిపినందుకు ప్రతిఫలంగా ' అంటూ.

'' వద్దుదొరగారూ '' అంటూ తిరస్కరించాడు కొండారెడ్డి.

'' ఓకే దిస్ ఈజ్ నాట్ ఫర్ యూ (ok. This is not for you) బట్ ఫర్ ది పూర్ ఎనిమల్స్ (But for the poor animals) '' అన్నాడు దొర అర్థంగా. టీచర్ కొండారెడ్డికి తెలుగులోచెప్పాడు.

కాదనలేక తీసుకున్నాడు కొండారెడ్డి. నిజానికి కొండారెడ్డి దరిద్రం అలా చేసింది.

దొర తృప్తిగా రెడ్డిని కౌగిలించుకుని భుజం చరచి వెళ్ళిపోయయాడు. దొర తన ఎద్దుల్ని మెచ్చుకున్నందుకు కొండారెడ్డి ఎద గర్వంగా పొంగింది. గర్వంగా మీసాలు మెలేసుకున్నాడు. ఈశ్వరమ్మ మొగుడి సంతోషం చూసి మురిసిపోయింది. రెండురోజులు ఆయింట్లో సంతోషం సంతృప్తి తాండవిచ్చాయి. మూడో నాడు రాత్రి కొండారెడ్డి చెన్నప్ప చెన్నప్పబిడ్డ సంటెమ్మా సంతుష్టిగా భోంచేసిం తర్వాత సొపాలో గుడ్డిదీపం కాడ కూకొని లోకాభిరామాయణం మాట్లాడుకోసాగినారు. కొస్త సేపయ్యాక చెన్నప్ప బిడ్డ నిద్రపోయింది.

ఉన్నట్టుండి కొండారెడ్డి, '' చెన్నప్పా! సూచ్చుండావు కదా యింటి పరిచ్చితి. బువ్వకూ్కూడా కరువైపోయి నాది. వోర్సం జాచ్చాయుంటే సుక్క పడకపాయె. యవసాయం సాగే పరిచ్చితి లేదు... '' కొంచెం ఆగాడు రెడ్డి.

'' అవునబ్బా '' బుర్రగోక్కుంటూ అన్నాడుచెన్నప్ప. అయినా రెడ్డి యివన్నీ తనెందుకు చెబుతున్నాడో అర్థం గాక.

'' అందుకని... '' గొంతులోని బాధని మింగుకుంటూ '' ఇదిగో ఈ రెండు నూర్లూ తీసుకుని మీ పిల్లతో పేటకి పోయి యాడన్నా పనిచూసుకో '' అంటూ చెన్నప్ప చేతిలో డబ్బుపెట్టి అటుపక్కకి తిరిగి కళ్ళు తుడుచుకున్నాడురెడ్డి.

చెన్నప్పకుముందు కొండారెడ్డి చెప్పింది అర్థంకాలేదు. అర్థం అవుతూనే కొండారెడ్డి కాళ్ళ పైనబడి ఏడుస్తూ '' నేను నీకు బరువైపోయినానాబ్బా! నీ ఎద్దులు సేసినంత యిలవ నేను సెయ్యక పోతినా? నిన్ను దేనికన్నా బాధపెడ్తినా? సతాయిస్తినా? పదేళ్ళు నీపంచన పడివుండాను నేనుగానీ, నాపిల్లకానీ, నీకు కష్టజేచ్చిమా? నష్టం జేచ్చిమా? నీవన్నా చెప్పక్కా '' ఆవేదనగా చూస్తూ ఈశ్వరమ్మ నడిగాడు. ఈశ్వరమ్మ కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూంది.

'' అట్లా అనగాకురా చెన్నప్పా! మా పిల్లోడి మాదిరే నిన్ను చూచుకుంటాండాం... మూడేండ్లాయె వర్సం పడి. ఈడ్నే వుంటే సంటిపిల్ల దెబ్బ తింటాదిరా. అదీకాక కరువుల్లో కాటకాల్లో మేము సచ్చినామె గానీ, మా వంశంలో పాలెళ్ళని సంపలా. నాకా పాపం అంటగట్టగాకురా. '' అన్నాడు కొండారెడ్డి చెన్నప్పని హత్తుకుని.

'' ఆపేటలో అయితే రిచ్చా తొక్కుకున్నా పిల్లకంత బువ్వన్నా దొరుకుతాదిరా. కొంతకాలం అట్లావుండు. యిక్కడ పరిచ్చితి బాగైతూనే నిన్ను పిల్లంపిస్తా నామాట వినరా! నాతండ్రీ! '' అన్నాడు కొండారెడ్డి.

కొండారెడ్డంతటోడు ఏడుస్తూ ఉంటే విలవిల లాడిపోయినాడు చెన్నప్ప.

కొస్త సంభాలించుకున్నాక నెమ్మదిగా యిలా అన్నాడు చెన్నప్ప, '' అయ్యా! ఈ కరువుమనకు కొత్త కాదు. కరువు లొచ్చుంటాం పెరుగుతాండాం సచ్చాండాం. అందుకని కరువుకు భయపడి పారిపోదలచుకోలేదు. నీకు బరువుకాదంటే నేనొక మాట చెప్పుతాను. నాపిల్లను మీయింటి కాడ పెట్టినేను పట్నం పోతా. రిచ్చాతొక్కి నాలుగు రూకలుసంపాయించి మీకు తెచ్చిచ్చా. మీ పిల్లోడిలాంటి వాణ్ణికాబట్టి తలాయింత కలో గంజోతాగుదాం.నా మాటకాదనగాకర్రి. మీ కిట్టం లేకపోతే సెప్పర్రి మాపిల్లా, నేనూ ఏ బస్సు కిందనో బడి సచ్చాం. '' అన్నాడు చెన్నప్ప ధృఢంగా. ఆ మాటల్లోస్థిరత్వం చూసి ఇంకేం మాట్లాడలేదు ఈశ్వరమ్మ.

'' అయితే చెన్నప్పా! నాగ్గుడకా రిచ్చా యిప్పించు తోల్తా '' అన్నాడు కొండారెడ్డి అంతే ధృఢంగా.

కరువుసీమలో మరో ఇద్దరు రైతులు, కూలీలుగా మారి పోయినారు. కరవు నవ్వుకుంది జాలిగా ●

# 'రాయలసీమలో హింస' కథలు బహుమతి ప్రదానం

— డా. శాంతి నారాయణ



వేదిక పైన ఎడమ నుండి కుడికి చిలుకూరి దేవపుత్ర, ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డి, డా. మధురాంతకం రాజారాం.

మానవతా విలువలు క్రమంగా సన్నగిల్లుతూ సమాజంలో హింస పెరుగుతున్న సందర్భంగా దాన్ని పరిహరించి సమాజంలో శాంతిని సుస్థిరపరిచే బాధ్యతను రచయితలు చేపట్టాలని అనంతపురం జిల్లా రచయితల సంఘం ఇటీవల స్థానిక లలితకళా పరిషత్తులో నిర్వహించిన ఒక సమావేశంలో ప్రసంగించిన పలువురు వక్తలు ఉద్ఘాటించారు.

నిరంతరం వర్షాభావంతో కరువు రాక్షసి కరాళ దంష్ట్రల మధ్య నలిగిపోతున్న రాయలసీమ, ఆధునిక కలుషిత రాజకీయ వాతావరణంవల్ల ముఠా కక్షలతో బాంబుల రాజనీతితో అతలా కుతలమవుతున్నది. ఈ ప్రాంత వెనుకబాటు తనానికి కేవలం ప్రాకృతిక శక్తులే కాకుండా హత్యా రాజకీయాలు కూడా ప్రధాన కారణమవుతున్నాయి. అర్థ భూస్వామ్య వ్యవస్థ కారణంగా అర్థరహితమయిన హింస మూలంగా ఈ ప్రాంత జన జీవితం తిరోగమిస్తున్నది. ఈ అంశాలను దృష్టిలో ఉంచుకొని అనంతపురం జిల్లా రచయితల సంఘం 'రాయలసీమలో హింస' అనే అంశంపైన రాష్ట్రస్థాయి కథలపోటీ నిర్వహించింది. బహుమతి పొందిన రచనలకు బహుమతులను ప్రదానం చెయ్యడానికి ఏర్పాటు చేసిన సమావేశంలో 'హింస' కథలకు న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించిన సుప్రసిద్ధ కథారచయితలు డా. మధురాంతకం రాజారాం, శ్రీ వాకాటి పాండురంగారావు ప్రభృతులు పాల్గొన్నారు. జిల్లా కలెక్టర్ డా. మన్మోహన్‌సింగ్ ముఖ్య అతిథిగా విచ్చేశారు.

ఈ సందర్భంగా 'నడుస్తున్న తెలుగు కథ' అనే అంశంపైన ఏర్పాటు చేసిన చర్చాగోష్ఠికి ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డి అధ్యక్షత వహిస్తూ ఆధునిక తెలుగు కథ గురజాడ అప్పారావుగారి 'దిద్దుబాటు' కథతో ప్రారంభమై ఏవిధంగా పరిణతి చెందుతూ వచ్చిందో, 1980వ దశకం నుండి తెలుగు కథ ఏవిధంగా పరిపుష్టమయిందో వివరించారు.

శ్రీ మధురాంతకం రాజారాం ప్రసంగిస్తూ చిత్తశుద్ధి ఉన్న రాయలసీమ రచయితలు తమ లక్ష్యసిద్ధికై సాంస్కృతిక పరంగా చర్యలు తీసుకోవడాన్ని ప్రశంసించారు. దిద్దుబాటు కథ ద్వారా గురజాడ అప్పారావు కథా లక్ష్యాన్ని నిర్దేశించారని, సమాజంలోని వక్ర విధానాలను సరిదిద్దే బాధ్యతను తరతరాల రచయితలు స్వీకరించాల్సి వుంటుందని ఆయన అన్నారు.

సాహిత్య ప్రపంచంలో ప్రస్తుతదశను కథానికకు పునరుజ్జీవన కాలంగా శ్రీ మధురాంతకం అభివర్ణించారు. ఏడాదికి సుమారు వెయ్యి కథలూ, యాభైదాకా కథా సంపుటాలు వెలువడుతున్నాయి. కథా వ్యాప్తికోసం అనంతపురం జిల్లా రచయితల సంఘంలాగా ఎన్నో సంస్థలు, ఎందరో వ్యక్తులు ముందుకు రావడం జరుగుతూ వుంది. అందుకే తెలుగు కథను వర్తమానమే కాకుండా భవిష్యత్తు కూడా ఆశాజనకంగా కనిపిస్తూ వుంది' అని రాజారాం స్పష్టం చేశారు.

వస్తు వైవిధ్యంలోనూ శిల్ప ప్రావీణ్యతలోనూ నూతన ఔన్నత్యాలను తెలుగు కథ అందుకున్నప్పటికీ దేశ వ్యాప్త ప్రాచుర్యం అది పొందలేక పోతున్నదని ఆయన విచారం వ్యక్తం చేశారు. ఇతర భాషల్లోకి ప్రధానంగా ఆంగ్ల భాషలోకి తెలుగు కథలను అనువదించక పోవడం వల్లనే ఆ పరిస్థితి ఏర్పడిందని రాజారాం అభిప్రాయపడ్డారు.

ఎనభై ఐదేళ్ళ తెలుగు కథకు మూడు తరాలు గడిచాయని ప్రసిద్ధ కథా రచయిత శ్రీ సింగమనేని నారాయణ అన్నారు 'నడుస్తున్న తెలుగు కథ' చర్చాగోష్ఠిలో ఆయన పాల్గొంటూ తొలితరం తెలుగు కథకు సంస్కరణ జాతీయోద్యమం ఇతివృత్తాలు కాగా రెండోతరం కథకులు మొదటితరం కథలలోని మూలాలను అందుకొని ఆ భావాలను మరింత పరిపుష్టం చేశారని శ్రీ సింగమనేని అన్నారు. మూడోతరం కథా రచనల్లో స్త్రీవాద విప్లవవాద దళితవాద ధోరణులు బహుళంగా స్పష్టమవుతున్నాయని, వీటికి కూడా మూలాలు మొదటి రెండు తరాల రచనల్లోనే సూచింపబడ్డాయని ఆయన అభిప్రాయపడ్డారు. చలం స్త్రీవాదాన్ని, రావిశాస్త్రి కులాతీతమయిన దళిత జీవన విధానాలను తమ రచనల్లో చిత్రించారని అవి ప్రస్తుత తరం రచయితల్లో మరింత ప్రగాఢతను సమకూర్చుకుంటున్నాయని శ్రీ సింగమనేని అన్నారు.

తెలుగు కథాగమనంలోని ఉరవడి మానవ జీవిత గమనంపైన ఆధారపడి ఉంటుందని శ్రీ వాకాటి పాండురంగా రావుఉద్ఘాటించారు. చర్చాగోష్ఠిలో ఆయన ప్రధానవక్తగా పాలుపంచుకొంటూ, అంతటా ఆవరించిన అనావృష్టి పరిస్థితులూ అనునిత్యం పెచ్చరిల్లుతున్న హింసాత్మక సంఘటనలు రాయలసీమలోని రచయితలను తన రచనా లక్ష్యాన్ని నిర్దేశించుకోమని ఆదేశిస్తున్నాయని ఆయన అన్నారు. అందుకే రాయలసీమ నుండి సామాజిక ప్రయోజనమున్న రచనలు సహజమయిన శిల్పంతో ఆవిష్కరించబడుతున్నాయి. సమాజంలోని వ్యక్తికి పాదార్థిక జీవితం ఎంత అవసరమో జీవిత విలువలు కూడా అంతే అవసరం. ఈ విలువల్ని విజ్ఞాన శాస్త్రం కానీ, కమ్యూనిష్టు సిద్ధాంతం కానీ మనకు అందించదు' అని శ్రీ

వాకాటి అభిప్రాయ పడ్డారు. ఆయన అభిప్రాయాలు సభను చర్చామార్గం వైపు వేడిగా నడిపించాయి. శ్రీ కాశీపతి, శ్రీ చంద్రశేఖర్ మొదలయి నవాళ్ళు చర్చలో పాల్గొన్నారు.

## పుస్తకావిష్కరణ

ఈ సదస్సులోనే రచయితల సంఘం పుస్తకావిష్కరణ కార్యక్రమాన్ని నిర్వహించింది. ప్రసిద్ధ కథా రచయిత శ్రీ విలుకూరి దేవపుత్రగారి 'ఏకాకి నౌక చప్పుడు' కథల సంపుటి ఆవిష్కరణ సాహితీమిత్రులకు ఆనందాన్ని కలిగించింది. శ్రీ వాకాటి పాండు రంగారావు కథల సంపుటిని ఆవిష్కరించి నేటి సమాజానికి అటువంటి పుస్తకాలు చాలా అవసరమని రచయితను అభినందించారు. ప్రసిద్ధ కథా రచయిత 'స్వామి' కథల సంపుటిని తనదైన శైలిలో సమీక్ష చేశారు. మధురాంతకంగారు ఆర్ద్ర హృదయంతో రచయితను ఆశీర్వదించారు. పుస్తక స్వీకర్త శ్రీ సింగమనేని 'దేవపుత్ర వయసులో నాకంటే చాలా చిన్నవాడయినా ఈ రోజు నాకు కృతి కన్యనిచ్చి మామ అయ్యారు' అంటూ చమత్కారం చిందించి స్పందించారు. మొదటి ఈ కార్యక్రమానికి శాంతి నారాయణ స్వాగతం చెప్పగా నాగలింగప్ప వందన సమర్పణ చేశారు.

## బహుమతి ప్రదానం

'రాయలసీమలో హింస' అనే అంశంపైన కథలపోటీ నిర్వహించి విజేతలకు బహుమతులను అందజేయడం కోసం ప్రధానంగా ఉద్దేశించిన సభ సాయంకాలం 6 గంటలకు ప్రారంభమయింది. ఇటీవలి కాలంలో సాహిత్య సభలకు పేరుగాంచిన అనంతపురం మరింత స్పందించిదేమో, రాయలసీమ పలు ప్రాంతాలనుండి, జిల్లా నలువైపుల నుండి వచ్చిన రచయితలతో స్థానిక సాహితీవేత్తలతో కళాభిమానులతో సభ కల కలలాడింది. జిల్లా రచయితల సంఘ గౌరవాధ్యక్షులయిన శ్రీ వై. కాశీపతి అధ్యక్షత జరిగిన సాయంకాల సభకు జిల్లా కలెక్టర్ డా. మన్మోహన్‌సింగ్ ముఖ్య అతిథిగా వచ్చి దాదాపు మూడు గంటలపాటు రచయితల మధ్య గడపడం ఆనందింపదగిన విషయం.

మొదట డా. జూపల్లి ప్రేంచంద్ సభా ప్రస్తావనచేసి అతిథులను రచయితలను వేదికమీదికి ఆహ్వానించారు. సంఘ కార్యదర్శి డా. శాంతి నారాయణ తన కార్యదర్శి నివేదికలో సంఘ కార్యక్రమాలను గురించి వివరించి అనంతపురం పట్టణంలో సజీవమయిన సాహిత్య వాతావరణానికి నిరంతరం కృషి చేస్తున్న జిల్లా రచయితల సంఘానికి ఒక సొంత చిరునామా కల్పించాలని అధికారులను అభ్యర్థించారు.

సభకు అధ్యక్షత వహించిన శ్రీ కాశీపతి మాట్లాడుతూ, రాయలసీమ ప్రాంతంలో పెరుగుతున్న హింసకు పీడకుల పీడితుల మధ్య అభివృద్ధి చెందుతున్న వైరుధ్యం కారణం కాదన్నారు. రాయలసీమ ఆర్థిక, సామాజిక స్థితిగతులను ప్రభుత్వాలు అభివృద్ధి పరచకపోగా ఉన్న వనరులను కూడా పరిరక్షించలేక పోతున్నాయని ఆయన సోదాహరణంగా

# వెలుగుల్ని పోగు చేస్తాను

**– తెలిదేవర భానుమూర్తి**

చీకటి గుహల్లో వెలుగు బంధించ బడిన వేళ
చలికోర్వలేక మూసిన ఇంటి తలుపుల్ని
కుక్క పిల్ల గీరుతున్న వేళ
ఊరి పొలిమేర నుండి పాడు బడ్డ గుడిలోని
కుంటి బిచ్చగాడి మూలుగు అస్పష్టంగా వినిపిస్తున్నవేళ
శ్మశానంలో
ఆరుతున్న చితిలోని బూడిదను గాలి రేపుతున్న వేళ
హితులూ; స్నేహితులూ
ఎవరూ నా గాయాన్ని మాన్పలేరని తెలుసుకున్న వేళ
బంధువులందరినీ విడిచి
బంధాలన్నిటినీ తెంచి
మోడు చెట్లతో స్నేహం చేస్తూ
ముళ్ళ పొదల్లో మెరిసే మిణుగురుల్ని చూస్తూ
నక్షత్రపు అక్షరాలతో అనుభవపు పాఠాల్ని రాస్తూ
ఎక్కడికో ఎక్కడికో
దూరంగా దూరంగా పోవాలని ఉన్నా ......
కుక్కపిల్ల దీనపు చూపు
కుంటి బిచ్చగాడి అస్పష్టపు మూలుగు
కదిలే కాళ్ళను కట్టి పడేసిన వేళ
ఎన్వేషిస్తునై ఎక్కడెక్కడో తిరుగలేను
ఎవరెస్టు శిఖరాల్ని అధిరోహించిన నా ఆదర్శాల్ని
అగాధపు లోయల్లోకి తోయలేను.
మోడు చెట్ల వారితో స్నేహం చేస్తూ
నిరాశ నిండిన కళ్ళ నుండి దూకే
అశ్రుజలపాతాల ఆవేదనా సంగీతాన్ని వింటూ
విచ్చుకున్న గాయాల విరిదండను మెళ్లో వేసుకొని
ఆరని చితిలాంటి హృదయాన్ని
ఆనందపు నందనవనమని భావిస్తూ
ఎక్కడికో ఎక్కడికో పోక ....
ఇక్కడే ఈ సమాజంలో ఉంటాను
అన్యాయం పన్నిన వలలో చిక్కిన నా కలల్ని
కటకటాల వెనుకనున్న నా ఆదర్శాల్ని విడిపిస్తాను.
ప్రపంచం కప్పుకున్న చీకటి దుప్పటిని
వెలుగు తన చేతులతో లాగి వేస్తున్న వేళ
సరసులోని తామర రేకుల్లా విప్పుకుంటున్న
ఆనందపు మేఘాల కళ్ళ నుండి
అమృతపు జల్లులు కురుస్తున్న వేళ
కన్నీళ్ళతో పాటు కళ్ళనుండి జారి పోయిన
వెలుగుల్ని పోగు చేస్తాను
మోడు చెట్ల మధ్యనున్న
పాడుబడ్డ గుడి లాంటి సమాజాన్ని మారుస్తాను●

వివరించారు. ఉపాధి అవకాశంలేని బడుగు వర్గాల యువకులు పాలకవర్గాలకు చెందిన విభిన్న సెక్షన్లకు చెందిన నాయకుల ముఠాల పోరులో గన్ పౌడర్‌గా మారుతున్నారని శ్రీ కాశీపతి ఆవేదన చెందారు. ఇక్కడ జరుగుతున్న జీవనగతిని ఈ ప్రాంత రచయితలు తమ రచనల్లో చిత్రించి మేధావులను ఆలోచింపజేయాలి' అంటూ ఆయన రచయితలను కోరారు.

ముఖ్య అతిథి శ్రీ మన్మోహన్ సింగ్ సభపట్ల, సభా విషయంపట్ల స్పందిస్తూ, భౌతికంగా శక్తివంతుడై కూడా మానసికంగా బలహీనంగా ఉన్న వ్యక్తి మాత్రమే హింసకు తలపడుతున్నాడని అటువంటి వ్యక్తుల మానసిక బలహీనతల్ని తొలగించి వారి భౌతికశక్తి సమాజాభ్యున్నతికి తోడ్పడే విధంగా చూడవలసిన బాధ్యత రచయితలదని చెప్పారు.

తమ కథలకు బహుమతులను పొందిన శ్రీ పడ్డపల్లి చిదంబరరెడ్డి, శ్రీ టి. రాఘవేంద్రరావు, డా. తుమ్మల రామకృష్ణ శ్రీ దాదాహయాత్ మాట్లాడుతూ తమ కథల నేపధ్యాన్ని వివరించారు. పోటీ కథలకు న్యాయనిర్ణేతగా వ్యవహరించిన శ్రీ వాకాటి పాండురంగారావు బహుమతి కథల మంచి సెబ్బరలను వివరిస్తూ హింస పట్ల రచయితల స్పందనను అభినందించారు.

అతిథులకు, రచయితలకు స్థానిక సాహిత్యాభిమానులు శ్రీ జి.పి. రామయ్యశెట్టి, శ్రీ ఎల్. రామిరెడ్డి జ్ఞాపికలను ప్రదానంచేసి బహుమతి విజేతలకు నగదును బహూకరించారు. రచయితల సంఘ కార్యవర్గ సభ్యులు శ్రీ నబిరసూల్ వందన సమర్పణతో సభ ముగిసింది. ●

# రెక్కల కింద పసితనం

**- నూకా రాంప్రసాద్ రెడ్డి**



జ్ఞాపకాల గవాక్షాల్లోంచి తొంగిచూస్తే
నా బాల్యపు ఛాయా చిత్రాలు కన్పిస్తాయి

స్తన్యమిచ్చే తల్లిని కోల్పోయి
నిరాశ చెట్టు కింద నరాలతీగల
స్వేచ్ఛా గీతాల్ని తెగ్గోసుకోలేక
నిక్కరులా జారిపోతున్న ధైర్యాన్ని ఎగదోసుకుంటూ
ఆశల రేఖా వర్ణపటాన్ని గీసుకుంటున్నాను

నేను ఏరుకోకపోయినా సానుభూతి రాల్తూనే వుంటుంది
ఏ కపటమెరుగని నా కనురెప్పలు అలసిపోతే
నా పసిమనసే జోలపాట పాడుతుంది
నా బాల్యాన్ని వెన్నెల్లో నా గోరుముద్దల్లోనో పారేసుకోలేదు

అనాధనై వెట్టిచాకిరీనై
దారిద్ర్యపు మడతకిందపెట్టి మరచిపోయాను

నా బాల్యం నన్ను
బతుకులోకి నెట్టింది మనిషిలోకి జారవిడిచింది
నేనెప్పుడైనా మావూరి పెన్నలో పడుకున్నప్పుడు
ఇసక తడిగా తగుల్తుంటుంది
నాబాల్యంలా! ●

## రచనలకు నేత్రం ఆహ్వానం

* కథలు, కవితలు, సాహిత్య విమర్శలు, కార్టూన్లు పంపవల్సిందిగా 'నేత్రం' సాహితీ త్రైమాస పత్రిక ఆహ్వానిస్తోంది.
* మీ ప్రాంతాలలో జరిగిన సాహిత్య సభలు, సమావేశాలు, సాహిత్యానికి సంబంధించిన పోటీలు, అవార్డుల వివరాలు ఫొటోలు పంపవల్సిందిగా సాహితీసంస్థలకు ప్రత్యేక మనవి. సమాచారం సంక్షిప్తంగా వుండాలి.
* రచనలు సామాజిక స్పృహ కల్పించేవిగా ఇంటిల్లిపాది చదివేవిగా వుండాలి.

**ది ఎడిటర్**

**నేత్రం సాహితీ త్రైమాసపత్రిక**

**రూమ్ నెం.-5, అలమ్ కాంప్లెక్స్, సెవన్‌రోడ్స్, - కడప 516 001**

Editor : **SASISREE**, Printed and Published by Him.
Room No-5, Alam Complex, 7 Roads, Cuddapah-516 001, A.P.

# రాయలసీమ గ్రామీణ బ్యాంక్

ప్రధాన కార్యాలయము, కడప. ఫోన్ : 44153.




కృషితో నాస్తి దుర్భిక్షం

| | | | | |
|---|---|---|---|---|
| స్థాపితం | : | 06-08-1976 | | |
| శాఖలు | | కడప | ... | 67 |
| | | కర్నూలు | ... | 60 |
| | | ప్రకాశం | ... | 15 |
| | | మొత్తం | ... | 142 |
| | : | కర్నూలు | ... | 4 |
| | | కడప | ... | 4 |
| | : | (ఆరు) | | 6 |
| | : | డిపాజిట్లు .. 134.00 - కోట్లు | | |
| రైతుసేవా, సహకార సంఘాలు | : | ఋణాలు .. 165.00 - కోట్లు | | |
| | : | సేవింగ్స్ బ్యాంకు | | |
| ప్రాంతీయ కార్యాలయాలు | | కరెంటు అకౌంటు | | |
| 28-2-95వ తేది నాటికి | | ఫిక్సడ్ | | |
| బ్యాంకు సాధించిన ప్రగతి | | కామధేను | | |
| డిపాజిట్ల పథకాలు | | లక్ష్మి క్యాష్ సర్టిఫికేట | | |
| | | జన భద్రత | | |
| | | సంరక్ష : ఇన్సూరెన్స్ లింక్డ్ డిపాజిట్ | | |
| 1994-95 వ సంవత్సరానికి | : | డిపాజిట్లు - రు.140 కోట్లు | | |
| నిర్ణయించుకొన్న లక్ష్యాలు | | ఋణాలు - రు.200 కోట్లు | | |
| | | వసూళ్లు 65 శాతం | | |
| | | ఋణాల పంపిణీ 100 కోట్లు | | |

**అన్నిరకాల డిపాజిట్లకు నామినేషన్ సదుపాయము కలదు**

"రాయలసీమ గ్రామీణ బ్యాంకులో పొదుపు
మీ ఉజ్వల భవిష్యత్తుకు బంగారు మలుపు."